# ఓమ్.

## శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# శ్రీ భ గ వ ద్గీ తా మా హా త్మ్య మ్.

శౌనక ఉవాచ.

గీతాయాశ్చైవమాహాత్మ్యం యథావత్సూతమేవద।
పురాణమునినాప్రోక్తం వ్యాసేనమునినోదితమ్॥ ౧

సూత ఉవాచ.

పృష్టం భవద్భి ఋషిభి ర్యద్గోప్యం పురాతనమ్।
శక్యతే కేనవై వక్తుం గీతామాహాత్మ్య ముత్తమమ్॥ ౧॥
కృష్ణోజానాతి వై సమ్యక్ కించిత్కుంతీసుతః ఫలమ్।
వ్యాసోవా వ్యాసపుత్రోవా యాజ్ఞవల్క్యోథమైథిలః।౩॥
అన్యేశ్రవణతః శ్రుత్వా లేశం సంకీర్తయంతిచ।
తస్మాత్కించిద్వదామ్యత్ర వ్యాసస్యాస్యాన్మయాశ్రుతమ్॥

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః।
పార్థో వత్స స్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥ ౫।

సారథ్య మర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ।
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః॥ ౬।

సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః।
గీతానావం సమారుహ్య పారం యాతి సుఖేన సః॥ ౭।

గీతాజ్ఞానం శ్రుతం నైవ సదైవాభ్యాస యోగతః।
మోక్షమిచ్ఛతి మూఢాత్మా యాతి బాలక హాస్యతామ్॥ ౮॥

యే శృణ్వన్తి పఠన్త్యేవ గీతాశాస్త్రం మహర్నిశమ్।
న తే వై మానుషా జ్ఞేయా దేవరూపా న సంశయః॥ ౯॥

గీతాజ్ఞానేన సంబోధ్య కృష్ణః ప్రాహార్జునాయ వై।
అష్టాదశ పదస్థానం గీతాధ్యాయే ప్రతిష్ఠితమ్॥ ౧౦॥

మోక్షస్థానం పరం పార్థ! సగుణం వాఽథ నిర్గుణమ్।
సోపానాష్టదశై రేవం పరం బ్రహ్మాధిగచ్ఛతి॥ ౧౧॥

మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే।
సకృద్గీతాంభసి స్నానం సంసార మల నాశనమ్॥ ౧౨॥

పురా స్యాన్న శ్రుతం జ్ఞానమ్ తస్మిన్ శ్రద్ధానభావనా!
గీతాయాశ్చ నజానాతి పఠనం నైవ పాఠనమ్॥ ౧౩॥

స ఏవ మానుషే లోకే మనుజో విడ్వరాహకః।
తస్మాద్గీతాం నజానాతి నాధమస్తత్పరోజనః॥ ౧౪॥
ధిక్తస్య మానుషం దేహమ్ ధిగ్జ్ఞానం కులశీలతామ్।
గీతార్థం నవిజానాతి నాధమస్తత్పరో జనః॥ ౧౫॥
ధిక్శరీరం శుభం శీలమ్ విభవం సద్గృహాశ్రమమ్।
గీతాశాస్త్రం నజానాతి నాధమస్తత్పరో జనః॥ ౧౬॥

ధి క్ష్యాగ్నికల్ప్యం ప్రతిష్ఠాంచ పూజాం మానం మహాత్మతామ్।
గీతాశాస్త్రే రతిర్నాస్తి సర్వం తన్నిష్ఫలం జగుః॥ ౧౭॥

ధి క్తస్య జ్ఞానమాచారం వ్రతం నిష్ఠా తపో యశః।
గీతార్థపఠనం నాస్తి నాధమస్తత్పరో జనః॥ ౧౮॥

గీతాగీతం న యజ్ఞానం తద్విద్ధ్యాసుర సమ్మతమ్।
తన్మోఘం ధర్మరహితం వేదవేదాన్త గర్హితమ్॥ ౧౯॥

తస్మాద్ధర్మమయీ గీతా సర్వజ్ఞానప్రయోజికా।
సర్వశాస్త్రమయీ యస్మాత్తస్మాద్గీతా విశిష్యతే॥ ౨౦॥

యోఽధీతే నిత్య గీతాంచ దివారాత్రం యథార్థతః।
స్వపఞ్జాగ్రన్ చలం స్తిష్ఠన్ఛాశ్వతం మోక్షమాప్నుయాత్॥

సాలగ్రామశిలాయాంతు దేవాగారే శివాలయే।
తీర్థే నద్యాం పఠేద్యస్తు వైకుణ్ఠం యాతి నిశ్చితమ్॥ ౨౧॥

దేవకీనన్దనః కృష్ణో గీతాపాఠేన తుష్యతి।
యథా న వేదైర్దానేన యజ్ఞతీర్థవ్రతాదిభిః॥ ౧౩॥

గీతాధీతా చ యేనాపి భక్తిభావేన చేతసా।
తేన వేదాశ్చ శాస్త్రాణి పురాణాని చ సర్వశః॥ ౧౪॥

యోగిస్థానే సిద్ధపీఠే శిష్టాగ్రే సత్సభాసు చ।
యజ్ఞే చ విష్ణుభక్తాగ్రే పఠన్యాతి పరాంగతిమ్॥ ౧౫॥

గీతాపాఠంచ శ్రవణం యః కరోతి దినే దినే।
క్రతవో వాజిమేధాద్యాః కృతాస్తేన సదక్షిణాః॥ ౨౬॥

యశ్శృణోతి చ గీతార్థం కీర్తయత్యేవ యః పుమాన్।
శ్రావయేచ్చ పరార్థం వై స ప్రయాతి పరం పదమ్॥ ౨౭॥

గీతాయాః పుస్తకం నిత్యం యోఽర్చయత్యేవ సాదరాత్।
విధినా భక్తిభావేన తస్య పుణ్యఫలం శృణు॥ ౨౮॥

సకలాభూః కృతాతేన యజ్ఞ స్తం భవతీ కిల।
కృతాని సర్వతీర్థాని దానానిచ బహూన్యపి॥ ౨౯॥

భూత ప్రేత పిశాచాద్యా స్తత్ర న ప్రవిశన్తి వై।
అభిచారోద్భవం దుఃఖం పరేణాపి కృతంచ యత్॥ ౩౦॥

నోపసర్పతి తత్రైవ యత్ర గీతార్చనం గృహే।
తాపత్రయోద్భవా పీడా నైవ వ్యాధి భయం క్వచిత్॥

నశాపో నైవ పాపంచ దుర్గతి ర్నారకీ నచ।
దేహేరయః షడేతేవై నబాధన్తే కదాచన॥ ౩౨॥

భగవత్పరమేశానే భక్తి రవ్యభిచారిణీ।
జాయతే సతతం తత్ర యత్ర గీతాభినన్దనమ్॥ ౩౩॥

ప్రారబ్ధం భుఞ్జమానోపి గీతాభ్యాసరత స్సదా।
సముక్త స్ససుఖీ లోకే కర్మణా నోపలిప్యతే॥ ౩౪॥

మహాపాపాది పాపాని గీతాధ్యాయీ కరోతిచేత్।
నకిఞ్చిత్ స్పృశతే తస్య నలినీదలమమ్భసా॥ ౩౫।

స్నాతోవా యదివాస్నాతః శుచిర్వా యదివాశుచిః।
విభూతిం విశ్వరూపంచ సంస్మరన్ సర్వదా శుచిః॥ ౩౬॥

అనాచారోద్భవం పాప మవాచ్యాది కృతం చ యత్।
అభక్ష్య భక్షజం దోష మస్పర్శ స్పర్శజం తథా॥ ౩౭॥

జ్ఞానాజ్ఞానకృతం నిత్య మిన్ద్రియై ర్జనితం చ యత్।
తత్సర్వం నాశమాయాతి గీతాపాఠేన తత్ క్షణాత్॥ ౩౮॥

సర్వత్ర ప్రతిభుక్త్వాచ ప్రతిగృహ్యాచ సర్వశః।
గీతాపాఠం ప్రకుర్వాణో నలిప్యేత కదాచన॥ ౩౯॥

రత్నపూర్ణాంమహీం సర్వాం ప్రతిగృహ్య విధానతః।
గీతాపాఠేన చైకేన శుద్ధస్ఫటికవ త్సదా॥ ౪౦॥

యస్యాన్తఃకరణం నిత్యం గీతాయాం రమతే సదా।
సర్వాగ్నికస్సదాజాప క్రియావాన్ సచ పణ్డితః॥ ౪౧॥

దర్శనీయస్సధనవాన్ సయోగీ జ్ఞానవానపి।
సఏవ యాజ్ఞికో యాజీ సర్వవేదార్థదర్శకః॥ ౪౨॥

గీతాయాః పుస్తకం యత్ర నిత్యపాఠశ్చ వర్తతే।
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని భూతలే॥ ౪౩॥

నివసన్తి సదా గేహే దేహే దేశేపి సర్వదా।
సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే॥ ౪౪॥
గోపాల బాలకృష్ణోపి నారదో ధ్రువపార్షదైః।
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే॥ ౪౫॥
యత్ర గీతా విచారశ్చ పఠనం పాఠనం తథా।
తత్రాహం నిశ్చితం పార్థ! నివసామి సదైవహి॥ ౪౬॥

గీతా మే హృదయం పార్థ! గీతా మే సార ముత్తమమ్।
గీతా మే జ్ఞాన మత్యగ్ర్యం గీతా మే జ్ఞాన మవ్యయమ్।
గీతా మే చోత్తమం స్థానం గీతా మే పరమం పదమ్।
గీతా మే పరమం గుహ్యం గీతా మే పరమో గురుః॥ ౪౮॥

గీతాశ్రయేఽహం తిష్ఠామి గీతా మే పరమం గృహమ్।
గీతాజ్ఞానం సమాశ్రిత్య త్రిలోకీం పాలయా మ్యహమ్॥ ౪౯॥

గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః।
అర్ధమాత్రా క్షరా నిత్య మనిర్వాచ్య పదాత్మికా॥ ౫౦॥

గీతా నామాని వక్ష్యామి గుహ్యాని శృణు పాణ్డవ!।
కీర్తనా త్సర్వపాపాని విలయం యాన్తి తత్ క్షణాత్॥

గీతా గఙ్గా చ గాయత్రీ సీతా సత్యా పతివ్రతా।
బ్రహ్మవల్లీ బ్రహ్మవిద్యా త్రిసన్ధ్యా ముక్తిగేహినీ॥ ౫౧॥

అర్ధమాత్రా చిదానన్దా భవఘ్నీ భ్రాన్తినాశినీ।
వేదత్రయీ పరానన్దా తత్త్వార్థ జ్ఞానమఞ్జరీ॥ ౫౩॥

ఇత్యేతాని జపేన్నిత్యం నరో నిశ్చల మానసః।
జ్ఞానసిద్ధిం లభేచ్ఛీఘ్రం తథాన్తే పరమం పదమ్॥ ౫౪॥

పాఠే సమర్థ స్సంపూర్ణే తదర్థం పాఠ మాచరేత్।
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః॥ ౫౫॥

త్రిభాగం పఠమానస్తు సోమయాగ ఫలం లభేత్।
షడంశం జపమానస్తు గఙ్గాస్నాన ఫలం లభేత్॥ ౧౬।

తథాధ్యాయద్వయం నిత్యం పఠమానో నిరన్తరమ్।
ఇన్ద్రలోక మవాప్నోతి కల్పమేకం వసేద్ధ్రువమ్॥ ౧౭।

ఏకమధ్యాయకం నిత్యం పఠతే భక్తి సంయుతః।
రుద్రలోక మవాప్నోతి గణోభూత్వా వసేచ్చిరమ్॥ ౧౮

అధ్యాయార్ధం చ పాదం వా నిత్యం యః పఠతే జనః।
సమేతి రవిలోకం చ మన్వన్తర సమాశ్శతమ్॥ ౧౯॥

గీతాయా శ్లోక దశకం సప్త పఞ్చ చతుష్టయమ్।
త్రిద్వ్యేక మేక మర్ధంవా శ్లోకానాం యః పఠే న్నరః॥
చన్ద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం తథా।
గీతార్థ మేక పాదంచ శ్లోకమధ్యాయ మేవ చ॥ ౨౦॥

స్మరన్ స్త్యక్త్వా జనోదేహం ప్రయాతి పరమంపదమ్।
గీతార్థంవాపి పాఠం వా శృణుయా దన్తకాలతః॥ ౬౧॥

మహాపాతక యుక్తోపి ముక్తిభాగీ భవేజ్జనః।
గీతాపుస్తక సంయుక్తః ప్రాణాం స్త్యక్త్వా ప్రయాతియః॥

వైకుణ్ఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే।
గీతాధ్యాన సమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్॥

గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్।
గీతో చ్చారణ సంయుక్తో మ్రియమాణో గతింలభేత్ ॥ ౬౫॥

యద్యత్కర్మచ సర్వత్ర గీతా పాఠ ప్రకీర్తిమత్।
తత్తత్కర్మచ నిర్దోషం భూత్వా పూర్ణత్వ మాప్నుయాత్॥

పితౄ నుద్దిశ్య యః శ్రాద్ధే గీతాపాఠం కరోతివై।
సన్తుష్టాః పితర స్తస్య నిరయాద్యాన్తి సద్గతిమ్॥ ౬౭॥

గీతాపాఠేన సన్తుష్టాః పితరః శ్రాద్ధతర్పితాః।
పితృలోకం ప్రయాన్త్యేవ పుత్రాశీర్వాద తత్పరాః॥ ౧౮॥

లిఖిత్వా ధారయేత్కణ్ఠే బాహుదణ్డేచ మస్తకే।
నశ్యన్త్యుపద్రవా స్సర్వే విఘ్నరూపాశ్చ దారుణాః॥ ౧౯॥

గీతాపుస్తక దానంచ ధేనుపుచ్ఛ సమన్వితమ్।
దత్వా తత్సద్ద్విజే సమ్యక్ కృతార్థో జాయతే జనః॥ ౨౦॥

పుస్తకం హేమ సంయుక్తం గీతాయాః శుద్ధమానసః।
దత్వా విప్రాయ విదుషే జాయతే న పునర్భవః॥ ౭౦॥

శతపుస్తక దానంచ గీతాయాః ప్రకరోతి యః।
సయాతి బ్రహ్మసదనం పునరావృత్తి దుర్లభమ్॥ ౭౧॥

గీతాదాన ప్రభావేన సప్తకల్పావధింసమాః।
విష్ణులోక మవాప్నోతి విష్ణునా సహమోదతే॥ ౭౩॥

సమ్యక్ శ్రుత్వాచ గీతార్థం పుస్తకం యః ప్రదాపయేత్।
తస్మై ప్రీతోహి భగవాన్ దదాతి మనసేప్సితమ్॥ ౭౪॥

దేహం మానుష మాశ్రిత్య చాతుర్వర్ణ్యేషు భారత!।
నశృణోతి నపఠతి గీతా మమృతరూపిణీమ్॥ ౭౫॥

హస్తాత్త్యక్త్వామృతం ప్రాప్తం కష్టాత్ క్ష్వేడం సమశ్నుతే।
పీత్వా గీతామృతం లోకే లబ్ధ్వా మోక్షం సుఖీ భవేత్॥

జనై స్సంసార దుఃఖార్తై ర్గీతాజ్ఞానం చ యైః శ్రుతమ్।
సంప్రాప్త మమృతంతైశ్చ గతాస్తే సదనం హరేః॥ ౭౭॥

గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః।
నిర్ధూత కల్మషా లోకే గతాస్తే పరమం పదమ్॥ ౭౮॥

గీతాసు నవిశేషోస్తి జనేషూచ్చావచేషు చ।
జ్ఞానేష్వేవ సమగ్రేషు సమా బ్రహ్మస్వరూపిణీ॥ ౭౯॥

యోఽభ్యసూయతి గీతాంచ యోనిన్దాం వా కరోతిచ।
సమేతి నరకం ఘోరం యావదా భూతసంప్లవమ్॥ ౮౦॥

అవజ్ఞాకారేణ మూఢాత్మా గీతార్థం నైవమన్యతే।
కుంభీపాకేషు పచ్యేత యావత్కల్పక్షయో భవేత్॥ ౮౧॥

గీతార్థం వాచ్యమానం యో నశృణోతి సమీపతః।
శ్వసూకరభవాం యోని మనేకాం సోఽధిగచ్ఛతి॥ ౮౨॥

చౌర్యం కృత్వాచ గీతాయాః పుస్తకం యస్సమానయేత్।
నతస్మైచ ఫలం కించిత్ పఠనాచ్చ వృథాభవేత్॥ ౮౩।

యః శ్రుత్వా నైవగీతార్థ మోదతే పరమార్థతః।
నైవాప్నోతి ఫలంలోకే ప్రమాదాచ్చ వృథాశ్రమః॥ ౮౪॥

గీతాం శ్రుత్వా హిరణ్యంచ పట్టాంబర ప్రవేష్టనమ్।
నివేదయేచ తద్వక్త్రే ప్రీతయే పరమాత్మనః॥ ౮౫॥

వాచకం పూజయేద్భక్త్యా ద్రవ్య వస్త్రాద్యుపస్కరైః।
అనేకై ర్బహుధా ప్రీత్యా తుష్యతాం భగవాన్ హరిః॥

మాహాత్మ్యమేత ద్గీతాయాః కృష్ణ ప్రోక్తం పురాతనమ్।
గీతాన్తే పఠతే యస్తు యథోక్త ఫలభాగ్భవేత్॥ ౮౨॥

గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్।
వృథా పాఠఫలం తస్య శ్రమఏవ ఉదాహృతః॥ ౮౮॥

ఏతన్మాహాత్మ్య సంయుక్తం గీతాపాఠం కరోతియః।
శ్రద్ధయా యః శృణోత్యేవ దుర్లభాం గతి మాప్నుయాత్।
శ్రుత్వా పఠిత్వా గీతాంచ మాహాత్మ్యం యశ్శృణోతి చ।
తస్య పుణ్యఫలం లోకే భవేద్వై మనసేప్సితమ్॥ ౯౦॥



ఇతి శ్రీభగవద్గీతామాహాత్మ్యం సమాప్తమ్.

# ఓమ్.

## శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

## అథ గీతార్థసంగ్రహః ప్రారభ్యతే.



విగాహేయామునం తీర్థం సాధు బృందావనే స్థితమ్।
నిరస్త జిహ్మగస్పర్శే యత్రకృష్ణః కృతాదరః॥ ౧

స్వధర్మజ్ఞాన వైరాగ్య సాధ్యభక్త్యేకగోచరః।
నారాయణఃపరంబ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః॥ ౨

జ్ఞానకర్మాత్మికే నిష్ఠే యోగలక్ష్యే సుసంస్కృతే।
ఆత్మానుభూతి సిద్ధ్యర్థే పూర్వషట్కేన చోదితే॥ ౩॥

మధ్యమే భగవత్తత్త్వ యాథాత్మ్యావాప్తి సిద్ధయే।
జ్ఞానకర్మాభి నిర్వర్త్యో భక్తియోగః ప్రకీర్తితః॥ ౪॥

ప్రధానపురుషవ్యక్త సర్వేశ్వర వివేచనమ్।
కర్మధీర్భక్తిరిత్యాది పూర్వశేషోన్తిమోదితః॥ ౫।

అస్థానస్నేహ కారుణ్య ధర్మాధర్మధియాకులమ్।
పార్థం ప్రపన్న ముద్దిశ్య శాస్త్రావతరణం కృతమ్॥ ౬॥

నిత్యాత్మా సఙ్గకర్మేహా గోచరా సాంఖ్య యోగధీః।
ద్వితీయేస్థితధీలక్ష్యా ప్రోక్తాతన్మోహశాంతయే॥ ౭॥

అసక్త్యాలోకరక్షాయై గుణేష్వారోప్య కర్తృతామ్।
సర్వేశ్వరేవాన్యస్యోక్తా తృతీయేకర్మకార్యతా॥ ౮॥

ప్రసఙ్గాత్స్వస్వభావోక్తిః కర్మణోఽకర్మతాస్య చ।
భేదాజ్ఞానస్య మాహాత్మ్యం చతుర్థాధ్యాయ ఉచ్యతే॥ ౯॥

కర్మయోగస్య సౌకర్యం శైఘ్ర్యకశ్చనతద్విధః।
బ్రహ్మజ్ఞాన ప్రకారశ్చ పంచమాధ్యాయ ఉచ్యతే॥ ౧౦॥

యోగాభ్యాసవిధిర్యోగీ చతుర్ధా యోగసాధనమ్।
యోగసిద్ధి స్స్వయోగస్య పారమ్యం షష్ఠ ఉచ్యతే॥౧౧॥

స్వయాథాత్మ్యం ప్రకృత్యాస్య తిరోధిః శ్శరణాగతిః।
భక్తిభేదః ప్రబుద్ధస్య శ్రైష్ఠ్యం సప్తమ ఉచ్యతే॥ ౧౨॥

ఐశ్వర్యాక్షరయాథాత్మ్యం భగవచ్ఛరణార్థినామ్।
వేద్యోపాదేయ భావానా మష్టమే భేద ఉచ్యతే॥ ౧౩॥

స్వమాహాత్మ్యం మనుష్యత్వే పరత్వంచ మహాత్మనామ్।
విశేషో నవమే యోగో భక్తిరూపః ప్రకీర్తితః॥ ౧౪॥

స్వకల్యాణగుణానన్త్య కృత్స్నస్వాధీనతామతిః।
భక్త్యుత్పత్తి వివృద్ధ్యర్థం విస్తీర్ణా దశమోదితా॥ ౧౫॥

ఏకాదశేఽస్యయాథాత్మ్యం సాక్షాత్కారావలోకనమ్।
దత్తముక్తావిధిప్రాప్త్యోః ర్భక్త్యైకోపాయతా తథా॥ ౧౬॥

భక్తిశ్రైష్ఠ్యముపాయోక్తి రశక్త స్యాత్మనిష్ఠతా।
తత్ప్రకారా త్వతిప్రీతి ర్భక్తే ర్ద్వాదశ ఉచ్యతే॥ ౧౭॥

దేహస్వరూప మాత్మాప్తి హేతు రాత్మవిశోధనమ్।
బన్ధహేతు ర్వివేకశ్చ త్రయోదశ ఉదీర్యతే॥ ౧౮॥

గుణంబద్ధవిధా తేషాం కర్తృత్వం తన్నివర్తనమ్।
గతిత్రయస్య మూలత్వం చతుర్దశ ఉదీర్యతే॥ ౧౯॥

అచిన్మిశ్రా ద్విశుద్ధాచ్చ చేతనా త్పురుషోత్తమః।
వ్యాపనా ద్భరణా త్స్వామ్యా దన్యః పంచదశోదితః॥ ౨౦॥

దేవాసుర విభాగోక్తి పూర్వికా శాస్త్రవశ్యతా।
తత్త్వానుష్ఠాన విజ్ఞాన స్థానే షోడశ ఉచ్యతే॥ ౨౧॥

అశాస్త్రమాసురం కృత్స్నం శాస్త్రీయం గుణతః పృథక్।
లక్షణం శాస్త్రసిద్ధస్య త్రిధా సప్తదశోదితమ్॥ ౨౨॥

ఈశ్వరే కర్తృతాబుద్ధిః సత్త్వోపాదేయతాన్తిమే।
స్వకర్మ పరిణామశ్చ శాస్త్రసారార్థ ఉచ్యతే॥ ౨౩॥

కర్మయోగ స్తప స్తీర్థ దాన యజ్ఞాది సేవనమ్।
జ్ఞానయోగో జితస్వాన్తైః పరిశుద్ధాత్మని స్థితిః॥ ౨౪॥

భక్తియోగః పరైకాంత ప్రీత్యా ధ్యానాదిషు స్థితిః।
త్రయాణామపి యోగానాం త్రిభిరన్యోఽన్య సఙ్గమః॥

నిత్య నైమిత్తికానాం చ పరారాధన రూపిణామ్।
ఆత్మదృష్టే స్త్రయోప్యేతే యోగద్వారేణ సాధకాః॥

నిరస్త నిఖిల జ్ఞానో దృష్ట్వాఽఽత్మానం పరానుగమ్।
ప్రతిలభ్య పరాం భక్తిం తయైవాప్నోతి తత్పదమ్॥ ౨౭॥

భక్తియోగ స్తదర్థీ చేత్ సమగ్రైశ్వర్య సాధనమ్।
ఆత్మార్థీ చ త్రయోఽప్యేతే తత్కైవల్యస్య సాధకాః॥ ౨౮॥

ఐకాంత్యం భగవత్యేషాం సమాన మధికారిణామ్।
యావత్ప్రాప్తి పరార్థీ చేత్ తదేవాత్యన్త మశ్నుతే॥ ౨౯॥

జ్ఞానీతు పరమైకాన్తీ తదాయత్తాత్మజీవనః।
తత్సంశ్లేషవియోగైక సుఖదుఃఖస్తదేకధీః॥ ౩౦॥

భగవద్ధ్యానయోగోక్తి వన్దన స్తుతి కీర్తనైః।
లబ్ధాత్మా తద్గతప్రాణ మనో బుద్ధీన్ద్రియ క్రియః॥ ౩౧॥

నిజకర్మాది భక్త్యన్తం కుర్యాత్ప్రీత్యైవ కారితః।
ఉపాయతాం పరిత్యజ్య న్యసేద్దేవేతు తామభీః॥ ౩౨॥

ఐకాంత్యాత్యన్తదాస్యైక రతిస్తత్పదమాప్నుయాత్।
తత్ప్రధాన మిదం శాస్త్ర మితి గీతార్థ సంగ్రహః॥ 33॥

శ్రీమద్గీతార్థసంగ్రహః
సమాప్తః.

---

## అథ అష్టాదశశ్లోకీ గీతా ప్రారభ్యతే.

అర్జున ఉవాచ.

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ! ।
నచ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే॥ ౩౧॥

శ్రీభగవానువాచ.

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ।
సిద్ధ్యసిద్ధ్యో స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥
కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్సఉచ్యతే॥ ౬॥

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేన్ద్రియః।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచి రేణాధిగచ్ఛతి॥ ౩౯॥
యతేన్ద్రియ మనోబుద్ధి ర్మునిర్మోక్ష పరాయణః।
విగతేచ్ఛా భయ క్రోధో యస్సదా ముక్త ఏవ సః॥ ౨౮॥
యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు॥
యుక్త స్వప్నా వబోధస్య యోగో భవతి దుఃఖ హా॥౧౭॥
దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।

మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే। ౧౪॥
అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥ ౨౪।
అపిచేత్సు దురాచారో భజతే మా మనన్యభాక్।
సాధు రేవ సమన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః॥ 30।
యోమా మజ మనాదించ వేత్తి లోక మహేశ్వరమ్।
అసమ్మూఢ స్సమర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే। 3।

మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః।
నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ ! ॥ ౫౫॥
శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మఫల త్యాగ స్త్యాగా చ్ఛాన్తి రనన్తరమ్॥ ౧౨॥
క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత।
క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ॥ 3॥
మాంచయోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।

సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే। ౨౬॥

నిర్మానమోహా జితసఙ్గదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః। [తత్॥
ద్వన్ద్వైర్విముక్తా స్సుఖదుఃఖ సంజ్ఞైర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం

యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥ ౨౩॥

మనఃప్రసాదస్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః।
భావసంశుద్ధిరిత్యేత త్తపో మానస ఉచ్యతే॥ ౧౬॥

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥౬౬॥
గీతాసార మిదం పుణ్యం యఃపఠే త్సుసమాహితః।
విష్ణులోక మవాప్నోతి భయ శోక వినాశనమ్॥

ఇతి అష్టాదశశ్లోకీ గీతా సమ్పూర్ణా.

# అథ సప్తశ్లోకీగీతా ప్రారమ్భః.



ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్దేహం సయాతి పరమాం గతిమ్॥ ౩౩॥

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః॥ ౩౬॥

సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥ ౧౪॥

కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాం సమనుస్మరేద్యః।
సర్వస్యధాతార మచిన్త్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్। ౯।
ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్। ౧।
సర్వస్యచాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ।

వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో
వేదాన్తకృ ద్వేదవిదేవ చాహమ్॥ ౧౫॥

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥ ౩౪॥

—:o:—

ఇతి సప్తశ్లోకీ గీతా సమాప్తా.

---

## అథ కరన్యాసః.

---

ఓమ్॥ అస్యశ్రీభగవద్గీతా మహామన్త్రస్య॥
భగవాన్వేదవ్యాస ఋషిః॥ అనుష్టుప్ ఛన్దః॥
శ్రీకృష్ణపరమాత్మా దేవతా॥ [జం
అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషస ఇతి బీ
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేశక్తిః॥
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ
ఇతికీలకమ్॥

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావక
ఇత్యఙ్గుష్ఠాభ్యాంనమః॥
నచైనంక్లేదయన్త్యాపో నశోషయతి మారుత
ఇతి తర్జనీభ్యాంనమః॥
అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య
ఏవేతి మధ్యమాభ్యాంనమః॥
నిత్యస్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతన
ఇత్యనామికాభ్యాంనమః॥

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథసహస్రశ
ఇతి కనిష్ఠికాభ్యాంనమః॥
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచేతి
కరతలకరపృష్ఠాభ్యాంనమః॥

---

ఇతి కరన్యాసః.

---

## అథ హృదయాది న్యాసః.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావక
ఇతి హృదయాయనమః॥

నచైనం క్లేదయన్త్యాపో నశోషయతి మారుత
ఇతి శిరసేస్వాహా॥

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య
ఏవచేతి శిఖాయైవౌషట్।

నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతన
ఇతి కవాచయహుమ్॥

పశ్య మే పార్థరూపాణి శతశోఽథ సహస్రశ
ఇతి నేత్రత్రయాయవౌషట్॥

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచే త్యస్త్రాయఫట్॥

---

శ్రీకృష్ణప్రీత్యర్థే పాఠేవినియోగః॥



# అథ ధ్యానమ్.



పార్థాయ ప్రతిబోధితాం భగవతానారాయణేన స్వయం
వ్యాసేనగ్రథితాం పురాణ మునినా మధ్యే మహాభారతే।
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం
అంబత్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్॥౧।

నమోఽస్తుతే వ్యాసవిశాల బుద్ధే
ఫుల్లారవిందాయత పత్రనేత్ర।

యేన త్వయా భారతతైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః। ౨।

ప్రపన్న పారిజాతాయ తోత్రవేత్రైకపాణయే।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృత దుహే నమః। ౩।
సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః।
పార్థోవత్స సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్। ౪।

వసుదేవసుతం దేవం కంసచాణూర మర్దనం
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్॥ ౫॥

భీష్మద్రోణతటా జయద్రథజలా గాన్ధార నీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణవహనీ కర్ణేన వేలాకులా।
అశ్వత్థామ వికర్ణ ఘోర మకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణా ఖలు పాణ్డవై రణనదీ కైవర్తకః కేశవః॥ ౬॥

పారాశర్యవచఃసరోజ మమలం గీతార్థ గంధోత్కటం
నానాఖ్యాన క కేసరం హరికథా సంబోధనా బోధితం।
లోకే సజ్జన షట్పదై రహరహః పేపీయమానం ముదా
భూయాత్ భారత పంకజం కలిమల ప్రధ్వంస నశ్శ్రేయసే॥

మూకంకరోతి వాచాలం పంగుం లంఘయతేగిరిమ్।
యత్కృపా తమహం వన్దే పరమానంద మాధవమ్॥ ౮॥

యం బ్రహ్మా వరుణేంద్ర రుద్ర మరుతః దివ్యైః స్తున్వంతి స్తవైః
వేదైః సాంగపదక్రమోపనిషదైః గాయంతియం సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినో
యస్యాంతం నవిదుః సురా సురగణా దేవాయ తస్మైనమః॥



ఇతి ధ్యానమ్.

ఓమ్

శ్రీకృష్ణాయపరబ్రహ్మణేనమః.

# శ్రీ భగవద్గీతా తాత్పర్యదీపికా.

హరిః ఓమ్॥ గగనసదృశమేకం సచ్చిదానందరూపమ్।
విమలమచలమాద్యం తత్త్వమస్యాదిలక్ష్యమ్॥
సకలవిషయమూలం సర్వసాక్షిభూతమ్।
పరమసుఖస్వభావం సద్గురుం భావయామి॥

# మొదటి అధ్యాయము.



క్రియతే సుఖబోధాయ ముముక్షూణాం విరాగిణామ్।
శ్రీకృష్ణకృతగీతాయా ష్టీకా తాత్పర్యదీపికా॥

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు పలికెను.

శ్లోకః.

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ!॥

తాత్పర్యము.

ఓ సంజయుఁడా! ధర్మమునకునిలయమైన కురుక్షేత్రమును ప్రదేశమున యుద్ధము చేయఁదలంపుగలవారలయి కూడిన నావాండ్రును, పాండురాజుకొడుకులగు ధర్మరాజాదులు నేమిచేసిరి.

సఞ్జయ ఉవాచ—సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

దృష్ట్వాతు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా।
ఆచార్యముపసఙ్గమ్య రాజావచనమబ్రవీత్॥ ౨॥

అప్పుడు రాజయిన దుర్యోధనుఁడు పన్నియున్న పాండవులసేన నన్నసో చూచి యస్త్రగురుండగు ద్రోణాచార్యుని సమీపించి క్రింద చెప్పఁబోవు వాక్యమును పలికెను.

దుర్యోధన ఉవాచ=దుర్యోధనుఁడు చెప్పినదేమనఁగాః—

పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య! మహతీంచమూమ్ ।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవశిష్యేణ ధీమతా ॥ 3 ॥

ఓ గురువర్యా! తమయొక్క శిష్యుఁడును, బుద్ధిశాలియునగు ద్రుపద

రాజనందనునిచే పన్నఁబడినదియు, గొప్పదియునగు పాండువుల యొక్క ఎదుటఁ గనఁబడుచుండు నీసేనను చూడుఁడు.

అత్రశూరా మహేష్వాసా భీమార్జునసమాయుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ ౪॥

ధృష్టకేతుశ్చేకితానః కాశీరాజశ్చవీర్యవాన్।
పురుజిత్కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః॥ ౫।

యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥ ౬

యుద్ధమునందు శూరులును, భీమార్జునులతోఁ దుల్యులును, గొప్ప ధనుస్సులు గలవారునునగు యుయుధానుఁడును, విరటుఁడును, మహారథుఁడైన ద్రుపదదేశాధిపుఁడును, ధృష్టకేతువును, చేకితానుఁడును, పరాక్రమవంతుఁడగు కాశీదేశపురాజును, పురుజిత్తును, కుంతిభోజుఁడును, మనుజశ్రేష్ఠుఁడైన శైబ్యుఁడును, బలవంతుఁడగు యుధామన్యుఁ

డును, తాఁబట్టిన కార్యముఁజేయుటకు సమర్థుఁడగు ఉత్తమౌజుండును, అభిమన్యుఁడును, ఉపపాండవులును, వీరందఱును మహారథు లీపాండవసేనయందుఁగలరు.

అస్మాకంతు విశిష్టాయే తాన్నిబోధ ద్విజోత్తమ!।
నాయకా మమసైన్యస్య సంజ్ఞార్థం తాన్బ్రవీమితే॥ ౭॥

బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు ఓద్రోణాచార్యా! మనసంబంధులయినగొప్ప వాండ్రును నా యొక్క సైన్యమునకు నాయకులు, నెవరో వారిని

తమకుఁ దెలియుటకుఁ జెప్పుచున్నాఁడను. దెలిసికొనుము.

భవాన్భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి ర్జయద్రథః॥ ౮
అన్యేచ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః।
నానాశస్త్ర ప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః॥ ౯

తాము ను. భీష్ముఁడును, కర్ణుఁడును. కృపాచార్యుఁడును, యుద్ధము నజయశాలియైన అశ్వత్థామయును, వికర్ణుఁడును, సోమదత్తుని కుమా-

డుఁడగు భూరిశ్రవుఁడును, జయద్రథుఁడును, ఇతరులయిన పలువురు శూరులును నావిషయమై ప్రాణముల విడుచుటకు నిశ్చయించుకొనిన వారు. పైనఁజెప్పఁబడినయందఱును బహువిధములగు నాయుధములు కలవారును రణమున నేర్పుగలవారునై యున్నారు.

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్॥ ౧౦॥

అయినను భీష్మునిచేఁ బరిరక్షింపఁబడుచున్నదగు మనయొక్క సై

**న్యము** చాలకున్నది. భీమునిచే రక్షింపఁబడినదగు వీరియొక్క యీ **సేన**యయితే చాలియున్నది.

అయనేషుచ సర్వేషు యథాభాగమవస్థితాః।
భీష్మమేవాభిరక్షన్తు భవన్తస్సర్వఏవహి॥　　　౧౧॥

మీరందఱును సకలములయిన వ్యూహమార్గములయందును మీకు **మీ** కేర్పడిన యుద్ధస్థానముల వదలక నుండినవారయి భీష్మునే యం**తటను** గాపాడవలయును.

సంజయ ఉవాచ—సంజయుఁడు పలుకుచున్నాడు.

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥ ౧౨॥

శత్రువులు జూచి భయపడునట్టి సామర్థ్యము గలవాఁడును, కౌరవులలోఁ బెద్దయునగు కురుపాండవులకు తాతయైన భీష్ముఁడు నా దుర్యోధనునకు సంతోషమును మిగులఁగలుగఁజేయుచు గట్టిగా సింహనాదముఁజేసి శంఖమును బూరించెను.

తతశ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।
సహసైవాభ్యహన్యన్త సశబ్దస్తుములోఽభవత్॥　　　౧౩॥

పిమ్మట శంఖములును, దుందుభులును, తప్పెటలును, మృదంగములును, బూరలును, శీఘ్రముగానే వాయింపఁబడినవి. ఆధ్వని అంతటను దట్టముగా నిండినదైయ్యెను.

తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ।
మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥　　　౧౪॥

పిమ్మట, తెల్లనిగుఱ్ఱములతో కూడకొనినదియు, గొప్పదియునగు రథమునందు కూర్చున్న లక్ష్మీపతియైన శ్రీకృష్ణుడును, పాండుపుత్రుడైన యర్జునుడును, శ్రేష్ఠములగు శంఖములను బూరించిరి.

పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।
పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః॥ ౧౫॥
అనన్తవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః।
నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ॥ ౧౬॥

కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖణ్డీ చ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః॥ ౧౭॥
ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే! ।
సౌభద్రశ్చ మహాబాహు శ్శఙ్ఖాన్ దధ్ముః పృథక్పృథక్॥ ౧౮॥

ఓ ధృతరాష్ట్రమహారాజా! శ్రీకృష్ణుఁడు పాంచజన్యమును శంఖము నూదెను. అర్జునుఁడు దేవదత్తమను శంఖమును, భయంకర కృత్యములఁజేయు భీముఁడు పౌండ్రమనెడి గొప్పశంఖమును, రాజు

ను కుంతియొక్క పుత్రుఁడునగు ధర్మరాజు అనంతవిజయమను శంఖమును, నకులుఁడును, సహదేవుఁడును, సుఘోషము, మణిపుష్పకములను శంఖములను, గొప్పవిల్లుగల కాశీదేశపు రాజును, మహారథికుఁడైన శిఖండియును, ధృష్టద్యుమ్నుఁడును, విరటుఁడును, అపజయమును బొందనివాఁడగు సాత్యకియును, ద్రుపదరాజును, ఉపపాండవులును, భుజపరాక్రమవంతుఁడైన యభిమన్యుఁడును, నేనయందంతట వేఱు వేఱుగా శంఖములనూదిరి.

సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
నభశ్చ పృథివీంచైవ తుములో వ్యనునాదయన్॥ ౧౯॥

సర్వత్రః వ్యాపించిన యాశంఖశబ్ద మాకాశమును భూమిని గొప్ప ప్రతిధ్వని కలుగునట్లుచేయుచు ధృతరాష్ట్రపుత్రులగు దుర్యోధనాదుల మనస్సులను బ్రద్దలు చేసెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసమ్పాతే ధనురుద్యమ్య పాణ్డవః॥ ౨౦॥
హృషీకేశం తదావాక్య మిదమాహ మహీపతే।

ఓ ధృతరాష్ట్రమహారాజా! తరువాత నాయుధప్రయోగ మారం
భము కాఁబోవునపుడు కోతిని టెక్కెమందుఁగలవాఁడగు అర్జునుఁడు
యుద్ధసన్నద్ధులయియున్న కౌరవులను చూచి వింటిని పైకెత్తినవాఁ
డు శ్రీకృష్ణునిఁగూర్చి ముందుఁజెప్పఁబోవు వాక్యమును పలికెను.

అర్జున ఉవాచ = అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.

సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత! ॥ ౨౧ ॥
యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్ ।

కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే ॥ ౨౨ ॥
యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః ॥ ౨౩ ॥

ఓ శ్రీకృష్ణా! కుమతియగు దుర్యోధనునకు రణమునందు మేలుచేయఁ దలంచినవారై, ఏ యీశూరు లీరణాంగమునందు వచ్చి చేరి యున్నారో, యుద్ధము చేయఁబోవునట్టివారిని నేను చూచెదను. ఈ యుద్ధారంభమునందు నాచేత నెవరితో యుద్ధముఁ జేయఁదగినదో

యుద్ధము చేయుట కభిప్రాయము గలవారలై యున్న నీవారలను నేను చూచునంతవఱకును, రెండు సేనలయొక్క నడుమ నాయొక్క రథమును నిలుపుము.

సఞ్జయ ఉవాచ = సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత! ।
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥ ౨౪ ॥
భీష్మద్రోణప్రముఖతః సర్వేషాంచ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్కురూనితి ॥ ౨౫ ॥

ఓ ధృతరాష్ట్రుఁడా ! నిద్రను జయించిన యర్జునునిచే పైనఁజె ప్పఁబడిన ప్రకారము శ్రీకృష్ణమూర్తి రెండు సైన్యములయొక్క నడుమను భీష్మద్రోణులు మొదలగువారిని ప్రాధాన్యము గాఁగల అందఱు రాజులకెదుట శ్రేష్ఠమైన రథమును నిలిపి ఓ అర్జునా ! యుద్ధభూమిని జేరియున్న నీదుర్యోధనుఁడు మొదలగు కౌరవులఁ జూడుము; అని పలికెను.

తత్రాపశ్యత్స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్ పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా ॥
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ॥ ౨౬ ॥

శ్రీకృష్ణమూర్తి చెప్పినపిదప నర్జునుఁ డచ్చట రెండు సేనలయం దున్న తండ్రులను, తాతలను, గురువులను, మేనమామలను, తోఁడ బుట్టువులను, కొడుకులను, మనుమలను, చెలికాండ్రను, యత్తమామలను, స్నేహితులను జూచెను.

తాన్సమీక్ష్య సకౌన్తేయ స్సర్వాన్బన్ధూ నవస్థితాన్ ॥ ౨౭ ॥
కృపయాపరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్ ।

కుంతీ పుత్రుఁడగు నర్జునుఁడు నిలిచియున్న సమస్తమైన నా చుట్టములను జూచి, యధికమయిన దయతో కూడినవాఁడై వ్యసనముఁబొందుచు పైఁజెప్పఁబోవు నీవాక్యమును పలికెను.

అర్జున ఉవాచ—అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.

దృష్ట్వేమంస్వజనంకృష్ణ ! యుయుత్సుంసముపస్థితమ్॥౨౮॥
సీదన్తి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి ।
వేపథుశ్చశరీరేమే రోమహర్షశ్చజాయతే ॥ ౨౯ ॥
గాణ్డీవం స్రంసతే హస్తా త్త్వక్చైవ పరిదహ్యతే ।
నచశక్నో మ్యవస్థాతుం భ్రమతీవచ మే మనః ॥ 30 ॥
నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ! ॥

ఓ కృష్ణా! యుద్ధము చేయఁదలఁచినట్టిదియుఁ,గూడియుండునట్టి

దియా నగు నీబంధుజనమును జూచి నాయొక్క యవయవములు శిథిలము లగుచున్నవి. మోమును వాడుచున్నది. గాండీవ మనెడి నా ధనుస్సు చేతినుండి జాఱిపోవుచున్నది. శరీరచర్మమును తపించుచున్నది. నిలుచుటకు శక్తిలేకయేయున్నాను. నాయొక్కమనస్సు భ్రాంతినిబొందుచున్నట్లున్నది. ఓకృష్ణా! దుశ్శకునములను గూడఁ జూచుచున్నాను.

నచ శ్రేయోఽనుపశ్యామి హత్వాస్వజనమాహవే ॥ ౩౧ ॥
న కాఙ్క్షే విజయం కృష్ణ ! నచ రాజ్యం సుఖాని చ ।
కింనో రాజ్యేన గోవిన్ద ! కింభోగైర్జీవితేనవా ॥ ౩౨ ॥
యేషామర్థే కాఙ్క్షితంనో । రాజ్యంభోగా స్సుఖానిచ ।
తఇమేఽవస్థితాయుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనానిచ ॥ ౩౩ ॥
ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః ।
మాతులా శ్శ్వశురాః పౌత్రా స్స్యాలా స్సమ్బన్ధిన స్తథా ॥

యుద్ధమునందు బంధువులను జంపి పిమ్మట శుభమును జూడను. ఓకృష్ణా! బంధువులను జంపుటవలనఁ గలుగు గెలుపును, బంధువులను జంపుటవలన వచ్చు రాజ్యమును, అట్టి రాజ్యలాభమువలనఁ గలుగు సుఖములను గోరను. ఓకృష్ణా! మనకు బంధువులందఱు మృతిఁ బొందిన పిమ్మట రాజ్యముచేతను, భోగములచేతను,బ్రతికియుండుట చేతను యేమిప్రయోజనము? మనయొక్క రాజ్యమెవరినిమిత్తము కోరఁదగి యున్నదో,ఆరాజ్యమువలన భోగములును, సుఖములును,

యెవరినిమిత్తము గోరఁదగినవో, అట్టి గురువులును, తండ్రులను, కొమాళ్లను, తాతలును, మేనమామలును, మనుమలును, బావలును, వియ్యంకులు నయినట్టివీరందఱును ప్రాణములను, ఐశ్వర్యములను, విడువ నిశ్చయించుకొని రణమునందు వచ్చి నిలిచియున్నారు.

ఏతాన్నహన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ! ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే ॥ ౩౫ ॥

మధు వను రక్కసునిఁ జంపినయోకృష్ణా! యుద్ధమున నన్నుఁ గొట్టినను, వీరిని మూఁడు లోకముల రాజ్యాధిపత్యము నిమిత్తమైనను జంపుటకు కోరను. అట్లుండ నీభూరాజ్య నిమిత్త మెంతమాత్రమును జంపను.

నిహత్యధార్తరాష్ట్రాన్నః కాప్రీతిస్స్యాజ్జనార్దన ! ।
పాపమేవాశ్రయేదస్మాన్ హత్త్వైతానాతతాయినః ॥ ౩౬ ॥

ఇహపరసుఖముల నిచ్చు, ఓకృష్ణా! కౌరవులను చంపినయెడలమ

నకు నేమి సంతోషము గలుగును? వీరు మనలను జంపువారైనప్పుటికిని మనము వీరిని జంపిన, మనలను బాపమే యాశ్రయించును.

తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ సబాన్ధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ! ॥౩౭॥

ఓ కృష్ణా! కాఁబట్టి మనము బంధువులతోఁ గూడుకొనిన కౌరవులను జంపి యెట్లు సుఖము గలవారము కాఁగలము?

యద్య ప్యేతే న పశ్య న్తి లోభోపహతచేతసః ।
కులక్షయకృతందోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ ౩౮ ॥
కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివ ర్తితుమ్ ।
కులక్షయ కృతందోషం ప్రపశ్యద్భిర్జనార్దన ! ॥ ౩౯ ॥

ఓ శ్రీకృష్ణా ! రాజ్యాశచేఁ జెడఁగొట్టఁబడిన మనస్సుగలయీదుర్యోధనాదులుఁ గులనాశమువలనఁ గలుగుదోషమును, మిత్రద్రోహము వలనఁ గలుగు పాపమును దెలిసికొనఁజాలకున్నను, కులనాశముచేఁ

గలుగు పాపమును బాగుగాఁ దెలిసికొనుచున్న మనచేత నీపాపము నుండి మఱలుట కేల తెలియఁదగినది కాదు?

కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాః సనాతనాః।
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత ॥ ౪౦ ॥
అధర్మాభిభవాత్కృష్ణ! ప్రదుష్యన్తి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసఙ్కరః ॥౪౧॥
సఙ్కరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ।

పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః ॥ ౪౨ ॥
దోషైరేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః ।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ ౪౩ ॥
ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ! ।
నరకే నియతంవాసో భవతీత్యనుశుశ్రుమ ॥ ౪౪ ॥

కులనాశనమైన యెడల ననాదులైన చిరకాలమునుండి పరంపరగావచ్చు కులాచారములు సంపూర్ణముగా నాశమును బొందును. ఆచా

రము నశించిన పక్షమున కులమునంతటను నాచరము వ్యాపించును. ఓకృష్ణా! అనాచారము వ్యాపించిన యెడల కులస్త్రీలు చెడుదురు. స్త్రీలు చెడినచో జాతులన్నియు నొకటితో నొకటి కలియుట కలుగును. ఓకృష్ణా! జాతిసమ్మేళనము, కులనాశముఁ జేసినవారికిని కులమునకును నరకము కలుగఁజేయును. ఇంతేకాక ఈకులనాశకుల యొక్కయు, నష్టకులుల యొక్కయు, పితృదేవతలు లోపించిన పిండోదకక్రియలుగలవారై నరకమును బొందుదురు. కులనాశకుల యొక్క

జాతిని సంకరముచేయు నీ పాపములచేత సనాతనములైన వర్ణాచారములును వంశాచారములును చెడఁగొట్టఁబడుచున్నవి. ఓకృష్ణా! చెడిన కులాచారములుగల మనుజులకు నరకమునందే యెల్లప్పుడును నివాసము కలుగునని పెద్దలవలన వినియున్నాము.

అహో! బత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్।
యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజనముద్యతాః॥ ౪౫॥

ఏకారణముచేత మనము రాజ్యసుఖమునందలి యాశవలన

బంధుజనులను చంపుటకు సిద్ధమయినామో, యాకారణముచేత మహాపాతకమునుచేయుట కుద్యుక్తులమైతిమి. అయ్యో! కటకటా!

యదిమా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రా రణేహన్యు స్తన్మే క్షేమతరం భవేత్॥ ౪౬॥

చేతులలో నాయుధములు గల కౌరవులు నాయుధ రహితుఁడును ప్రతిక్రియ లేనివాఁడునైన నన్ను యుద్ధమునఁ జంపువారలయిన యెడల నది నాకు మిక్కిలి క్షేమమగును.

సఞ్జయ ఉవాచ=సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

ఏవ ముక్త్వాఽర్జున స్సఙ్ఖ్యే రథోపస్థ ఉపావిశత్।
విసృజ్య సశరంచాపం శోకసంవిగ్నమానసః॥ ౪౭॥

అర్జునుఁడు వెనుకఁ జెప్పిన ప్రకారముగాఁ బలికి దుఃఖముచేఁ జలించిన మనస్సుగలవాఁడై బాణయుక్తమయిన ధనుస్సును క్రిందఁబడవైచి రణమున రథముపైన దిగులునొంది చదికిలబడెను.

ఇట్లు అర్జునవిషాదయోగమను, మొదటియధ్యాయము. ముగిసినది.

శ్రీరస్తు.

# రెండవ అధ్యాయము.

## సాఙ్ఖ్యయోగము.

సఞ్జయ ఉవాచ=సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పుచున్నాఁడు.

తం తథా కృపయావిష్ట మశ్రు పూర్ణా కులేక్షణమ్।
విషీద న్తమిదం వాక్య ముపాచ మధుసూదనః॥ ౧॥

బంధువుల నెట్లు చంపుదునని దయతోఁ గూడుకొనిన వాఁడును, కన్నీళ్లతో నిండినవై వ్యాకులములైన నేత్రములు గలవాఁడును, దుఃఖపడుచున్న వాఁడునగు నాయర్జునునిఁగూర్చి మధువను నసురుని సంహరించిన శ్రీకృష్ణమూర్తి యీముందుఁ జెప్పఁబోవు వాక్యమునుపలికెను.

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణస్వామి యర్జునునితోఁ జెప్పుచున్నాఁడు.

కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ॥ ౨॥

ఓ అర్జునుఁడా! యజ్ఞానులచే నవలంబింపఁ బడఁదగినదియును, పరలోకసుఖము నడ్డపఱచునట్టిదియును, అపకీర్తినిఁ గలుగఁ జేయు నట్టిదియు నగు నీమనోవ్యాకులము నేకారణముచేత నకాలమందు నిన్ను బొందినది?

క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప!॥ ౩॥

ఓ అర్జునుఁడా! భయమును బొందకుము; నీయందు నీ మనోవ్యా

కులము తగదు; శత్రువులను దపింపఁజేయువాఁడా! నీచమైన మన
స్సునందలి పిఱికితనమును విడిచి లెమ్ము. యుద్ధ సన్నద్ధుఁడవుకమ్ము.

అర్జున ఉవాచ=అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు

కథం భీష్మమహం సఙ్ఖ్యే ద్రోణంచ మధుసూదన !।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరి సూదన॥ ౪॥

శత్రువులఁ జంపునట్టి ఓ కృష్ణా! పూజింపఁబడఁదగిన వారల
యైన భీష్ముని ద్రోణాచార్యునిని రణమున నే నెట్లెదిరించి యుద్ధము
చేయఁగలను ?

గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష మపీహలోకే।
హత్వార్థ కామాంస్తు గురూనిహైవ
భుఞ్జీయభోగాన్ రుధిర ప్రదిగ్ధాన్॥ ౫॥

మహాత్ములైన యాచార్యులను చంపక యీప్రపంచమునందను భవించుటకు భిక్షాన్నమయినను మేలు; యాచార్యులను చంపియో యిక్కడనే రక్తముచేఁ బూయఁబడినవియు, అర్థ కామరూపము

లునగు భోగములను భుజించువాఁడ నగుదును.

నచైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వాజయేమ యదివా నో జయేయుః।
యానేవహత్వా నజిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ ౬॥

ఎవరిని చంపి జీవించుటకుఁ గోరనే కోరమో, యట్టిభీష్మాదులు మున యెదుట నున్నారు. పోనిమ్ము, కౌరవులఁ జంపి రాజ్యలాభమును బొం

దుదమునిశ్చను, భీష్మాదులు మహాబలశాలులగుటవలన మనము జయింతుమో, భీష్మాది కౌరవులు మనలను జయింతురో, యీయంశమునుగూడ తెలిసికొనఁజాలము. ఇట్టి సందిగ్ధ స్థితిలో నుండు మనకు నేది శ్లాఘ్యమైనది? యెన్ని విధములచేత విచారించి చూచినను బంధువుల నంపఱిని జంపుటమాని భిక్షాన్నముచే జీవించుటయే శ్లాఘ్యమని నాయభిప్రాయము.

కార్పణ్యదోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః।

యచ్ఛ్రేయస్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥ ౭॥

గురుమొదలగువారిని జంపి మనము జీవించుట యోగ్యము కాదను వ్యసనమనే కార్పణ్యముచేతను, యట్టివారిని జంపుటవలనఁ గలుగు పాపమను దోషముచేతను నశించిన స్వభావము గల నేను, ధర్మము విషయమై సందియముగల మనస్సు గలవాఁడనై నిన్నడుగుచున్నాను. ఏది నీచే నిరయింపఁ బడినదై నాకు మేలుగా నగునో

దానినిఁజెప్పుము. నీకు నేను శిష్యుఁడను, నిన్ను శరణు పొందిన నన్ను శాసింపుము.

నహి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణ మిన్ద్రియాణామ్।
అవాప్య భూమా వసపత్న మృద్ధమ్
రాజ్యం సురాణా మపిచాధిపత్యమ్॥ ౮॥

భూమియందు యెదిరి లేనట్టిదియు వృద్ధిని బొందియుండు నట్టిది యనగు రాజ్యమును దేవేంద్రపదవినిఁ బొందినను, యింద్రియము

లను మిగుల నెండింపఁజేయు నాయొక్క వ్యసనము నేది పోఁగొట్టు నో, దానిని కనుఁగొనఁజాలకున్నాను గదా?

సఞ్జయ ఉవాచ — సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః।
నయోత్స్య ఇతిగోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవహ॥ ౯॥
తమువాచ హృషీకేశః ప్రహసన్నివభారత!।
సేనయో రుభయోర్మధ్యే విషీదన్త మిదంవచః॥ ౧౦॥

శత్రువులను దహింపఁజేయు యర్జునుఁడు శ్రీకృష్ణస్వామిని గూర్చి పైనఁజెప్పఁబడిన విధముగాఁ బలికి, మరలను శ్రీకృష్ణునిఁగూర్చి నేను యుద్ధము చేయనని పలికి, మౌనముతో నుండెను; యాశ్చర్యము. ఓ ధృతరాష్ట్రుఁడా! రెండు సేనల నడుమను దుఃఖపడుచుండు నా యర్జునునిఁగూర్చి శ్రీకృష్ణమూర్తి పరిహాసము చేయువానివలె ముందుఁ జెప్పఁబోవు వాక్యమును పలికెను.

---

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణస్వామి ప్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు.

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః॥ ౧౧॥

ఓ యర్జునుఁడా! నీవు దుఃఖింపఁదగని భీష్మాదులనుగూర్చి దుఃఖించినావు; వివేకులు పలుకునట్టిమాటలను పలుకుచున్నావు; మృతిఁబొందినవారిఁగూర్చియు, జీవించియున్నవారిఁగూర్చియు, ఆత్మానాత్మవివేకపూర్వక బ్రహ్మైక్యానుభవముగలవారు దుఃఖింపరు.

నత్వేవాహం జాతునాసం నత్వంనేమే జనాధిపాః।
నచైవ నభవిష్యామ స్సర్వేవయ మతఃపరమ్॥ ౧౨॥

నేను నెుకప్పుడును లేకుంటిని యనునది లేదు; నీవును లేకుంటివను నది లేదు; ఈ రాజులును లేకుండిరనునది లేదు; మనమందఱము నిక మీదను లేకపోయెదమే యనునదియు లేదు.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనంజరా।
తథా దేహాన్తరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి॥ ౧౩॥

దేహాభిమానియైన జీవున కీశరీరమునందు బాల్యంబును యౌవనంబును ముదిమియు నేలాగున క్రమముగా వచ్చునో, యాప్రకారముగానే మఱియొకశరీరమును బొందుటయు; నావిషయమున జ్ఞాని నీవలె మోహమునొందడు.

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణ సుఖదుఃఖదాః।
ఆగమా పాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత!॥ ౧౪॥

ఓ యర్జునుఁడా! పంచతన్మాత్రలవలనఁ బుట్టిన శ్రోత్రాదీంద్రియ

ములయొక్క శబ్దాదివిషయ సంయోగములయితే చలి, వేడి, మొద
లగు సుఖదుఃఖములను గలుగఁజేయునవిగాను, సంయోగ వియోగ
ములు కలిగినవిగాను, ఒకప్పుడుండి మఱియొకప్పుడు లేకుండునవి
గాను, అస్థిరములైనవిగా నున్నవి. కాఁబట్టి యా శీతోష్ణాదులను
ఓయర్జునా! ఓర్చుకొనుము.

యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ ।
సమదుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥ ౧౫ ॥

ఓ మనుజశ్రేష్ఠుఁడా! యీ విషయవాసనలు సుఖదుఃఖముల యందు సమబుద్ధి కలిగిన వివేకియైన యేపురుషుని బాధింపవో, వాఁడు కదా మోక్షమున కర్హుఁడగుచున్నాఁడు?

నాసతో విద్యతేభావో నాభావో విద్యతేసతః।
ఉభయోరపి దృష్టోఽ న్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥ ౧౬॥

లేనిదానికి కలిమి లేదు; కలదానికి లేమి లేదు; ఈ రెంటియొక్కయు నిశ్చయమన్నను జ్ఞానులచే తెలిసికొనఁబడినది.

అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్।
వినాశ మవ్యయస్యాస్య నకశ్చి త్కర్తుమర్హతి॥ ౧౭॥

ఈ సకలము నేబ్రహ్మము చేత వ్యాపింపఁబడియున్నదో, యట్టి సర్వ వ్యాపియైన బ్రహ్మము నాశము లేదనియు, యట్లు నాశము లేని యీ బ్రహ్మమునకు నాశమునుకలుగఁజేయుట కెవ్వఁడు నర్హుఁడు కాఁడని యు, తెలిసికొనుము.

అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత! ॥ ౧౮॥

వికారరహితుఁడును దేహాద్యుపాదులు నశించినను దాను నశింపని వాఁడును ప్రత్యక్షాది షట్ప్రమాణములచేతను, కాలదేశస్వరూపము లచేతను, తెలిసికొనఁదగనివాఁడునగు దేహియైన యాత్మయొక్క యీశరీరములు యంతముకలవిగా జ్ఞానులచేఁ జెప్పఁబడినవి. ఓ యర్జునా! కావున యుద్ధము చేయుము.

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥ ౧౯॥

ఎవ్వఁడే యాత్మను చంపునట్టివానిఁగా తెలిసి కొనునో, ఎవ్వఁడీ యాత్మను చంపఁబడినవానిఁగా తలంచునో, వారిరువురును వాస్తవ మెఱిఁగినవారు కారు. ఈ యాత్మ కర్తృత్వభోక్తృత్వాది వికార రహితుఁడు; కావున నెవ్వని చంపువాఁడు కాఁడు, నెవ్వనిచేతను చంపఁబడువాఁడును కాఁడు.

నజాయతే మ్రియతేవా కదాచిత్
నాయం భూత్వా భవితావా నభూయః

అజో నిత్యశ్శాశ్వతో౽యం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే॥ ౨౦॥

వెనుకఁ దెలియఁజేయఁబడిన యాత్మయెప్పుడును పుట్టునట్టివాఁడు కాఁడు; నెప్పుడును చచ్చునట్టివాఁడు కాఁడు; లేకుండి మరల క్రొత్తగా కలుగువాఁడు కాఁడు; నుండి మరల లేకుండువాఁడు కాఁడు. కాఁబట్టి యీయాత్మ పుట్టుక లేనివాఁడును నాశము లేనివాఁడును స్థిరరూపుఁడును యనాదియైనవాఁడునై యున్నాఁడు. దేహము య

నేక విధములుగ మాఱుచున్నను యీయాత్మ మార్పఁబడఁడు.

వేదా వినాశినం నిత్యం యఏన మజ మవ్యయమ్।
కథం స పురుషః పార్థ! కంఘాతయతి హన్తికమ్॥ ౨౧॥

ఓ యర్జునుఁడా! ఏ పురుషుఁ డీయాత్మను పుట్టుక లేనివాడుఁగాను, శాశ్వతునిగాను, నాశరహితునిగాను, పరిణామము లేనివానిగాను, నెఱుఁగుచున్నాఁడో, వివేకియగు నాపురుషుఁ డెట్లెవ్వని చంపించుచున్నాఁడు? యెవ్వని చంపుచున్నాఁడు?

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ॥

మనుష్యుఁ డేలాగున శిథిలములయిన వస్త్రములను విడిచి క్రొత్తవియు నన్యములునగు వస్త్రములను స్వీకరించుచున్నాఁడో, నాలాగున నాత్మ శిథిలములయిన దేహములను విడిచి, క్రొత్తవియు నితరములునగు దేహములను పొందుచున్నాఁడు.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః॥ ౨౩॥

ఆయుధము లీ యాత్మను ఛేదింపఁజాలవు; అగ్ని యీ యాత్మను దహింపఁజాలఁడు; ఉదకము లీ యాత్మను తడపనుఁజాలవు; వాయు వీ యాత్మను నెండింపఁజేయఁజాలదు.

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్యఏవచ।
నిత్య స్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః॥ ౨౪॥

ఈయాత్మ ఛేదింపఁబడఁదగినవాఁడును దహింపఁబడఁదగినవాఁడును తడుపఁబడఁదగినవాఁడును కాఁడు. ఈ యాత్మ త్రికాలములయందు నుండువాఁడును, సర్వవ్యాపకుఁడును, నిశ్చలస్వభావుఁడును, చలింపనివాఁడును, ననాదియైనవాఁడు నగుచున్నాఁడు.

అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥ ౨౫॥

ఈయాత్మ చక్షురాదీంద్రియములకును మనస్సునకు నగోచరుఁడు

ఈ యాత్మ వికారములను బొందింపఁబడఁదగనివాఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఆకారణమువలన యీ విధముగా నీయాత్మ నెఱిఁగి దుఃఖించుటకుఁదగవు.

అథచైనం నిత్యజాతం నిత్యంవా మన్యసే మృతమ్।
తథాపి త్వం మహా బాహో! నైనం శోచితు మర్హసి॥ ౨౬॥

ఒకప్పుడు నీ యాత్మ నెల్లప్పుడు పుట్టుచున్నవానిఁగాను, యెల్లప్పుడు నశించుచున్నవానిఁగాను, తలంతువేని, అయినను గొప్పభుజ

ములుగల యోయర్జునా! నీవీయాత్మనుగూర్చి దుఃఖించుటకుఁ దగవు.

జాతస్య హి ధ్రువోమృత్యు ర్ధ్రువంజన్మ మృతస్యచ।
తస్మా దపరిహార్యేర్థే నత్వం శోచితుమర్హసి॥　　౨౭॥

ఎందువలన పుట్టినవానికిఁ జావునిశ్చయమో, జ్ఞానహీనుఁడై చచ్చినవానికిఁ బుట్టుకయు నిశ్చయమో, ఆకారణమువలనఁ దప్పింప శక్యముకాని కార్యవిషయమై నీవు దుఃఖించుటకుఁదగవు.

అవ్యక్తాదీని భూతాని వ్యక్త మధ్యాని భారత!।
అవ్యక్త నిధనా న్యేవ తత్ర కా పరివేదనా? ॥ ౨౮॥

ఓ అర్జునుఁడా! మనుష్యాదిశరీరములు జన్మమునకుముందుఁగనఁబడని మాయనుండికలిగినవియు, పుట్టిన వెనుక కనుఁబడుచున్న పుత్రమిత్రాది కార్యకారణ సంఘాతముగలవియు, మరణాంతరమున మాయయందే తిరిగి లయముగాఁగలవియునై యున్నవి. అట్టిశరీరములవిషయమై నీకు దుఃఖము ఏమి? ఎందుకు.

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చి దేన మాశ్చర్యవ ద్వదతి తథైవచాన్యః।
ఆశ్చర్యవచ్చైనమన్యశ్శృణోతి శ్రుత్వాప్యేనం వేదన చైవకశ్చిత్ ।

ఒకానొక పురుషుఁ డీయాత్మ నద్భుతవస్తువునువలెఁ జూచుచున్నాఁడు, ఆలాగున నే మఱియొకఁడీయాత్మ నద్భుతవస్తువునువలెఁ జెప్పుచున్నాఁడు, ఇతరుఁ డీయాత్మ నద్భుతవస్తువునువలె వినుచున్నాఁడు, ఇట్లు విని, చూచి, పలికిన నెవ్వఁడును వీనిని యథార్థముగా తెలిసినవాఁడు లేఁడు.

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత!।
తస్మాత్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి॥ 30॥

ఓ అర్జునుఁడా! సురాసుర మనుష్యాది ప్రాణి సమూహముయొ క్క శరీరములు చంపఁబడుచున్నను, ఈ యాత్మ యెల్లప్పుడును చంపఁబడఁ దగనివాఁడు; ఆ కారణమువలన నీవు భీష్మాదులను గూర్చి దుఃఖించుటకుఁ దగవు.

స్వధర్మమపిచావేక్ష్య నవికమ్పితు మర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే॥
ఇంతియకాక, స్వకీయమైన క్షత్రియ ధర్మము నాలోచించిన నీవు చలించుటకుఁ దగవు. ఏమనఁగా రాజునకు ధర్మముతోఁ గూడిన యుద్ధమునకంటే నితరమైన మేలు లేదు.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గ ద్వార మపావృతమ్।
సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధమీదృశమ్॥ ३౨॥

ఓ అర్జునుఁడా! కోరకుండ సంభవించినట్టియు తెఱవఁబడినట్టి స్వర్గద్వార రూపమైనదియునగు నిట్టి యుద్ధము నే రాజులు పొందుచున్నారో, వారలిహ పర సుఖములు గలవారలగుచున్నారు.

అథ చేత్త్వం ధర్మ్యమిమం సఙ్గ్రామం నకరిష్యసి।
తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాపమవాప్స్యసి॥ 33॥

పరమసుఖప్రదమైన ప్రయోజనమును బోగొట్టుకొనుటయే కాక నీవు ధర్మయుక్తమైన యీ యుద్ధమును చేయవేని, అందువలన స్వ

ధర్మమును యశస్సును పోఁగొట్టుకొని, మీఁదుమిక్కిలి స్వధర్మ పరిత్యాగమువలనఁ గలుగు దోషమునుకూడ పొందఁగలవు.

అకీర్తించాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్।
సమ్భావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే ॥ ౩౪॥

ఇంతియె కాక జనులు నీయొక్క శాశ్వతమైన యపకీర్తినిఁ జెప్పుకొనఁగలరు. చిరకాలమునుండి శౌర్య ధైర్యాది గుణములచే సన్మానింపఁబడువానికి క్రొత్తగావచ్చునట్టి యపకీర్తి, చావుకంటె నతిశ

యమగుచున్నది.

భయాద్రణాదుపరతం మంస్యన్తే త్వాం మహారథాః।
యేషాంచత్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్॥ ౩౫॥

నీవెవరికి మాన్యుఁడవయితివో, అట్టి మహారథికులయిన దుర్యోధనాదులు నిన్ను భయమువలన యుద్ధమునుండి మరలినవానిఁగాఁ దలంపఁగలరు. ఇంతవఱకు వారిచే సన్మానింపఁబడిన వాఁడవయ్యు నిఁక నగౌరవమును పొందఁగలవు.

అవాచ్య వాదాంశ్చ బహూన్ వదిష్యన్తితవాఽహితాః।
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం నుకిమ్॥ ౩౬॥

నీ యొక్క శత్రువులు నీయొక్క శక్తిని నిందించుచున్న వారై యనేకములైన యాడరానిమాటలను గూడ నెప్పుదురు; అంతకన్న నధికదుఃఖకరము మ ఱేమికలదు?

హతోవా ప్రాప్స్యసే స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీమ్।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృతనిశ్చయః॥ ౩౭॥

ఓ అర్జునా! శత్రువులచేత నీవుచంపఁబడినయెడల స్వర్గమును
పొందుదువు; శత్రువులను నీవు జయించితివేని రాజ్యముననుభవిం
తువు; కావున యుద్ధముచేయుటకు నిశ్చయము కలవాఁడవై లెమ్ము.

సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవంపాపమవాప్స్యసి॥ ౩౮॥

సుఖదుఃఖములను లాభాలాభములను జయాపజయములను సమ
ములుగాఁదలంచి, తరువాత యుద్ధముకొఱకుఁ దలఁపడుము. ఇట్టి

నిశ్చయము గలవాడవయితే నీవు పాపమును పొందవు.

ఏషా తేఽభిహితా సాఙ్ఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబన్ధం ప్రహాస్యసి॥ ౩౯

ఓ అర్జునా! జీవాత్మ పరమాత్మ తత్త్వవిచారణ విషయమై యిది పఱకుఁ జెప్పిన వివేకము నీకొఱకుఁ జెప్పఁబడినది. ఎట్టి వివేకముతోఁ గూడినవాఁడవై కర్మము చేఁగలుగు బంధమును విడిచిపెట్టుదువో, అట్టి ఆత్మ తత్త్వజ్ఞానమునకు సాధనమైన కర్మయోగము విషయమై

యుండఁ జెప్పఁబోవు బుద్ధిని వినుము.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥౪౦॥

ఫలాపేక్ష లేక యీశ్వరార్పణముగాఁ జేయఁబడు నీకర్మయోగమును ప్రారంభించుట వ్యర్థము కానేరదు. ఒకప్పుడు మధ్యమధ్య స్వల్పలోపములున్నను దోషము లేదు. ఈ నిష్కామ కర్మమనే ధర్మము యొక్క లేశమయినను మిగుల గొప్పదియగు జనన మరణ

ప్రవాహ రూపమయిన సంసార భయమునుండి సంరక్షించును.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురు నన్దన !।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయో౽వ్యవసాయినామ్॥౪౧॥

ఓ అర్జునుఁడా ! ఈ నిష్కామ కర్మయోగమునందుండువారికి నీశ్వరభక్తిచే సంసారమను సముద్రమును దాఁటుదుమను నిశ్చయబుద్ధి యొకటియే. భక్తిలేక కామ్యకర్మములఁజేయు నిశ్చయ శూన్యులయొక్క బుద్ధులు నానావిధశాఖలు గలవిగా ననేకములుగా నున్నవికదా ?

యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః!
వేదవాద రతాః పార్థ! నాన్య దస్తీతి వాదినః॥ ౪౨॥
కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేష బహులాం భోగైశ్వర్యగతిం ప్రతి॥ ౪౩॥
భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే॥ ౪౪॥

ఓ అర్జునుఁడా! వేదమునందు ఫలమును దెలిపెడి భాగములైన య

ర్థవాదములయందుఁ బ్రీతికలఁవారును, కర్మమునకన్న వేఱు పురుషార్థ సాధనము లేదనువారును, దారేషణ, పుత్త్రైషణ, ధనేషణములను కోరికలచేనిండిన మనస్సుగలవారును, స్వర్గమే యన్నిటిలో మేలయిన పురుషార్థమని యెంచి యుండువారునగు నవివేకులు జన్మమును, కర్మమును, కర్మఫలముల నిచ్చునట్టిదియు, భోగైశ్వర్యములం బొందుట కొఱకు ననేక కర్మభేదములు గలదియు, ఫలప్రదము కాని వేదవాక్యములను పూచువానివలెఁ బైకి మెఱుఁగుగనుండి

స్వర్గాదులనెడు నల్ప సుఖముల నిచ్చునదియనగు నీ మోసపుచ్చు
నట్టి యేమాటలను చెప్పుచున్నారో, అట్టి వాక్యములచేత నపహరింపఁ
బడిన మనస్సుగలవారును, సుఖానుభవమునందును, ఐశ్వర్యమందు
నాశగలవారునగు వారలకు నిశ్చయమైనబుద్ధి చిత్తైకాగ్ర్యమునందుఁ
గలుగనేరదు.

త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున!।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ ౪౫

ఓ అర్జునుఁడా! శ్రుతులు సత్వరజస్తమోగుణములవలనఁ గలిగిన

సంసార స్వరూపమును దెలియఁజేయునదిగా నున్నది. నీవు త్రిగుణములవలనఁ గలుగు విషయాశను వదలినవాఁడవుగను, శీతోష్ణాది ద్వంద్వములతో సంపర్కము లేనివాఁడవుగను, ఎల్లప్పుడును శుద్ధ సత్త్వగుణమునే యాశ్రయించినవాఁడవుగను, తనకు లేనివస్తువును బొందుట యనే యోగమును, తనకుగలవస్తువును విడువక రక్షించుకొనుట యనే క్షేమమును లేనివాఁడవుగను, ఆత్మజ్ఞానివిగను అగుము.

యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే।
తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ ౪౬॥

స్నానపానాదులకు మాత్రము పయుక్తమగు స్వల్పజలముగల బావి మొదలగు వానియందు నెంతప్రయోజనము కలదో, అంతటనిండిన నీరుగల గొప్పతటాకము మొదలగువానియందు నంతప్రయోజనము గలిగియుండుట యెట్లో, అట్లు వేదోక్తములైన సకలకర్మములలో నెంత ప్రయోజనము కలదో, అంతప్రయోజనము స్వరూపనిశ్చ

యాను భవముగల బ్రహ్మజ్ఞాన నిష్ఠునకును కలుగుచున్నది.

కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన।
మాకర్మఫలహేతుర్భూర్మాతే సఙ్గోఽస్త్వకర్మణి॥ ౪౭॥

నీకు కర్మముఁ జేయుటయందే యధికారముకలదు. ఒకప్పుడును కర్మఫలములయందధికారమువద్దు. దురాశచే కర్మఫలములను కలుగఁ జేసికొనువాఁడవుగా కాకుము. ఫలేచ్ఛ లేనప్పుడు నాకుఁ గర్మము లేల యని వానిని జేయకుండుటయందును నీకభిలాష కలుగకుండును గాక.

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥౪౮॥

ఓ అర్జునుఁడా! నీవు ధ్యానయోగమందున్నవాఁడవై విషయ సంబంధమును విడిచి, సత్కర్మానుష్ఠానమువలనఁ గలిగెడి బ్రహ్మజ్ఞానరూపమైన ఫలముయొక్క కలిమియందును లేమియందును, నొకే విధముగా నున్నవాఁడవై స్వకీయమైన వర్ణాశ్రమకర్మములను చేయుము. ప్రాప్తాప్రాప్తములయందు మనస్సు సమముగా నుండు

నట్టి నిబ్బరమే యోగమని చెప్పఁబడుచున్నది.

దూరేణహ్యవరంకర్మ బుద్ధియోగాద్ధనఞ్జయ ! ।
బుద్ధౌశరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ ౪౯ ॥

ఓ యర్జునుఁడా ! ఈశ్వరారాధనమను బుద్ధితోఁజేయు నిష్కామ కర్మమునకంటె, ఫలమునుగోరి చేయఁబడిన కామ్యకర్మము మిక్కిలి నికృష్టమైనది కదా ? కాఁబట్టి నిష్కామకర్మయోగ బుద్ధియందుఁగాని, దానిపరిపాకమువలనఁ గలిగెడు సాంఖ్యయోగ

బుద్ధియందుఁగాని, అభయ ప్రాప్తిసాధనమును ప్రార్థింపుడు. ఫలముఁగోరి కర్మములఁ జేయువారు జన్మమరణాది దుఃఖపరంపరను సదాపొందునట్టి దీనులుగానుందురు.

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥౫౦॥

సుఖదుఃఖాదులయందు సమబుద్ధిగలవాఁడు పుణ్య పాపముల రెంటి నీజన్మమందు త్యజించుచున్నాఁడు. ఆకారణమువలన నిష్కా

ము కర్మ యోగము కొఱకు సిద్ధపడుము. స్వవర్ణాశ్రమ విహితము లైన సత్కర్మములయందు ఫలాపేక్ష లేకఁ జొరబఁడు సామర్థ్యము యోగమని చెప్పఁబడుచున్నది.

కర్మజం బుద్ధియుక్తాహి ఫలంత్యక్త్వా మనీషిణః ।
జన్మ బన్ధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్ ॥ ౫౧ ॥

సుఖదుఃఖములయందు సమత్వ బుద్ధిగల కర్మయోగులు విషయ వాసనలను విడిచి నిశ్చల జ్ఞానముగలవారలై జన్మమనెడి బంధము

వలన విడువఁబడి సర్వోపద్రవ రహితమైన జీవన్ముక్తియను స్థాన మును పరంపరగా పొందుచున్నారనుట. శ్రుతులయందుఁ బ్రసిద్ధము.

యదా తే మోహ కలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ ॥ ౫౨ ॥

ఎప్పుడు నీయొక్క బుద్ధి దేహమే యాత్మయనెడి యజ్ఞాన రూప దోషమును దాఁటునో, అప్పుడు వినఁదగిన వేదాంతార్థము యొక్కయు వినిన వేదాంతముయొక్కయు వైరాగ్యమును పొందఁగలవు

శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధా వచలాబుద్ధి స్తదా యోగమవాప్స్యసి॥ ౫౩ ॥

నానావిధ శ్రవణాదులచేఁ జలించియుండెడి నీయొక్క యంతః కరణము, సద్గురూపదేశముగలిగి యెప్పుడాత్మైక్యానుసంధానరూప ధ్యానమందు విషయ ప్రవృత్తి శూన్యమయినదియై, స్థిరమయినది యనై యుండునో, అప్పుడు కర్మయోగమునకు ఫలమయిన తత్త్వ జ్ఞానయోగరూపమగు జీవన్ముక్తిని పొందగలవు.

అర్జున ఉవాచ—అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు.

స్థితప్రజ్ఞస్య కా భాషా? సమాధిస్థస్య కేశవ!।
స్థితధీః కింప్రభాషేత? కిమాసీత? వ్రజేతకిమ్? ॥ ౫౪ ॥

ఓ కృష్ణా! యీ చెప్పిన సమాధియందున్న నిశ్చయానుభవముగల పురుషుని లక్షణమెయ్యది? బ్రహ్మమునందు నిశ్చయబుద్ధిగల పురుషుఁ డెట్టిమాటలను పలుకును? ఏమిచేయుచుండును? అతనినడత లెట్టివి?

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణమూర్తి తెలియఁజేయుచున్నాఁడు.

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్।
ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥ ౫౫ ॥

ఓ యర్జునుఁడా! యెప్పుడు మనస్సునందుండెడి సమస్తములయి న కోరికలను విడుచుచున్నాఁడో, తన్నుఁదాను తెలిసికొని యానందించునో, అప్పుడు వాఁడు స్థితప్రజ్ఞుఁడనిఁ జెప్పఁబడుచున్నాఁడు.

దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః।
వీత రాగ భయ క్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే॥ ౫౬ ॥

అధ్యాత్మికాది దుఃఖములయందు క్షోభమును పొందని మనస్సు గలవాఁడును, సుఖములయం దాశలేనివాఁడును, ప్రీతి, భయము, కోపము, లేనివాడునగు మననశీలుఁడు నిశ్చలబుద్ధిగల జ్ఞానియని చెప్పఁబడుచున్నాఁడు.

యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౫౭ ॥

ఏ మనన శీలుఁడు తన దేహము మొదలగు పుత్రమిత్రాది సమస్త

మందు నభిమానములేనివాఁడో, ఆయా మంచి చెడ్డలను పొందినను సంతోషింపఁడో, లేక ద్వేషింపఁడో, ఆ పురుషునియొక్క వివేకమువలనఁ గలుగు జ్ఞానము మిక్కిలి స్థిరమైనదిగా నగుచున్నది.

యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౫౮ ॥

తాఁబేలు తన కరచరణాద్యవయవముల నన్నివైపులను లోపలికి ముణుఁచు కొనునట్లు.జ్ఞాననిష్ఠా ప్రవృత్తుఁడగు నీయతి యింద్రియము

లను సమస్తమైన విషయములనుండి యెప్పుడు మరలించుకొనునో, అప్పుడట్టిజ్ఞానియొక్క జ్ఞానము మిక్కిలిస్థిరమయినదిగానగుచున్నది.

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ ౫౯ ॥

ఇంద్రియములను విషయములయందుఁ బ్రవర్తింపఁ జేయని జీవునికి విషయవాసన తప్ప యిన్ద్రియములచేఁ గలుగు తక్కిన విషయానుభవములన్నియు నివర్తించుచున్నవి. పరబ్రహ్మస్వరూపమును

గురుశాస్త్రోపదేశానుభవములచేఁ దెలిసికొనినపిమ్మట యీస్థిరప్రజ్ఞునికి విషయవాసనయును లేశమయిన లేక నశించును.

యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః ।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥ ౬౦ ॥

ఓ కుంతీపుత్ర! మోక్షముకొఱకు, దృఢ యత్నముఁ జేయుచున్నట్టియు వివేకియునైన పురుషునియొక్క మనస్సునుగూడనిలుకడ గలిగియుండనీయని యింద్రియములు బలాత్కారముగా విషయ

ములయందుఁ బ్రవర్తింపఁజేయుచున్నవి యనునదియనుభవసిద్ధము.

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౬౧ ॥

అట్టి క్షోభమును గలుగఁజేయు సకలేంద్రియములను వశము చేసి కొని సమాధిగలవాఁడుగాను, సమస్తమును పరబ్రహ్మ స్వరూపమే కనుక నిరంతరానుభవము గలవాఁడుగాను నుండవలసినది. ఎవని యొక్క యింద్రియములు తన వశముగానున్నవో, వాని యొక్క జ్ఞాన

ముకదా మిక్కిలి స్థిరముయినది యగును.

ధ్యాయతోవిషయాన్ పుంసస్సఙ్గస్తేషూపజాయతే।
సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥ ౬౩॥

ప్రపంచమునందుండెడి వస్తువులను చింతించుచున్న పురుషునకు నావిషయములయందు ప్రీతియగు సంగము కలుగుచున్నది. విషయ

ప్రీతివలన ఆశ కలుగుచున్నది. తానాశించిన వస్తువును మఱియొకఁ
డాశించి యడ్డువచ్చినయెడల కోపము కలుగుచున్నది. కోపమువలన
తనయొడలు తనకే తెలియకుండునట్టి యవివేకము కలుగుచున్నది.
అవివేకమువలన నాచార్యోపదేశముచే తెలిసికొన్న సన్మార్గమునకు
మఱపు కలుగుచున్నది. మఱపువలన కార్యాకార్య వివేకమునకు
యోగ్యమయిన యంతఃకరణమునకు నాశము కలుగుచున్నది. తెలివి
లేక పోవుటవలన పరమ పురుషార్థమయిన పరబ్రహ్మానుభవమునకుఁ
దగక చెడిపోవును.

రాగ ద్వేష వియుక్తైస్తు విషయా నిన్ద్రియైశ్చరన్।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ॥ ౬౪ ॥

ప్రియాప్రియరహితములైనవియు స్వాధీనములైనవియునగు నింద్రియములచేత శరీరధారణమాత్ర సాధనములగు నన్నపానాది విషయములను విధిలేక యనుభవించుచున్నవాఁడైనను స్వాధీనమయిన మనస్సుగలవాఁడు మనస్సమాధానమును పొందుచున్నాఁడు.

ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్న చేతసోహ్యాశు బుద్ధిఃపర్యవతిష్ఠతి॥ ౬౫॥

మనస్సమాధానము గలిగినపిమ్మట నీ స్థిర ప్రజ్ఞునియొక్క యాధ్యాత్మికాది సమస్తదుఃఖములకును నాశము కలుగుచున్నది. శుద్ధాంతఃకరణము గలవానికి శీఘ్రముగా సోఽహం బ్రహ్మయను నిశ్చయాత్మకమయిన బుద్ధి, యాకాశమువలె నంతట నఖండ బ్రహ్మాకారముగా నుండును.

నాస్తిబుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా।
నచాభావయత శ్శాన్తి రశాన్తస్య కుత స్సుఖమ్॥ ౬౬॥

ఇంద్రియ నిగ్రహము లేనివానికి ఆత్మా నాత్మ వివేకము కలుగదు. ఇంద్రియ నిగ్రహము లేనివానికి బ్రహ్మభావనయను నిశ్చయజ్ఞానము కలుగనేరదు. అట్టి బ్రహ్మభావన చేయనివానికి విషయ వాసనా రాహిత్యము కలుగదు. విషయవాసనారాహిత్యము కానివానికి బ్రహ్మానంద సుఖమెక్కడిది ?

ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివామ్భసి॥ ౬౭॥

విషయములయందు ప్రవర్తించుచున్న యింద్రియములలోపల నే యింద్రియమును మనస్సు అనుసరించి వర్తించుచున్నదో, యా యింద్రియము యీపురుషునియొక్క ఆత్మానాత్మవివేకమును, సముద్రమునందు పరువిడునోడను ప్రతికూలవాయువువలె నపమార్గమున కాకర్షించుచున్నదనునది ప్రసిద్ధము.

తస్మాద్యస్య మహా బాహో! నిగృహీతాని సర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౬౮॥

గొప్పభుజబలముగల ఓ యర్జునుఁడా! ఇంద్రియములిట్టి దుష్టప్రవృత్తిగలవిగనుక యెవనియొక్క సమస్తములైన యింద్రియములు విషయములలోనుండి మరలింపఁబడుచున్నవో, వానియొక్క జ్ఞానము మిక్కిలి స్థిరమయినదిగా నగుచున్నది.

యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతో మునేః ॥౬౯॥

అవివేకులయిన సకల ప్రాణులకు నే బ్రహ్మనిష్ఠ గోచరము గాక పోవుటవలన రాత్రివలె నప్రకాశమగు నవివేక నిద్రగానుండునో, ఆ బ్రహ్మనిష్ఠయందు నింద్రియ నిగ్రహము గల వివేకికి గురూపదేశ మహావాక్యార్థ శ్రవణ మనన నిదిధ్యాస జన్యానుభవముచే మేలుకొని యుండు పగలుగా నుండును. అహంకారాభిమాన విషయాసక్తులగు

నవివేకులు విషయాసక్తితో ప్రవర్తించుచుండు జాగ్రదవస్థ, ఆత్మ స్వరూపదర్శియైన జ్ఞానికి దృశ్యప్రపంచ మవిద్యాస్వరూపమగుటవలన విషయ స్ఫూర్తిలేక రాత్రిగనుండును.

ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠమ్
సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తిమాప్నోతి న కామకామీ ॥ ౭౦

ఉదకముచే సంపూర్ణముగా నిండింపఁబడినదియు, గట్టుదాఁటని యునికి గలదియునగు సముద్రమును, నదిమొదలగు యుదకములే లాగున ప్రవేశించుచున్నవో, ఆలాగున సకలమైన కోరికలును, పూర్ణమయిన బ్రహ్మైక్యాను భవముగలవాఁడును నిశ్చలమైన బుద్ధి గల వాఁడునగు నే బ్రహ్మనిష్ఠునిఁ బొంది యణఁగి పోవుచున్నవో, యట్టి బ్రహ్మనిష్ఠుఁడు విషయ నివృత్తి రూపమగు మోక్షమును పొందును. విషయా సక్తిగల సంసారి మోక్షమును పొందఁడు.

విహాయకామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహఙ్కార స్సశాన్తి మధిగచ్ఛతి ॥ ౭౧॥

విద్యాభ్యాసి సమస్తమయిన విషయములను విడిచి యెంత మాత్రమును వానియం దభిలాషలేనివాఁడును, తనశరీరమునుగాని తనశరీరసంరక్షణార్థము గ్రహించుపదార్థములనుగాని తనవని మమకార రూపాభిమానరహితుఁడును, నేను బ్రహ్మనిష్ఠచేయుచున్నాను ఈనిష్ఠ చేయుట కితరులకు సాధ్యముకాదు, అను నీ మొదలగు నహ

ఙ్కార రూపాభిమానరహితుఁడునై ప్రారబ్ధవశమున దేహపాతపర్యంతమును సంచరించుచున్నాఁడో, ఆ సమాధినిష్ఠుఁడు సకలదుఃఖనివృత్తిరూపమైన మోక్షమును పొందుచున్నాఁడు.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ ! నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాఽస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి॥ ౭౨॥

ఓ యర్జునుఁడా ! యింతవఱకుఁ జెప్పఁబడినదియే బ్రహ్మజ్ఞాన నిష్ఠావివరణము. ఈ బ్రహ్మజ్ఞాననిష్ఠను పొంది జ్ఞాని మోహమును

పొందఁడు. ఈ బ్రహ్మజ్ఞాన నిష్ఠయందు దేహావసాన సమయమందు యైన నుండినను బ్రహ్మమందు లయమగు మోక్షమును తప్పక పొందు చున్నాఁడు.

ఇట్లు,

సాంఖ్యయోగమను

రెండవ యధ్యాయము

ముగిసినది.

---

శ్రీరస్తు.

# మూఁడవ అధ్యాయము.



## కర్మయోగము.

అర్జున ఉవాచ=అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు.

జ్యాయసీచే త్కర్మణ స్తే మతాబుద్ధి ర్జనార్దన!।
తత్కిం కర్మణి ఘోరేమాం నియోజయసి కేశవ?॥ ౧॥

ఓ శ్రీకృష్ణస్వామీ! కర్మయోగముకంటె జ్ఞానయోగము శ్రేష్ఠమైనదని నీకు నిష్టమైనచో, ఓ శ్రీకృష్ణస్వామీ! అయిన నీవేల ప్రాణిహింసాదిరూపమయిన యుద్ధమునందు నన్నుఁ బ్రవర్తింపఁజేయుచున్నావు ?.

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్॥ ౨॥

మనస్సునకు గలఁతను గలుగఁజేయునట్టి దానివలెనుండు వాక్యముచేత నాయొక్క బుద్ధిని మోహింపఁజేయునట్లున్నావు. కర్మజ్ఞాన

ములో దేనిచేత సమస్త శ్రేయస్సులలో నుత్తమమయిన మోక్ష మును నేను పొందుదునో, అట్టి యొకదానిని నిశ్చయించి చెప్పుము.

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణమూర్తి ప్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు.

లోకేఽస్మిన్ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ!।
జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥

పాపరహితుఁడవైన యో యర్జునుఁడా! యీలోకమున పూర్వమందు తత్త్వవిచార పూర్వకముగ బ్రహ్మనిష్ఠఁజేయఁ బ్రయత్న

ము చేయ సాంఖ్యులకు శ్రవణ మననాది జ్ఞానయోగాభ్యాసము చేతను, కర్మము చేసి తద్ద్వారా చిత్తశుద్ధికలిగి పిమ్మట తత్త్వవిచారము చేయ నిచ్ఛగల కర్మయోగులకు నిష్కామ కర్మయోగము చేతను, రెండు ప్రకారములుగల యనుష్ఠానక్రమము నాచేఁ జెప్పఁబడెను.

న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ ౪॥

పురుషుఁడు సకలపాపములనుబోఁగొట్టి చిత్తశుద్ధిని గలుగఁజేయు

జ్ఞాన నిష్ఠకు హేతువైన సత్కర్మముల నాచరింపక పోవుటవలన జ్ఞాన నిష చేఁగలుగు నాత్మానుభవమును పొందఁడు. జ్ఞానరహితుఁడు కర్మత్యాగము చేయుటమాత్రమువలననే నైష్కర్మ్యలక్షణ సిద్ధిని పొందనే పొందఁడుగదా?

నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠ త్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః॥ ౫॥

ఒకానొక యవస్థయందును క్షణమాత్రమయిన నొకానొక పు

రుషుఁడును కర్మము చేయనివాఁడై యుండఁడుకదా? ఎందుచేతనని
న, అస్వతంత్రుఁడైన అజ్ఞుఁడగు సమస్తమయిన వాఁడును మాయ
వలనఁ బుట్టిన యాశ, ద్వేషము మొదలగు సత్త్వరజస్తమోగుణము
లచేఁ గరచరణాది చేష్టారూపమగు కర్మమును బలాత్కారముగా
చేయింపఁ బడుచున్నాఁడు.

కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥ ౬॥

కర్మేన్ద్రియములను చక్కఁగా నణఁచి, ఎవ్వఁడు మనస్సుచేత శబ్దాది విషయములను చింతించుచున్నాఁడో, వివేక శూన్యమైన మనస్సుగల యట్టి పురుషుఁడు కపటాచారముగలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు.

యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేర్జున ! ।
కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే ॥ ౭ ॥

ఓ యర్జునుఁడా! యెవ్వఁడు జ్ఞానేంద్రియములను మనస్సుచేత

నిగ్రహించి, వాగాది కర్మేంద్రియములచేత చిత్తశుద్ధిని కలుగఁజేయు సత్కర్మములను ఫలాపేక్షారహితుఁడై చేయ మొదలుపెట్టుచున్నాఁడో, అట్టిపురుషుఁడు మిథ్యాచారునికంటె నుత్తముఁడగుచున్నాఁడు.

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీర యాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః ॥ ౮ ॥

వర్ణాశ్రమములనుబట్టి వేదమందుఁ జేయఁదగినదిగా నియమింపఁ

బడియుండెడి కర్మమును నీవు చేయుము. కర్మము చేయక పోవుట కన్నఁ గర్మము చేయుట శ్రేష్ఠము కదా? కర్మము చేయకుండునట్టి నీకు దేహస్థితికూడ బొత్తిగా సిద్ధింపదు.

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బన్ధనః ।
తదర్థం కర్మ కౌన్తేయ! ముక్తసఙ్గస్సమాచర ॥ ౯ ॥

ఓ యర్జునుఁడా! భగవద్విషయమయిన కర్మముకంటె నన్య ముగు కామ్యకర్మమందుఁ బ్రవర్తించుచుండెడి యీలోకము కర్మ

ముచేఁ గట్టుబడియున్నది. కాబట్టి యీ భగవద్విషయమయిన కర్మమును విడువఁబడిన ఫలాపేక్షగలవాఁడవై లెస్సగాఁజేయుము.

సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేనప్రసవిష్యధ్వ మేషవో స్త్విష్ట కామధుక్ ॥ ౧౦ ॥

బ్రహ్మదేవుఁడు యజ్ఞాదికర్మములతోఁగూడిన బ్రాహ్మణాది ప్రజలను సృష్ట్యాదికాలమందు సృజించి, యీయజ్ఞముచేతఁ బ్రజలను బుట్టింపుఁడు. ఈ యజ్ఞము మీకుఁ గోరిన కోరికలనిచ్చునట్టిదిగా నగుఁగాతయని చెప్పెను.

దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ ॥ ౧౧ ॥

ఈ యజ్ఞముచేత మీరు దేవతల నారాధించుఁడు. ఆదేవతలు మీ కిష్టములగు వర్షాదులనిచ్చి వృద్ధిపొందింతురు గాత. అన్యోన్యాభివృద్ధిని గోరుచున్న వారలై శ్రేష్ఠమయిన మేలును బొందగలరు.

ఇష్టాన్భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః ।
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః ॥ ౧౨ ॥

యాగములచే నారాధింపఁబడిన దేవతలభీష్టములైన భోగములను మీకొఱకు నీయఁగలరుకదా? ఆదేవతలచేత నీయఁబడిన వృష్ట్యన్నాది భోగములను నీదేవతలకొఱకు నీయకయే యెవ్వఁడు తాను మాత్రమే భుజించుచున్నాఁడో, వాఁడు చోరుఁడే.

యజ్ఞశిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వ కిల్బిషైః ।
భుఞ్జతే తేత్వఘం పాపా యేపచ న్త్యాత్మ కారణాత్ ॥ ౧౩ ॥

యజ్ఞమందు భగవదర్పణముఁజేసి మిగిలిన యమృతమనెడియన్న

మును భుజించెడి స్వభావముగల సత్పురుషుఁడు పంచసూనాదికమగు సమస్త పాపములనుండియు విడువఁబడుచున్నాఁడు. ఎవ్వరైతే తమ యుదర పూరణనిమిత్తము భుజించుచున్నారో, అట్టి పాపులగు వారలు పాపమును భుజించుచున్నారు.

అన్నాద్భవన్తి భూతాని పర్జన్యా దన్న సమ్భవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః ॥ ౧౪ ॥

కర్మ బ్రహ్మోద్భవంవిద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్ ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యంయజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ ౧౫ ॥
ఏవం ప్రవ ర్తితం చక్రం నానువ ర్తయతీ హయః।
అఘాయు రిన్ద్రియారామో మోఘంపార్థ! సజీవతి ॥౧౬ ॥

అన్నరసముచేఁ గలుగు వీర్యశోణితములచే జీవునికి శరీరములు కలుగుచున్నవి. వర్షమువలన అన్నమను పదార్థము కలుగుచున్నది. యజ్ఞమువలన మేఘము తద్ద్వారావర్షము కలుగుచున్నది. యాగము

సత్కర్మాచరణముచే నిష్పన్నమగుచున్నది. సత్కర్మము వేదములచేఁ గలుగుచున్నది. వేదము కూటస్థబ్రహ్మముచేఁ గలుగుచున్నది. సర్వవ్యాపియైన వేదమెల్లప్పుడును యజ్ఞమునందు విశేషముగా నుంచఁబడియున్నది. కాఁబట్టి యీవిధముగా నెవ్వఁడు బ్రహ్మచేఁ జేయఁబడిన కర్మసమూహరూపమగు జగచ్చక్రము నీలోకమందు ననుసరింపఁడో, ఓయర్జునుఁడా! వాఁడు పాపమయమగు జీవనముగలవాఁడును, ఇన్ద్రియ పరాధీనుఁడై విషయాసక్తుఁడైనవాఁడును గావున

నిష్ప్రయోజనముగా బ్రదుకుచున్నాఁడని తెలిసికొనుము.

యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవచ సన్తుష్ట స్తస్య కార్యం నవిద్యతే॥ ౧౭ ॥

బ్రహ్మజ్ఞానియగు నేపురుషుఁడైతే తనయందే యాసక్తిగలవాఁడును, తనయందే సంతోషపడుచున్నవాఁడు నగునో, ఆయాత్మవిదునికిఁ జేయఁదగినది లేదు. కర్మముతో నగత్యము లేదు.

నైవతస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన।
నచాస్య సర్వభూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః ॥ ౧౮ ॥

ఆ బ్రహ్మనిష్ఠున కీలోకమునందు కర్మము చేసినందుచేతఁ బ్రయోజనము బొత్తిగా లేదు. కర్మము చేయనందుచేత నొకానొక దోషమును లేదు. ఈ బ్రహ్మనిష్ఠునికి సమస్త భూతములయందును బ్రయోజననిమిత్త మాశ్రయింపవలసిన పదార్థ మొకటియు లేదు.

తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్కర్మ పరమాప్నోతి పూరుషః ॥౧౯॥

కాఁబట్టి నీవు ఫలాపేక్ష లేనివాఁడవై యెల్లప్పుడును చేయఁదగిన

కర్మము నాచరింపుము. ఏలయనిన, ఫలాపేక్షలేనివాఁడై కర్మము నాచరించుచున్న పురుషుఁడు పరంపరాక్రమముగా మోక్షమును పొందుచున్నాఁడు.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోక సంగ్రహమేవాపి సంపశ్యన్కర్తు మర్హసి ॥ ౨౦ ॥

జనకుఁడు మొదలగువారు నిష్కామ కర్మముచేతనే చిత్తశుద్ధిని తద్ద్వారాజ్ఞానమును పొందిరిగదా? రాజ్యాధిపతిగనుక, నీవునుజనుల

నపమార్గములయందుఁ బ్రవర్తింపకుండ నివారించుటయను ప్రయోజనము నూహించియైన కర్మమును జేయుటకే తగుచున్నావు.

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః ।
సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥ ౨౧ ॥

వయస్సు, యోగ్యత, ఆచారము వ్యవహారము వీనిచే గొప్పవాఁడైనవాఁ డేయే కర్మము నాచరించుచున్నాఁడో, ఆయాకర్మమునే పామరుఁడైన తక్కిన జనుఁడు నాచరించుచున్నాఁడు. ఆగొప్ప

వాఁడే వేదశాస్త్రములను ప్రమాణములుగాఁ దలంచుచున్నాఁడో, పామరజనుఁడా వేదశాస్త్రములనే యనుసరించుచున్నాఁడు.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి ॥ ౨౨ ॥

ఓ యర్జునుఁడా! నాకు, చేయఁదగిన కర్మము లేదు. దేవ పితృ మనుష్య లోకములయందిదివఱకుఁ బొందఁబడఁనిదియై యిప్పుడు క్రొత్తగాఁ బొందఁదగిన వస్తువేదియును లేదు. అయినను కర్మమం

ము ప్రవర్తించుచున్నానుగదా?

యదిహ్యహం న వర్తేయం జాతుకర్మణ్యతన్ద్రితః।
మమవర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః ॥ ౨౩ ॥

ఓ యర్జునుఁడా! నేను జాగ్రతగలవాఁడనగుచుఁ గర్మమునందుం డక పోదునేని, ప్రజ లన్నిప్రకారములుగా నాయొక్క మార్గము ననుసరింతురుగదా?

ఉత్సీదేయు రిమేలోకా నకుర్యాం కర్మచే దహమ్।
సఙ్కరస్యచ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః॥ ౨౪॥

నేను కర్మమును చేయనైతినేని, ఈ జనులు నన్నుఁజూచి నావలెఁ గర్మములను మానుటచేఁ గర్మభ్రష్టులగుదురు. నేను వర్ణసంకరమునకును కర్తనుగా నగుదును. అందువల్ల నీ ప్రజలను చెడఁగొట్టిన వాఁడ నైదును.

సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథాకుర్వన్తి భారత!।
కుర్యాద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షుర్లోక సజ్గ్రహమ్॥౨౫॥

ఓ యరునుఁడా! ఆత్మజ్ఞానము లేనివారు కర్మమందు ఫలాపేక్షఁగ

లవారలై యేలాగున చేయుచున్నారో, ఆలాగున నాత్మజ్ఞుఁడు ఫలాపేక్షారహితుఁడై ప్రజలపమార్గములయందుఁ బ్రవర్తింప కుండుటయను ప్రయోజనమును నెఱవేర్పఁదలంపుఁగలవాఁడై చేయవలెను.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మ సఙ్గినామ్!।
జోషయేత్సర్వ కర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్॥ ౨౬॥

ఆత్మజ్ఞుఁడు, కర్మమందాసక్తికలిగిన యవివేకులబుద్ధికిఁ జలనమును బుట్టింపఁగూడదు. నేర్పుగలిగి తానాచరించుచున్నవాఁడై సమస్త

కర్మముల నితరులచే నాచరింపఁ జేయవలెను.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహఙ్కారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే ॥ ౨౭॥

మాయవలనఁబుట్టిన కార్యకరణ రూపములైన యింద్రియముల చేతను, తద్వికారములచేతను, నానావిధములుగాఁ జేయఁబడుచున్న కర్మములను, దేహమే తానను నహంకార భావముచేత వివేకశూన్యమగుమనస్సుగలపురుషుఁడు నేనుచేయువాఁడననితలంచుచున్నాఁడు.

తత్త్వవిత్తు మహాబాహో! గుణ కర్మ విభాగయోః।
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే॥ ౨౮ ॥

ఓయర్జునుఁడా! ఇంద్రియములు శబ్దాది విషయములయందుఁ బ్రవర్తించుచున్నవని తెలిసికొని, సత్త్వాదిగుణములయొక్కయు, వానిచేఁ జేయఁబడు కర్మముల యొక్కయు, విభజనలయొక్కయు యథార్థమును దెలిసినవాఁడైతే, యభిమానమును సంగమును కలిగియుండఁడు.

ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణ కర్మసు।
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్॥ ౨౯॥

ఎవరు మాయయొక్క సత్త్వాదిగుణములచే మోహపెట్టఁబడిన వారలగుచు నింద్రియవ్యాపారములయందు నభిమానమునుంచుదురో, యట్టికర్మసంగులను సమస్తమెఱిఁగినవాఁడు కర్మభ్రష్టులుగా చేయఁగూడదు.

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాఽధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరః॥ 3౦ ॥

సమస్తములైన కర్మఫలములను నాయందు సమర్పించి భగవదర్పణములను వివేక బుద్ధితో ఫలాపేక్షారహితుఁడుగను మమకార

రహితుఁడవునయి సంతాపము లేనివాఁడవై యుద్ధముఁ జేయుము.

యే మే మతమిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥ 3౧॥

ఏ మనుష్యులు నాయొక్క యీ యభిప్రాయమును నా వాక్యమందు విశ్వాసముగలవారును, నాయందసూయ లేనివారునయి యెల్లప్పుడు ననుసరింతురో, వారును పుణ్యపాప కర్మఫలములచే విడువఁబడుచున్నారు.

యే త్వే తదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వజ్ఞాన విమూఢాంస్తాన్ విద్ధినష్టానచేతసః ॥ 3౨ ॥

ఎవ్వరైతే నాయొక్క యీయభిప్రాయమును ద్వేషించువారలై
నుసరింపరో, వారల నవివేకులనుగాను, బ్రహ్మకర్మవిషయములగు
జ్ఞానము లేనివారలనుగాను, చెడినవారలనుగాను తెలిసికొనుము.

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి ।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కింకరిష్యతి ? ॥ 33 ॥

సదసద్విభాగ జ్ఞానము కలవాఁడైనను, స్వకీయమైన ప్రస్తుతజన్మము నందు వెల్లడియైన జన్మాన్తర కృత ధర్మాధర్మాది సంస్కారమున కనుగుణముగానే ప్రవర్తించుచున్నాఁడు. ప్రాణులు జన్మాంతర సంస్కారమును అనుసరించి నడచుచున్నారు. కాఁబట్టి యింద్రియనిగ్రహమును, ఆజ్ఞయును నెుకరి కట్టుబాటును వీరల నేమిచేయఁగలదు?

ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపన్థినౌ ॥ 3౪ ॥

సమస్తేన్ద్రియములయొక్క శబ్దాదివిషయములందును, నిష్టమందుఁ బ్రీతియును అనిష్టమందు నప్రీతియు నేర్పడియున్నది. ఆ రాగద్వేషముల కధీనత్వమును పొందఁగూడదు. ఆ రాగద్వేషము లీజ్ఞానికి శత్రువులనునది శాస్త్రప్రసిద్ధముకదా?

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 3౫ ॥

చక్కగా నాచరింపఁబడిన స్వవర్ణాశ్రమవిహిత ధర్మవ్యతిరిక్త

ధర్మాచరణముకంటె, స్వజాతిధర్మము గుణము లేనిదైనను శ్రేష్ఠమైనది. స్వవర్ణాశ్రమ ధర్మమందుండువానికి మరణమయినను శ్రేష్ఠము. అన్య వర్ణాశ్రమయోగ్య ధర్మము పాపభయమును గలుగఁజేయును.

అర్జున ఉవాచ=అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు.

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ! బలాదివ నియోజితః ॥ ౩౬ ॥

ఓ శ్రీకృష్ణమూర్తీ! అయితే ప్రతి పురుషుఁడును దేనిచేతఁ బ్రేరే

పింపఁబడినవాఁడగుచు విషయానుభవము నిచ్ఛగింపనివాఁడైనను బ
లాత్కారముగా రాజుచేత నాజ్ఞాపింపఁబడిన భృత్యుఁనివలె విష
యానుభవరూపమయిన దుష్కర్మము నాచరించుచున్నాఁడు ?
శ్రీభగవానువాచ= శ్రీకృష్ణమూర్తి ప్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు.

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్॥ 37

నీచే నడుగఁబడిన యీ హేతువు రజోగుణమువలనఁ బుట్టినట్టి

కామమగుచున్నది. ఈకోరికయే క్రోధరూపముగాఁ బరిణమించుచున్నది. ఇది తృప్తినిఁ బొందనిదియు, మహాపాపములకుఁ గారణభూతమైనదియు గావున నీ కామము నీ మోక్షమార్గమందు శత్రువునుగాఁ దెలిసికొనుము.

ధూమేనావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ।
యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్॥3౮॥

అగ్ని పొగచేత నేలాగున కప్పఁబడుచున్నదో, అద్దము మాలిన్య

ము చేత నేలాగున కప్పఁబడుచున్నదో, గర్భమందుండెడి శిశువు మావి చేత నేలాగున కప్పఁబడియుండునో, అలాగుననే సత్త్వమువలనఁ గలుగు నీజ్ఞాన మాకామముచేత కప్పఁబడియున్నది.

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్య వైరిణా ।
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణా నలేనచ ॥3౯॥

ఓ యర్జునుఁడా! నిందింప నశక్యమైనదియు, ఎన్నికట్టెలు వేయుచున్నను తృప్తిబొందని యగ్ని వంటిదియు, ఆశా స్వరూపమయినది

యను, బ్రహ్మజ్ఞానియొక్క నిత్యశత్రువయినదియనగు నీ యాశచేత నాత్మజ్ఞానము కప్పఁబడియున్నది.

ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥ ౪౦॥

ఇన్ద్రియములును, మనస్సును, బుద్ధియు నీ కామమున కాశ్రయ మని చెప్పఁబడుచున్నది. ఈ కామ మీయింద్రియాదులచేత నాత్మ జ్ఞానమును కప్పి దేహముగల జీవుని నానా విధముగా మోహింపఁ

జేయుచున్నది.

తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్॥ ౪౧॥

కాఁబట్టి ఓ యర్జునుఁడా! నీవు జ్ఞాన సాధనమైన నిష్కామకర్మ యోగ ప్రారంభ సమయమందే దశేంద్రియములను స్వాధీనము చేసికొని విజ్ఞానమును లేకుండఁజేయునదియు, పాపకారణమునగు నీ కాముమును సంపూర్ణముగా విడువుము.

ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధి ర్యోబుద్ధేః పరతస్తు సః ॥ ౪౨ ॥

శ్రోత్రాదీంద్రియములు దేహాదులకంటే శ్రేష్ఠములైనవనియు, ఇన్ద్రియములకంటె మనస్సు ఉత్కృష్టమైనదనియు, సంకల్ప వికల్పాత్మకమగు మనస్సుకంటె నిశ్చయాత్మకమైన బుద్ధి ఉత్కృష్టమైనదనియు జ్ఞానులు చెప్పుచున్నారు. ఎవ్వఁడు బుద్ధికంటె శ్రేష్ఠుఁడుగానున్నాఁడో, వాఁడే ఆత్మయని తెలిసికొనవలసినది.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో ! కామరూపం దురాసదమ్॥౪౩।

ఓ యర్జునుఁడా! వెనుకటిశ్లోకమందుఁ జెప్పఁబడిన ప్రకారముగా బుద్ధికంటె శ్రేష్ఠుఁడైన వానిఁగా ఆత్మను "దన్ను దాను" తెలిసికొని నిశ్చయాత్మకమగు బుద్ధిచేత మనస్సును నిశ్చలముగఁ జేసి, జయింప నసాధ్యమయినదియు, నానాస్వరూపమయినదియునగు శత్రువును గెలువుము; నశింపఁజేయుము.

ఇట్లు కర్మయోగమను మూడవయధ్యాయము ముగిసెను.

5½

శ్రీరస్తు.

# నాల్గవ అధ్యాయము.

## జ్ఞానవిభాగయోగము.

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహమవ్యయమ్।
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥

ఏవం పరమ్పరా ప్రాప్త మిమం రాజర్షయో విదుః।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప! ॥ ౨॥
సఏవాయంమయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥ ౩॥

నాశములేని మోక్షరూప ఫలమునిచ్చునట్టి యీ జ్ఞాన యోగమును నేను సృష్టి యాది కాలమందు సూర్యుని కొఱకుఁ జెప్పిన

కుఁజెప్పెను. ఆమనువు తన కుమారుఁడైన యిక్ష్వాకునకుఁ జెప్పెను. ఓ యర్జునుఁడా! ఈవిధముగా పారంపర్యముచేఁ బొందఁబడిన యీజ్ఞానయోగమును రాజర్షులు తెలిసికొనిరి. అధిక కాలము గడిచినందున యాజ్ఞానయోగ మీలోకమందు విచ్ఛిన్న సంప్రదాయము కలదై నశించెను. నీవు నాయొక్క భక్తుఁడవును, స్నేహితుఁడవున యితివి కావున ప్రాచీనమయిన యా యీజ్ఞానయోగమే నాచేత నిప్పుడు నీకొఱకుఁ జెప్పఁబడినది. శ్రేష్ఠమయిన యీజ్ఞానము బహు గోప్యమైనది కదా?

అర్జున ఉవాచ=అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు.

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథ మేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥ ౪॥

ఓ కృష్ణా! నీయొక్క పుట్టుక యిప్పటిది సూర్యునియొక్క పుట్టుక మునుపటిది. సృష్టికి మొదటను నీవతనికి జ్ఞానయోగమును చెప్పితివనుట యేదికలదో దాని నెట్లు నేను నమ్ముదును.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరంతప ॥ ౫॥

ఓ యర్జునుఁడా? నాకును నీకు ననేకములయిన పుట్టుకలు గడచినవి; ఆజన్మములనన్నిఁటిని సర్వజ్ఞుఁడనగు నేనెఱుఁగుదును. ఓ యర్జునుఁడా! కించిజ్జ్ఞుఁడవగు నీవెఱుఁగవు.

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామ్యాత్మమాయయా ॥ ౬ ॥

పుట్టుకలేనివాఁడనైనను, నాశరహితములైన జ్ఞానశక్తి స్వభావములు కలవాఁడనైనను, బ్రహ్మాదిసమస్తప్రాణులకు నియామకుఁడనై

నను, మాయను స్వాధీనము చేసికొని స్వశక్తిచే నవతరించుచున్నాను.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత !।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ ౭॥

ఓ యర్జునుఁడా! ఏయే కాలమందు వర్ణాశ్రమ ధర్మమునకు నాశమును, అధర్మమునకు నభివృద్ధియును కలుగుచున్నదో, అప్పుడున్ను నేను మనుష్యరూపముగా నవతరించుచున్నాను.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే॥ ౮॥

---

సత్పురుషులయొక్క రక్షణముకొఱకును పాపాత్ములయొక్క నా
శనము కొఱకును ధర్మమును లెస్సగాఁ బ్రవర్తింపఁ జేయుటకొఱ
కును ప్రతి యుగమునందవతరించుచున్నాను.

జన్మ కర్మచ మేదివ్య మేవం యోవేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతిమామేతి సోఽర్జున!॥ ౯॥

ఓ యర్జునుఁడా! అప్రాకృతమైన నాయొక్క యవతారమును
సాధు సంరక్షణాది రూపకమగు బ్రవృత్తిని నెవ్వఁడు యథార్థముగా

నెఱుంగుచున్నాండో, వాండు శరీరమును విడిచి మరల జనన మరణ రూప సంసారమును బొందండు. మఱియేమనిన నన్నే బొందును.

వీత రాగ భయ క్రోధా మన్మయా మా ముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః ॥ ౧౦॥

రాగాది రహితులయినవారును, ఈశ్వరుండనగు నాతో నభేదమును బొందినవాండ్రును, నన్ను జ్ఞాననిష్ఠచేం దెలిసికొనినవారునగు ననేక సత్పురుషులు బ్రహ్మైక్యానుసంధానానుభవమును తపస్సు

చేత పరిశుద్ధులై సాయుజ్యమును పొందిరి.

యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్ ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః ॥ ౧౧ ॥

ఓ యర్జునుఁడా! ఎవ్వరు ఫలాపేక్షతోఁగాని, ఫలాపేక్షారహితముగాఁగాని నన్నుపాసించుచున్నారో, వారల నాలాగుననే నేనను(గహించుచున్నాను. మనుష్యులు నాయొక్క మార్గమును భక్తి, జ్ఞాన, కీర్తన మొదలగు సత్కర్మములచే ననుసరించుచున్నారు.

రుషుఁడును కర్మము చేయనివాఁడై యుండఁడుకదా? ఎందుచేతనని
న, అస్వతంత్రుఁడైన అజ్ఞుఁడగు సమస్తమయిన వాఁడును మాయ
వలనఁ బుట్టిన యాశ, ద్వేషము మొదలగు సత్త్వరజస్తమోగుణము
లచేఁ గరచరణాది చేష్టారూపమగు కర్మమును బలాత్కారముగా
చేయింపఁ బడుచున్నాఁడు.

కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥ ౬॥

కర్మేన్ద్రియములను చక్కఁగా నణఁచి, ఎవ్వఁడు మనస్సుచేత శబ్దాది విషయములను చింతించుచున్నాఁడో, వివేక శూన్యమైన మనస్సుగల యట్టి పురుషుఁడు కపటాచారముగలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు.

యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేర్జున ।
కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్తస్సవిశిష్యతే ॥ ౭ ॥

ఓ యర్జునుఁడా! యెవ్వఁడు జ్ఞానేంద్రియములను మనస్సుచేత

నిగ్రహించి, వాగాది కర్మేంద్రియములచేత చిత్తశుద్ధిని కలుగఁజేయు సత్కర్మములను ఫలాపేక్షారహితుఁడై చేయ మొదలుపెట్టుచున్నాఁడో, అట్టిపురుషుఁడు మిథ్యాచారునికంటె నుత్తముఁడగుచున్నాఁడు.

> నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
> శరీర యాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ ౮ ॥

వర్ణాశ్రమములనుబట్టి వేదమందుఁ జేయఁదగినదిగా నియమింపఁ

బడియుండెడి కర్మమును నీవు చేయుము. కర్మము చేయక పోవుట కన్నఁ గర్మము చేయుట శ్రేష్ఠముకదా? కర్మము చేయకుండునట్టి నీకు దేహస్థితికూడ బొత్తిగా సిద్ధింపదు.

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోయం కర్మబన్ధనః ।
తదర్థం కర్మ కౌన్తేయ! ముక్తసఙ్గస్సమాచర ॥ ౯ ॥

ఓ యర్జునుఁడా! భగవద్విషయమయిన కర్మముకంటె నన్యమగు కామ్యకర్మమందుఁ బ్రవర్తించుచుండెడి యీలోకము కర్మ

ము చేఁ గట్టుబడియున్నది. కాబట్టి యీ భగవద్విషయమయిన కర్మ మును విడువఁబడిన ఫలాపేక్షగలవాఁడవై లెస్సగాఁ జేయుము.

సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వ మేషవో ఽస్త్విష్ట కామధుక్ ॥ ౧౦ ॥

బ్రహ్మదేవుఁడు యజ్ఞాదికర్మములతోఁగూడిన బ్రాహ్మణాది ప్రజలను సృష్ట్యాదికాలమందు సృజించి, యీయజ్ఞముచేతఁ బ్రజలను బుట్టింపుఁడు. ఈ యజ్ఞము మీకుఁ గోరిన కోరికలనిచ్చునట్టిదిగా నగుఁగాతయని చెప్పెను.

దేవా న్భావయతానేన తేదేవా భావయన్తువః।
పరస్పరం భావయన్త శ్శ్రేయః పర మవాప్స్యథ ॥ ౧౧ ॥

ఈ యజ్ఞముచేత మీరు దేవతల నారాధింపుఁడు. ఆదేవతలు మీ కిష్టములగు వర్షాదులనిచ్చి వృద్ధిపొందింతురు గాత. అన్యోన్యాభివృద్ధిని గోరుచున్న వారలై శ్రేష్ఠమయిన మేలును పొందగలరు.

ఇష్టాన్భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః ।
తైర్దత్తా నప్రదాయైభ్యో యోభుఙ్క్తే స్తేన ఏవసః ॥ ౧౨ ॥

యాగములచే నారాధింపఁబడిన దేవతలభీష్టములైన భోగములను మీకొఱకు నీయఁగలరుకదా? ఆదేవతలచేత నీయఁబడిన వృష్ట్యన్నాది భోగములను నీదేవతలకొఱకు నీయకయే యెవ్వఁడు తాను మాత్రమే భుజించుచున్నాఁడో, వాఁడు చోరుఁడే.

యజ్ఞశిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః ।
తేత్వఘం భుఞ్జతేపాపా యేపచ న్త్యాత్మకారణాత్ ॥ ౧౩ ॥

యజ్ఞమందు భగవదర్పణముఁజేసి మిగిలిన యమృతమనెడియన్న

మును భుజించెడి స్వభావముగల సత్పురుషుఁడు పంచసూనాదికమగు సమస్త పాపములనుండియు విడువఁబడుచున్నాఁడు. ఎవ్వరైతే తమ యుదర పూరణనిమిత్తము భుజించుచున్నారో అట్టి పాపులగు వారలు పాపమును భుజించుచున్నారు.

అన్నాద్భవన్తి భూతాని పర్జన్యా దన్న సమ్భవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ ౧౪ ॥

కర్మ బ్రహ్మోద్భవంవిద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యంయజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ ౧౫ ॥
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।
అఘాయు రిన్ద్రియారామో మోఘంపార్థ! సజీవతి ॥౧౬॥

అన్నరసముచేఁ గలుగు వీర్యశోణితములచే జీవునికి శరీరములు కలుగుచున్నవి. వర్షమువలన అన్నమను పదార్థము కలుగుచున్నది. యజ్ఞమువలన మేఘము తద్ద్వారావర్షము కలుగుచున్నది. యాగము

సత్కర్మాచరణముచే నిష్పన్నమగుచున్నది. సత్కర్మము వేదముల చేఁ గలుగుచున్నది. వేదము కూటస్థబ్రహ్మముచేఁ గలుగుచున్నది. సర్వ వ్యాపియైన వేదమెల్లప్పుడును యజ్ఞమునందు విశేషముగా నుంచఁ బడియున్నది. కాఁబట్టి యీవిధముగా నెవ్వఁడు బ్రహ్మచేఁ జేయఁ బడిన కర్మసమూహరూపమగు జగచ్చక్రము నీలోకమందు ననుసరిం పఁడో, ఓయర్జునుఁడా! వాఁడు పాపమయమగు జీవనముగలవాఁ డును, ఇన్ద్రియ పరాధీనుఁడై విషయాసక్తుఁడైనవాఁడును గావున

నిష్ప్రయోజనముగాఁ బ్రదుకుచున్నాఁడని తెలిసికొనుము.

యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవచ సన్తుష్ట స్తస్య కార్యం న విద్యతే॥ ౧౭ ॥

బ్రహ్మజ్ఞానియగు నేపురుషుఁడైతే తనయందే యాసక్తిగలవాఁడును, తనయందే సంతోషపడుచున్నవాఁడు నగునో, ఆయాత్మవిదునికిఁ జేయఁదగినది లేదు. కర్మముతో నగత్యము లేదు.

నైవ తస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః ॥ ౧౮ ॥

ఆ బ్రహ్మనిష్ఠున కీలోకమునందు కర్మముచేసినందుచేత బ్రయో-
జనము బొత్తిగాలేదు. కర్మముచేయనందుచేత నేకానేక దోష
మునులేదు. ఈ బ్రహ్మనిష్ఠునికి సమస్త భూతములయందును బ్రయో-
జననిమిత్త మాశ్రయింపవలసిన పదార్థ మొకటియులేదు.

తస్మాదసక్తస్సతతం కార్యం కర్మసమాచర ।
అసక్తో హ్యాచరన్కర్మ పరమాప్నోతి పూరుషః ॥౧౯॥

కాఁబట్టి నీవు ఫలాపేక్షలేనివాఁడవై యెల్లప్పుడును చేయఁదగిన

కర్మము నాచరింపుము. ఏలయనిన, ఫలాపేక్షలేనివాఁడై కర్మము నాచరించుచున్న పురుషుఁడు పరంపరాక్రమముగా మోక్షమును పొందుచున్నాఁడు.

కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్కర్తు మర్హసి ॥ ౨౦ ॥

జనకుఁడు మొదలగువారు నిష్కామ కర్మముచేతనే చిత్తశుద్ధిని తద్ద్వారా జ్ఞానమును పొందిరిగదా? రాజ్యాధిపతిగనుక, నీవునుజనుల

నపమార్గములయందుఁ బ్రవర్తింపకుండ నివారించుటయను ప్రయో
జనము నూహించియైన కర్మమును జేయుటకే తగుచున్నావు.

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః ।
సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥ ౨౧ ॥

వయస్సు, యోగ్యత, ఆచారము వ్యవహారము వీనిచే గొప్ప
వాఁడైనవాఁడే యే కర్మము నాచరించుచున్నాఁడో, ఆయాకర్మము
నే పామరుఁడైన తక్కిన జనుఁడు నాచరించుచున్నాఁడు. ఆగొప్ప

వాఁడే వేదశాస్త్రములను ప్రమాణములుగాఁ దలంచుచున్నాఁడో, పామరజనుఁడా వేదశాస్త్రములనే యనుసరించుచున్నాఁడు.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి ॥ ౨౨ ॥

ఓ యర్జునుఁడా! నాకు, చేయఁదగిన కర్మములేదు. దేవ పితృ మనుష్య లోకములయందిదివఱకుఁ బొందఁబడఁనిదియై యిప్పుడు క్రొత్తగాఁ బొందఁదగిన వస్తువేదియునులేదు. అయినను కరమం

ము ప్రవర్తించుచున్నానుగదా?

యదిహ్యహం నవర్తేయం జాతుకర్మణ్యతన్ద్రితః ।
మమవర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః ॥ ౨౩ ॥

ఓ యర్జునుఁడా! నేను జాగ్రతగలవాఁడనగుచుఁ గర్మమునందుం డక పోదునేని, ప్రజ లన్నిప్రకారములుగా నాయొక్క మార్గము ననుసరింతురుగదా?

ఉత్సీదేయురిమేలోకా నకుర్యాం కర్మచేదహమ్ ।
సఙ్కరస్యచ కర్తాస్యా ముపహన్యా మిమాః ప్రజాః ॥ ౨౪ ॥

నేను కర్మమును చేయనైతినేని, ఈ జనులు నన్నుఁజూచి నావలెఁ గర్మములను మానుటచేఁ గర్మభ్రష్టులగుదురు. నేను వర్ణసంకరమునకును కర్తనుగా నగుదును. అందువల్ల నీ ప్రజలను చెడఁగొట్టిన వాఁడ నౌదును.

సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథాకుర్వన్తి భారత!।
కుర్యాద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షుర్లోక సఙ్గ్రహమ్॥౨౫॥

ఓ యర్జునుఁడా! ఆత్మజ్ఞానము లేనివారు కర్మమందు ఫలాపేక్షఁగ

లవారలై యేలాగున చేయుచున్నారో, ఆలాగున నాత్మజ్ఞుఁడు ఫలాపేక్షారహితుఁడై ప్రజలపమార్గములయందుఁ బ్రవర్తింప కుండుటయను ప్రయోజనమును నెఱవేర్పఁదలంచువుఁగలవాఁడై చేయవలెను.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మ సఙ్గినామ్।
జోషయేత్సర్వ కర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్॥ ౨౬॥

ఆత్మజ్ఞుఁడు, కర్మమందాసక్తికలిగిన యవివేకులబుద్ధికిఁ జలనమును బుట్టింపఁగూడదు. నేర్పుగలిగి తానాచరించుచున్నవాఁడై సమస్త

కర్మముల నితరులచే నాచరింపఁ జేయవలెను.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే ॥ ౨౭॥

మాయవలనఁబుట్టిన కార్యకరణ రూపములైన యింద్రియముల చేతను, తద్వికారములచేతను, నానావిధములుగాఁ జేయఁబడుచున్న కర్మములను, దేహమే తానను నహంకార భావముచేత వివేకశూన్యమగుమనస్సుగల పురుషుఁడు నేను చేయువాఁడనని తలంచుచున్నాఁడు.

తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః।
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే॥౨౮॥

ఓయర్జునుఁడా! ఇంద్రియములు శబ్దాది విషయములయందుఁ బ్రవర్తించుచున్నవని తెలిసికొని, సత్త్వాదిగుణములయొక్కయు, వానిచేఁ జేయఁబడు కర్మముల యొక్కయు, విభజనలయొక్కయు యథార్థమును దెలిసినవాఁడైతే, యభిమానమును సంగమును కలిగియుండఁడు.

ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు।
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్॥౨౯॥

ఎవరు మాయయొక్క సత్త్వాదిగుణములచే మోహపెట్టఁబడిన వారలగుచు నింద్రియవ్యాపారములయందు నభిమానము నుంచుదురో, యట్టికర్మసంగులను సమస్తమెఱిఁగినవాఁడు కర్మభ్రష్టులుగా చేయఁగూడదు.

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాఽధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥ ౩౦ ॥

సమస్తములైన కర్మఫలములను నాయందు సమర్పించి భగవదర్పణములను వివేక బుద్ధితో ఫలాపేక్షరహితుఁడవును మమకారగ

రహితుఁడవునయి సంతాపములేనివాఁడవై యుద్ధముఁ జేయుము.

యే మే మతమిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥ 3౧॥

ఏ మనుష్యులు నాయొక్క యీ యభిప్రాయమును నా వాక్యమునందు విశ్వాసముగలవారును, నాయందసూయలేనివారునయి యెల్లప్పుడు ననుసరింతురో, వారును పుణ్యపాపకర్మఫలములచే విడువఁబడుచున్నారు.

యేత్వే తదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వజ్ఞాన విమూఢాంస్తాన్ విద్ధినష్టానచేతసః ॥ 3౨ ॥

ఎవ్వరైతే నాయొక్క యీయభిప్రాయమును ద్వేషించువారలై యనుసరింపరో, వారల నవివేకులనుగాను, బ్రహ్మకర్మవిషయములగు జ్ఞానము లేనివారలనుగాను, చెడినవారలనుగాను తెలిసికొనుము.

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవా నపి ।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కింకరిష్యతి ? ॥ 33 ॥

సదసద్విభాగ జ్ఞానముకలవాఁడైనను, స్వకీయమైన ప్రస్తుతజన్మ మందు వెల్లడియైన జన్మాన్తర కృత ధర్మాధర్మాది సంస్కారమున కనుగుణముగానే ప్రవర్తించుచున్నాఁడు. ప్రాణులు జన్మాంతర సంస్కారమును అనుసరించి నడచుచున్నారు. కాఁబట్టి యింద్రియనిగ్రహమును, ఆజ్ఞయును నెకరి కట్టుబాటును వీరల నేమిచేయఁగలదు?

ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపన్థినౌ ॥ ౩౪ ॥

సమస్తేన్ద్రియములయొక్క శబ్దాదివిషయమందును, నిష్టమందుఁ బ్రీతియును అనిష్టమందు నప్రీతియు నేర్పడియున్నది. ఆ రాగద్వేషముల కధీనత్వమును పొందఁగూడదు. ఆ రాగద్వేషము లీజ్ఞానికి శత్రువులనునది శాస్త్రప్రసిద్ధముకదా?

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ ౩౫ ॥

చక్కగా నాచరింపఁబడిన స్వవర్ణాశ్రమవిహిత ధర్మవ్యతిరిక్త

ధర్మాచరణముకంటె, స్వజాతిధర్మము గుణము లేనిదైనను శ్రేష్ఠమైనది. స్వవర్ణాశ్రమ ధర్మమందుండువానికి మరణమయినను శ్రేష్ఠము. అన్య వర్ణాశ్రమయోగ్య ధర్మము పాపభయమును గలుగఁజేయును.

అర్జున ఉవాచ=అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు.

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ ! బలాదివ నియోజితః ॥ 3౬ ॥

ఓ శ్రీకృష్ణమూర్తీ! అయితే ప్రతి పురుషుఁడును దేనిచేతఁ ప్రేరే

పింపఁబడినవాఁడగుచు విషయానుభవము నిచ్ఛగింపనివాఁడైనను బలాత్కారముగా రాజుచేత నాజ్ఞాపింపఁబడిన భృత్యుఁనివలె విషయానుభవరూపమయిన దుష్కర్మము నాచరించుచున్నాఁడు ?

శ్రీభగవానువాచ= శ్రీకృష్ణమూర్తి ప్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు.

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్॥ 3౭॥

నీచే నడుగఁబడిన యీ హేతువు రజోగుణమువలనఁ బుట్టినట్టి

కామముగుచున్నది. ఈకోరికయే కోపరూపముగాఁ బరిణమించు
చున్నది. ఇది తృప్తినిఁ బొందనిదియు, మహాపాపములకుఁ గారణ
భూతమైనదియు గావున నీ కామము నీ మోక్షమార్గమందు శత్రు
వునుగాఁ దెలిసికొనుము.

ధూమే నావ్రియతేవహ్ని ర్యథాఽదర్శో మలేన చ।
యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్॥౩౮॥

అగ్ని పొగచేత నేలాగున కప్పఁబడుచున్నదో, అద్దము మాలిన్య

ము చేత నేలాగున కప్పఁబడుచున్నదో, గర్భమందుండెడి శిశువు మావి చేత నేలాగున కప్పఁబడియుండునో, ఆలాగుననే సత్త్వమువలనఁ గలుగు నీజ్ఞాన మాకామము చేత కప్పఁబడియున్నది.

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్య వైరిణా ।
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణా నలేనచ ॥3౯॥

ఓ యర్జునుఁడా! నిందింప నశక్యమైనదియు, ఎన్ని కట్టెలు వేయు చున్నను తృప్తిబొందని యగ్ని వంటిదియు, ఆశా స్వరూపమయినది

యా, బ్రహ్మజ్ఞానియొక్క నిత్యశత్రువయినదియనగు నీ యాశచేత నాత్మజ్ఞానము కప్పఁబడియున్నది.

ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే ।
ఏతై ర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥ ౪౦॥

ఇన్ద్రియములును, మనస్సును, బుద్ధియు నీకామమున కాశ్రయ మని చెప్పఁబడుచున్నది. ఈ కామ మీయింద్రియాదులచేత నాత్మ జ్ఞానమును కప్పి దేహముగల జీవుని నానా విధముగా మోహింపఁ

జేయుచున్నది.

తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ!।
పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్॥ ౪౧॥

కావున ఓ యర్జునుఁడా! నీవు జ్ఞానసాధనమైన నిష్కామకర్మయోగ ప్రారంభసమయమందే దశేంద్రియములను స్వాధీనము చేసికొని విజ్ఞానమును లేకుండఁజేయునదియు, పాపకారణమునగు నీ కామమును సంపూర్ణముగా విడువుము.

ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధి ర్యోబుద్ధేః పరతస్తు సః ॥ ౪౨ ॥

శ్రోత్రాదీంద్రియములు దేహాదులకంటే శ్రేష్ఠములైనవనియు, ఇన్ద్రియములకంటె మనస్సు ఉత్కృష్టమైనదనియు, సంకల్ప వికల్పాత్మకము గు మనస్సుకంటె నిశ్చయాత్మకమైన బుద్ధి ఉత్కృష్టమైనదనియు జ్ఞానులు చెప్పుచున్నారు. ఎవ్వఁడు బుద్ధికంటె శ్రేష్ఠుఁడుగానున్నాఁడో, వాఁడే ఆత్మయని తెలిసికొనవలసినది.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో ! కామరూపం దురాసదమ్॥౪౩॥

ఓ యర్జునుఁడా! వెనుకటిశ్లోకమందుఁ జెప్పఁబడిన ప్రకారముగా బుద్ధికంటె శ్రేష్ఠుఁడైన వానిఁగా ఆత్మను “దన్నుదాను” తెలిసికొని నిశ్చయాత్మకమగు బుద్ధిచేత మనస్సును నిశ్చలముగఁజేసి, జయింపనసాధ్యమయినదియు, నాశాస్వరూపమయినదియునగు శత్రువును గెలువుము; నశింపఁజేయుము.

ఇట్లు కర్మయోగమను మూడవయధ్యాయము ముగిసెను.

5½

శ్రీరస్తు.

# నాల్గవ అధ్యాయము.

## జ్ఞానవిభాగయోగము.

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహమవ్యయమ్।
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ ౧

ఏవం పరమ్పరా ప్రాప్త మిమం రాజర్షయో విదుః।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప! ॥　　౨॥
సఏవాయంమయాతేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥　　౩॥

నాశములేని మోక్షరూప ఫలమునిచ్చునట్టి యీ జ్ఞాన యోగ
మును నేను సృష్టి యాది కాలమందు సూర్యుని కొఱకుఁ జెప్పిన
వాఁడనైతిని సూర్యుఁడు తన పుత్రుఁడైన వైవస్వత మనువుకొఱ

కుఁజెప్పెను. ఆమనువు తన కుమారుఁడైన యిక్ష్వాకుకొఱకుఁ జెప్పెను. ఓ యర్జునుఁడా! ఈవిధముగా పారంపర్యముచేఁ బొందఁబడిన యీజ్ఞానయోగమును రాజర్షులు తెలిసికొనిరి. అధికకాలము గడిచినందున యాజ్ఞానయోగ మీలోకమందు విచ్ఛిన్న సంప్రదాయము కలదై నశించెను. నీవు నాయొక్క భక్తుఁడవును, స్నేహితుఁడవున యితివి కావున ప్రాచీనమయిన యా యీజ్ఞానయోగమే నాచేత నిప్పుడు నీకొఱకుఁ జెప్పఁబడినది. శ్రేష్ఠమయిన యీజ్ఞానము బహుగోప్యమైనది కదా?

అర్జున ఉవాచ=అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు.

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథ మేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥ ౪॥

ఓ కృష్ణా! నీయొక్క పుట్టుక యిప్పటిది సూర్యునియొక్క పుట్టుక మునుపటిది. సృష్టికిమొదటను నీవతనికి జ్ఞానయోగమును చెప్పితివనుట యేదికలదో దాని నెట్లు నేను నమ్ముదును.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!।
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరన్తప!॥ ౫॥

ఓ యర్జునుఁడా? నాకును నీకు ననేకములయిన పుట్టుకలు గడచినవి; ఆజన్మములనన్నిఁటిని సర్వజ్ఞుఁడనగు నేనెఱుఁగుదును. ఓ యర్జునుఁడా! కించిద్జ్ఞుఁడవగు నీవెఱుఁగవు.

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామ్యాత్మమాయయా ॥ ౬ ॥

పుట్టుకలేనివాఁడనైనను, నాశరహితములైన జ్ఞానశక్తి స్వభావములు కలవాఁడనైనను, బ్రహ్మాదిసమస్త ప్రాణులకు నియామకుఁడనై

నను, మాయను స్వాధీనము చేసికొని స్వశక్తిచే నవతరించుచున్నాను.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ ౭॥

ఓ యర్జునుఁడా! ఏయే కాలమందు వర్ణాశ్రమ ధర్మమునకు నాశమును, అధర్మమునకు నభివృద్ధియును కలుగుచున్నదో, అప్పుడున్ను నేను మనుష్యరూపముగా నవతరించుచున్నాను.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే॥ ౮॥

సత్పురుషులయొక్క రక్షణముకొఱకును పాపాత్ములయొక్క నాశనము కొఱకును ధర్మమును లెస్సగాఁ బ్రవర్తింపఁ జేయుటకొఱకును బ్రతి యుగమునందవతరించుచున్నాను.

జన్మ కర్మచ మేదివ్య మేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతిమామేతి సోఽర్జున!॥ ౯॥

ఓయర్జునుఁడా! అప్రాకృతమైన నాయొక్క యవతారమును సాధు సంరక్షణాది రూపమగు బ్రవృత్తిని నెవ్వఁడు యథార్థముగా

నెఱుంగుచున్నాఁడో, వాఁడు శరీరమును విడిచి మరల జనన మరణ రూప సంసారమును బొందఁడు. మఱియేమనిన నన్నే బొందును.

వీత రాగ భయ క్రోధా మన్మయా మా ముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః ॥　౧౦॥

రాగాది రహితులయినవారును, ఈశ్వరుఁడనగు నాతో నభేదమును బొందినవాంఛులను, నన్ను జ్ఞాననిష్ఠచేఁ దెలిసికొనినవారునగు ననేక సత్పురుషులు బ్రహ్మైక్యానుసంధానానుభవమును తపస్సు

చేత పరిశుద్ధులై సాయుజ్యమును బొందిరి.

యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః ॥ ౧౧॥

ఓ యర్జునుఁడా! ఎవ్వరు ఫలాపేక్షతోఁ గాని, ఫలాపేక్షారహితము గాఁగాని నన్నుపాసించుచున్నారో, వారల నాలాగుననే నే ననుగ్రహించుచున్నాను. మనుష్యులు నాయొక్క మార్గమును భక్తి, జ్ఞాన, కీర్తన మొదలగు సత్కర్మములచే ననుసరించుచున్నారు.

కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా॥ ౧౨॥

ఈ లోకమందు కర్మములయొక్క ఫలసిద్ధి నపేక్షించువారింద్రాది దేవతలనుగూర్చి యాగాది రూపముగా నారాధించుచున్నారు. మనుష్య లోకమందు కర్మమువలనఁగలిగెడు ఫలప్రాప్తిశీఘ్రముగా నగుచున్నది.

చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణ కర్మ విభాగశః।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్॥ ౧౩॥

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను వర్ణచతుష్టయము నాచే త సత్త్వాది గుణకర్మముల యొక్క విభజనను పట్టి సృజింపఁబడి నది; ఆగుణ కర్మ విభాగమునుపట్టి యేర్పడిన సృష్టికిఁ గర్తనైనను నన్ను కర్త కాని వానినిగాను, నాశములేని వానినిగాను, తెలిసికొనుము.

న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా।
ఇతిమాంయోఽభిజానాతి కర్మభిర్న సబధ్యతే॥　　౧౪॥

నన్ను సృష్ట్యాది కర్మములు అంటవు; నాకు కర్మఫలమునందుఁ

గోరికలేదు; ఈ ప్రకారముగా నన్నెవ్వఁడెఱుంగు చున్నాఁడో, వాఁడు కర్మములచేఁ గట్టఁబడఁడు.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః।
కురు కర్మైవ తస్మాత్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥౧౫॥

ఈ ప్రకారముగాఁ దెలిసికొని పూర్వికులైన మోక్షాపేక్షగలవారలచేతనుగూడ కర్మము చేయఁబడినది, ఆ కారణమువలన జనకాదులచేత చేయఁబడినదియు, పురాతనమైనట్టిదియునగు కర్మమునే నీవు చేయుము.

కిం కర్మ కిమకర్మేతి కవయో౽ప్యత్ర మోహితాః।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసే౽శుభాత్ ॥౧౬॥

కర్మయెట్టిది? అకర్మయెట్టిది? అను నీ కర్మజ్ఞాన విషయమునఁ బండితులును మోహమును జెందిరి; దేనిని తెలిసికొని యనుష్ఠించి సంసార సంబంధమగు పాపమునుండి విడుఁదలను బొందఁగలవో, ఆ కర్మాకర్మములను నీకొఱకు లెస్సగాఁ జెప్పెదను.

కర్మణో౽హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః ॥ ౧౭॥

వేదోక్తమైన సత్కర్మముయొక్క యథార్థ స్వరూపము తెలియఁదగినది. చేయఁగూడదని వేదములచే నిషేధింపఁబడిన కర్మముల యొక్కయు యథార్థ స్వరూపము తెలియఁదగినది. కర్మరహిత తూష్ణీంభావము యొక్కయు యథార్థస్వరూపము తెలియఁదగినది. ఏలననఁగా కర్మము, వికర్మము, అకర్మము యని మూఁడువిధము లయిన కర్మముయొక్క యథార్థమఙ్జులకు తెలియ నశక్యమైనది.

కర్మణ్యకర్మ యఃపశ్యే దకర్మణిచ కర్మయః।
సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్ ॥౧౮॥

వ్యాపారమాత్ర కర్మమందు కర్మము లేకపోవుటను, అకర్మమందు కర్మము నెవ్వఁడు చూచునో, వాఁడే మనుష్యులలో నిశ్చయాత్మకమయిన తెలివిగలవాఁడును, మనోనివృత్తిగలవాఁడును, వాఁడే సకల కర్మముల నాచరించువాఁడు నగుచున్నాఁడు.

యస్య సర్వే సమారమ్భాః కామ సఙ్కల్ప వర్జితాః।
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పణ్డితం బుధాః॥ ౧౯।

ఎవ్వనియొక్క సమస్తములయిన కర్మములును ఫలాపేక్ష లేనివో,

జ్ఞానాగ్నిచే దహింపఁబడిన సకలాగామి సంచితకర్మములు గలిగిన వానిని జ్ఞానులు వివేకిగాఁ జెప్పుదురు.

త్యక్త్వా కర్మ ఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతి సః॥ ౨౦॥

ఆ బ్రహ్మజ్ఞాననిష్ఠుఁడు కర్మములయందుఁ గర్తృత్వాభిమానమును, తత్ఫలములయందాశనువిడిచి యెల్లప్పుడును స్వాత్మానందానుభవము చేఁదృప్తుఁడైనవాఁడును నిరాశ్రయుఁడైనవాఁడునగుచు కర్మమందుఁ

ప్రవర్తించినవాఁడైనను నెక్కుడానిని జేయనివాఁడే యగుచున్నాఁడు.

నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ ౨౧॥

**ఆశలు** లేనివాఁడును, స్వాధీనమైన చిత్తంబును, ఇంద్రియంబులును **కలవాఁడును** సకలసంపాదనము లేనివాఁడునై శరీరమునిలుచుటకు మాత్రము ప్రయోజనము గాఁగల భిక్షాటనాది కర్మమును చేయుచున్నవాఁడైనను, పుణ్యపాపములగు సంసార సంబంధమును పొందఁడు.

యదృచ్ఛాలాభసన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః ।
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే॥ ౨౨॥

అయాచితముగా సంభవించిన యాహార పదార్థములతోఁ దృప్తిఁబొందినవాఁడును, శీతోష్ణాది ద్వన్ద్వములకు లక్ష్యపెట్టనివాఁడును, మాత్సర్యము లేనివాఁడును, ఆహారాదుల యదృచ్ఛాప్రాప్తియందును, అప్రాప్తియందును తుల్యబుద్ధి కలవాఁడునయి బ్రహ్మజ్ఞాననిష్ఠాదికర్మములను చేసినను కర్మబంధమును పొందఁడు.

గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ ౨౩ ॥

అభిమానము లేనివాఁడును కామక్రోధాది మూలమగు సంసారము నుండి విడువఁబడినవాఁడును, బ్రహ్మజ్ఞానమందు నిలిచియున్న మనస్సుగలవాఁడును, భగవత్ప్రీత్యర్థముగా యాగకర్మమును జేయుచున్నవాఁడునగు నీబ్రహ్మజ్ఞాని యొక్క కర్మము, ప్రాచీనకర్మఫలముతోఁగూడ నశించుచున్నది.

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥ ౨౪॥

యజ్ఞమందు హోమము జేయఁబడు స్రుక్, స్రువములును బ్రహ్మ స్వరూపమే; అన్నము, నేయి మొదలగు హోమద్రవ్యములును బ్రహ్మమే; బ్రహ్మరూపమైనయగ్ని యందు బ్రహ్మస్వరూపుఁడగు యజమానునిచేఁ జేయఁబడు హోమమును బ్రహ్మమే; సర్వము బ్రహ్మస్వరూపమనెడి చిత్తైకాగ్రతతో నీయజ్ఞాదికర్మమును జేయునట్టి బ్రహ్మజ్ఞానిచేత బొందఁదగిన ఫలమును బ్రహ్మమే.

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥ ౨౫॥
కొందఱుకర్మనిష్ఠులు, ఇంద్రాదిదేవతలనుద్దేశించి చేయఁబడు జ్యోతిష్టోమాదియజ్ఞమును ఫలాసక్తితోఁ జేయుచున్నారు. మఱికొందఱు బ్రహ్మాత్మైకత్వభావనచేతనే యుపాధివిశిష్టాత్మను "జీవుని" నిరుపాధిక పరబ్రహ్మమనెడి యగ్నియందు హోమముఁ జేయుచున్నారు.
శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయానన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ॥ ౨౬॥

కొందఱు శ్రోత్రము మొదలైన యిన్ద్రియములను నిగ్రహమనెడి యగ్నియందు హోమము జేయుచున్నారు. మఱికొందఱు శబ్దము మొదలైన విషయముల నింద్రియములనెడి యగ్నియందు హోమము చేయుచున్నారు.

సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥ ౨౭॥

మఱికొందఱు సర్వేంద్రియవ్యాపారములను గురూపదిష్టస్వానుష్ఠానవివేకముచేఁ బ్రకాశింపఁజేయఁబడిన ఆత్మవిషయక సమాధియనె

దు బ్రహ్మజ్ఞాన యోగాగ్నియందు హోమము చేయుచున్నారు.

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశిత వ్రతాః॥ ౨౮॥

కొందఱు ద్రవ్యమును, మంచిక్షేత్రము, తీర్థము మొదలుగాఁగల ప్రదేశములలో సత్పాత్రమందు దానము చేయుటయే యజ్ఞమనియు, కొందఱు కృచ్ఛ్రచాంద్రాయణోపవాసాది తపస్సులు చేయుటయే యజ్ఞమనియు, కొందఱు ప్రాణాయామ ప్రత్యాహారద్యష్టాంగయోగమే యజ్ఞమనియు, ఆలాగుననే కొందఱు వేదాధ్యయనమే యజ్ఞము

నియు, వేదాంగములను జదివి యథార్థ విచారణమును జేయుటయే యజ్ఞమనియుఁదలఁచి చేయుచున్నారు. ఇట్టియజ్ఞములను జేయు టకుఁబ్రయత్నము చేయువారు కఠినమైన వ్రతములు గలవారు.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే।
ప్రాణాపానగతీరుద్ధ్వా ప్రాణాయామపరాయణాః॥౨౯॥

ప్రాణాయామము చేయువారలగు మఱికొందఱు ప్రాణాపానవాయువుగతులను నిగ్రహించి, (కుంభకము చేసి) అపానవాయువ్యాపారమందు, ప్రాణవాయు వ్యాపారమును (పూరకమును) అలాగున నే

ప్రాణవాయువ్యాపారమందు అపానవాయు వ్యాపారమును (రేచకమును) హోమముఁ జేయుదురు.

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥　30॥

మఱికొందఱు పరిమితమైన యాహారమును భుజించు వారగుచు నింద్రియవ్యాపారములను వశీకృతేంద్రియములయందు హోమముఁ జేయుచున్నారు. ఈ సమస్తమైనవారలును, యజ్ఞమును దెలిసినవారు. యజ్ఞముచేత నశింపఁజేయఁబడిన పాపములు గలవారు.

యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ! ॥

పంచమహా యజ్ఞములను జేయగా మిగిలిన యమృతమనఁబడు నన్నమును భుజించువారు, శాశ్వతమయిన బ్రహ్మమును పొందుచున్నారు. ఓకురువంశశ్రేష్ఠుడా! యజ్ఞములలో నొకటిని జేయనివానికీలోకము లేదు, అనునప్పుడు స్వర్గాది పరలోక మెక్కడిది?

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥ ౩౨॥

ఇట్లు పలువిధంబులగు యజ్ఞములు వేదమందు సవిస్తరముగాఁ జెప్పఁబడి యున్నవి. ఆ యజ్ఞములను కర్మములవలనఁ బుట్టినవానిఁగా తెలియుము; ఈ విధముగాఁ దెలిసికొనిన యెడల బంధమునుండి విడువఁబడఁగలవు.

శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప!।
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥ 33॥

ఓ యర్జునుఁడా! ద్రవ్యసాధన సాధ్యమైన యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము మిక్కిలి శ్రేష్ఠమయినది. ఓ యర్జునుఁడా! సకలకర్మ

మును నాశముకానిదగుచు బ్రహ్మజ్ఞానమందు అంతర్భూతమైయున్నది.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తేజ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥ 34 ॥
యత్ జ్ఞాత్వా న పు నర్మోహ మేవం యాస్యసి పాణ్డవ ।
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ 35 ॥

ఓ యర్జునుఁడా! ఆత్మతత్త్వము నెఱింగిన జ్ఞాను లే బ్రహ్మజ్ఞానమును నీకొఱకుపదేశింపఁగలరో, ఏ జ్ఞానమును బొంది తిరిగియు నిట్టి మోహమును పొందవో, ఏ జ్ఞానముచే సమస్తప్రాణులను నీయందు

ను, ఆలాగున నేనాయందును చూడఁగలవో, అజ్ఞానమును సాష్టాంగ నమస్కారముచేతను, గురుశిష్యసంవాదముచేతను గురుశుశ్రూషచేతను తెలిసికొనుము.

అపి చేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వంజ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి ॥ ౩౬॥

పాపులందఱికంటె నీవు మిక్కిలి పాపములను జేసినవాఁడ వగుదువేని సమస్తమయిన పాపమను సముద్రమును, జ్ఞానమనెడి తెప్పచేతనే లెస్సగా దాఁటఁగలవు.

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున!।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ ౩౭॥

ఓ యర్జునుఁడా! లెస్సగా మండుచున్న యగ్ని కఱ్ఱల నేలాగున సంపూర్ణముగా భస్మము చేయునో, అలాగుననే జ్ఞానమనెడియగ్ని సకలకర్మములను సంపూర్ణముగా భస్మము చేయును.

నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥ ౩౮॥

ఈలోకమందు జ్ఞానముతోఁ తుల్యమయినదియు, పాపములనుబోఁ

గొట్టి శుద్ధిని గలుగఁ జేయునదియు, మఱేదియు లేదుకదా? కర్మ యోగసిద్ధిని బొందినవాఁడు కాలక్రమమున తనయందాత్మస్వరూపజ్ఞానమును తానుగానే పొందుచున్నాఁడు.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేన్ద్రియః ।
జ్ఞానంలబ్ధ్వా పరాంశాన్తి మచిరేణాధిగచ్ఛతి ॥ ౩౯॥

గురువాక్యములయందు శ్రద్ధగలవాఁడును, ఆప్రకారమనష్ఠించువాఁడును, ఇంద్రియనిగ్రహముకలవాఁడును, బ్రహ్మజ్ఞానమును పిమ్మట నుత్తమమైనమోక్షమనుశాన్తిపరతిని శీఘ్రముగా పొందుచున్నాఁడు.

అజ్ఞ శ్చాశ్రద్ధదానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయంలోకోఽస్తినపరో నసుఖం సంశయాత్మనః॥ ౪౦॥

గురూపదేశమును దెలిసికొననివాఁడును,పరాకులేక విననివాఁడును సద్గురు వుపదేశించిన విషయములవలన ఫలము కలుగునో కలుగదోయను సందేహము కలవాఁడును, చెడిపోవుచున్నాఁడు. సంశయము గలవానికీ లోకసుఖము లేదు, పరలోక సుఖమును లేదు, కాఁబట్టి మనశ్శాన్తియును లేదు.

యోగసన్న్యస్త కర్మాణం జ్ఞాన సఞ్ఛిన్న సంశయమ్।
ఆత్మవన్తం నకర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ! ॥ ౪౧॥

ఓ యర్జునుఁడా! పరమార్థజ్ఞానముచే సకల కర్మములను విడిచిన వాఁడుగాను, గురూపదిష్టజ్ఞానమువలన సకల సందేహమును బోఁగొట్టుకొన్న వాఁడుగాను, బ్రహ్మనిష్ఠుఁడుగాను నుండువానిని, కర్మములు బంధింపవు.

తస్మాదజ్ఞాన సమ్భూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః।
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత! ॥ ౪౨॥

ఓ యర్జునుఁడా! సంశయచిత్తము గలవాఁడధోగతిపాలగును ఆ హేతువువలన, నీ యొక్క హృదయమున నున్నదియు, అవివేకము వలనఁ బుట్టినదియునగు నీ సంశయమును జ్ఞానమనెడు కత్తిచేత ఛేదించి, జ్ఞానయోగ సాధనమైన కర్మయోగమును ఆచరింపుము. ప్రకృతము యుద్ధమునకు లెమ్ము.

ఇట్లు,
జ్ఞానవిభాగయోగమను
నాల్గవయధ్యాయము ముగిసినది.

శ్రీరస్తు.

# అయిదవ అధ్యాయము.

## కర్మసన్న్యాస యోగము.

అర్జున ఉవాచ—అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు.

సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగంచ శంససి।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥ ౧॥

ఓ శ్రీకృష్ణస్వామీ! కర్మములయొక్క పరిత్యాగమును, మరల కర్మయోగమును, చెప్పుచున్నావు. ఈ రెంటిలో నేది మేలైనదో నీచే తెల్లగా నిశ్చయింపఁబడిన యర్థము యొక్క, దానిని నాకుఁ జెప్పుము.
శ్రీభగవానువాచ — శ్రీకృష్ణమూర్తి ప్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు.

సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ।
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే॥ ౨॥

జ్ఞానియైనవాఁడు చేయుచుండెడి కర్మపరిత్యాగంబును, కుటుంబజ్ఞాని యీశ్వరార్పణబుద్ధిగాఁ జేయుచుండెడి కర్మానుష్ఠానంబును, ఇవి రెం

డును శ్రేష్ఠములే వానిలో జ్ఞానము లేకయుఁ గర్మపరిత్యాగమును జే
యుటకన్న సంసారముందుండువానికి ఫలాపేక్షారహితముగా నీశ్వరా
ర్పణబుద్ధితోఁ జేయఁబడు కర్మయోగమే శ్రేష్ఠమనుచున్నది.

జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో! సుఖమ్బన్ధాత్ప్రముచ్యతే॥ 3॥

ఓ యర్జునుఁడా! ఏ కర్మయోగి ద్వేషము లేనివాఁడో, కోరిక లేని
వాఁడో ద్వంద్వము లేనివాఁడో, అట్టివాఁడు నెల్లప్పుడును గర్మపరి
త్యాగియనియే తెలియఁబడఁదగినవాఁడు. వాఁడు ననాయాసముగా

కర్మబంధమునుండి విడువఁబడుచున్నాఁడు.

సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి నపణ్డితాః।
ఏకమప్యాస్థితస్సమ్య గుభయోర్విన్దతే ఫలమ్॥ ౪॥

జ్ఞాన కర్మయోగములను వేరువేరు ఫలములు కలవని యవివేకులు చెప్పుచున్నారు. వివేకులు అట్లు చెప్పరు. రెండింటిలో నొకదానినైనను లెస్సగా ననుష్ఠించువాఁడు రెండింటియొక్క ఫలమగు మోక్షమును పొందుచున్నాఁడు.

యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి ॥ ౫॥

జ్ఞాననిష్ఠులైన సన్న్యాసులచే నేస్థానము పొందఁబడుచున్నదో, ఆస్థానము కర్మయోగులచేతను పరంపరాక్రమమున నే పొందఁబడఁచున్నది. జ్ఞానమును కర్మయోగమును, నొక్క ఫలముగల వానినిగా నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో, వాఁడే పరమార్థమును తెలిసినవాఁడు.

సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖమాప్తుమయోగతః।
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి ॥ ౬॥

ఓ యర్జునుఁడా! పరమార్థ జ్ఞానముతోఁ గూడిన సన్న్యాసము కర్మయోగి కాకుండఁ బొందుటకు శక్యముకానిది. కర్మయోగము నాచరించు ధ్యానాభ్యాసి పరమార్థ సన్న్యాసమును, శీఘ్రముగాఁ బొందుచున్నాఁడు.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ ౭

నిష్కాముఁడు కర్మయోగము నాచరించువాఁడును, పరిశుద్ధమైన మనస్సుగలవాఁడును, స్వాధీనమైన దేహముగలవాఁడును, ఇంద్రియనిగ్ర

హము గలవాఁడును, సమస్త భూతములయందుండు నాత్మయు తన యందుండు నాత్మయు నొకటేయని తెలిసికొనినవాఁడును, కర్మమును జేయుచున్నను కర్మబంధముచే నంటఁబడఁడు.

నైవకించిత్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్‌శృణ్వన్‌స్పృశన్‌జిఘ్రన్నశ్నన్‌గచ్ఛన్‌స్వపన్‌శ్వసన్ ॥
ప్రలపన్‌విసృజన్‌గృహ్ణ న్నున్మిషన్నిమిషన్నపి ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్తఇతిధారయన్ ॥ ౯

నిష్కామ కర్మయోగి తత్త్వమును దెలిసినవాఁడై చూచుచున్నను వినుచున్నను స్పృశించుచున్నను యాఘ్రాణించుచున్నను భుజించుచున్నను నడుచుచున్నను నిద్రించుచున్నను ఊపిరి విడుచుచున్నను పలుకుచున్నను మలమూత్రములను విడుచుచున్నను ఆహారాదుల గ్రహించుచున్నను కన్నులఁదెఱచుచు, మూయుచున్నను, ఇంద్రియములు శబ్దాదివిషయములయందు ప్రవర్తించుచున్నవని నిశ్చయించినవాఁడగుచు నించుకయైనను నేను జేయలేదని తలంపవలెను.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గంత్యక్త్వా కరోతి యః।
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివామ్భసా ॥ ౧౦॥

ఎవ్వఁడు కర్మములను పరమాత్మయందు సమర్పించి ఫలాశను విడిచి చేయుచున్నాఁడో, వాఁడు నీటిచే తామరపాకువలెనే పాప పుణ్యముచే నంటఁబడఁడు.

కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గంత్యక్త్వాత్మశుద్ధయే ॥ ౧౧॥

నిష్కామ కర్మయోగులు ఫలాపేక్షను విడిచి చిత్తశుద్ధికొఱకు శరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను, అభిమానములేని యింద్రియములచేతను, కర్మమును చేయుచున్నారు.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలేసక్తో నిబధ్యతే॥ ౧౨

నిష్కామకర్మయోగి కర్మమునందు ఫలాపేక్షను విడిచి ఆత్మనిష్ఠచేఁ గలుగు నాత్మానుభవ సుఖమును పొందుచున్నాఁడు. ఫలాపేక్షతో కర్మాచరణము చేయువాఁడు ఆశయొక్క ప్రేరణచేత ఫలమందు నాశ

కలవాఁడై కర్మబంధముచే కట్టుబడుచున్నాఁడు.

> సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।
> నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ॥ ౧౩ ॥

ఇంద్రియనిగ్రహము గలవాఁడు వివేకము గల మనస్సుచేతఁ దొమ్మిది ద్వారములుగల పట్టణము వంటి శరీరమందు సమస్తకర్మములను విడిచిపెట్టి చేయకున్నవాఁడును, చేయించకున్నవాఁడునై యానందము కలుగునట్లుగా నున్నాఁడు.

నకర్తృత్వం నకర్మాణి లోకస్యసృజతి ప్రభుః।
నకర్మఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥ ౧౪॥
ఆత్మ (దేహి) ఈ లోకమునకు కర్తృత్వమును, కర్మములను, ఆ యాకర్మములచేఁ గలుగు ఫలములయందు సంబంధమును, కలుగజేయఁడు. ప్రకృతియే కలుగఁ జేయుచున్నది.

నాదత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం విభుః।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేనముహ్యన్తి జన్తవః॥ ౧౫॥
ఆత్మ, యెవ్వనియొక్కయుఁ బాపమును పుణ్యమునుగూడ స్వీకరిం

పడదు. అవివేకముచేత వివేకము కప్పఁబడియున్నది. అందుచేత నవివేకులైన మనుష్యులు మోహమును జెందుచున్నారు.

జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః।
తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥ ౧౬॥

బ్రహ్మజ్ఞానముచే నెవ్వరియొక్క యజ్ఞానము నాశమును బొందింపఁబడినదో, వారిజ్ఞానము సూర్యప్రకాశమువలె బ్రహ్మస్వరూపమును ప్రకాశింపఁజేయును.

తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః ।
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ ౧౭ ॥

నిశ్చయమైన బ్రహ్మజ్ఞానము గలవారును, నేనే బ్రహ్మమను నిశ్చయముగలవారును, బ్రహ్మనిష్ఠగలవారునగు స్వానుభవశాలులు, జ్ఞానముచేఁబోఁగొట్టఁబడిన పాపము కలవారగుచు మఱల సంసారమునకు రానియట్టి స్థానమగు మోక్షమును పొందుచున్నారు.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥ ౧౮

పాండిత్యమును,ఉపశమమునుగల బ్రాహ్మణునియందును,గోవునం దును, ఏనుఁగనందును, కుక్కయందును, కుక్కను వండుకొని తిను చండాలునియందును, బ్రహ్మమును సమముగాఁజూచువారు జ్ఞానులు.

ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥౧౯॥

ఎవ్వరియొక్క మనస్సు బ్రహ్మ మొదలు స్తంబమువఱకు సమమను విషయమందు స్థిరముగానుండునో వారిచేత నీ శరీరముతో నుండు నపుడే జననమరణరూప సంసారము జయింపఁబడినది. ఆత్మ సమ

స్త పాపపుణ్య రహితమైనదియు సమముగా నుండునదియుంగదా? కాంబట్టి యాత్మయందు వారు నిష్ఠనుబొంది ఉన్న వారు.

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్యచాప్రియమ్।
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః॥ ౨౦॥

బ్రహ్మమందు నిశ్చలబుద్ధి గలవాండును, బొత్తిగా మోహము లేనివాండును, సమాధి గలవాండునగు బ్రహ్మజ్ఞాని ఇష్టమైనదానిని బొందిన సంతోషంబును, అయిష్టమైనదానిని బొందిన వ్యసనమును జెందండు.

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయ్యమశ్నుతే॥ ౨౧ ॥

శబ్దాది విషయములయందు ఆశలేనిమనస్సుగలవాఁడు తనయంతఃకరణమందు ఉపశమమనెడు నేసుఖమును బొందునో, అట్టిబ్రహ్మసమాధి యందైక్యమును బొందినవాఁడు నాశరహితమైన చిత్తోపరతిని పొందుచున్నాఁడు.

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః ॥　　౨౨ ॥

ఓ యర్జునుఁడా! విషయములయం దింద్రియములు ప్రవర్తించు టవలనఁగలుగు సుఖము లేవికలవో, అవి దుఃఖహేతువులే యగుచున్నవి. ఏలయనఁగా నవి ఆరంభమును, సమాప్తియునుగలవి. కాఁబట్టి వానియందు వాస్తవము నెఱిఁగిన వివేకి ప్రీతిఁజేయఁడు.

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ శరీర విమోక్షణాత్ ।
కామ క్రోధోద్భవం వేగం సయుక్తస్స సుఖీ నరః ॥ ౨౩॥

ఆశవలనను, కోపమువలనను బుట్టిన మనశ్చాంచల్యము నిచ్చటనే శరీరమును విడుచుటకుముందే సహించుట కేమనుష్యుఁడు సమర్థుఁడ

గుచున్నాఁడో, వాఁడు మనస్సమాధానము (చిత్తోపరమము) గల
వాఁడును యాత్మానుభవము గలవాఁడు నగుచున్నాఁడు.

యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ యః ।
సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ ౨౪॥

తనయందే సుఖించువాఁడును, తనయందే క్రీడించువాఁడును తన
యందే ప్రకాశించుచుండువాఁడు నెవ్వఁడో అట్టి జీవన్ముక్తుఁడగు నా
బ్రహ్మనిష్ఠుఁడు సాయుజ్యమును పొందుచున్నాఁడు.

లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణ కల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూత హితే రతాః ॥ ౨౫ ॥

నశించిన పుణ్యపాపములు కలవారును, పోయిన సంశయమును, అజ్ఞానమును గలవారును, మనస్సు మొదలగు నింద్రియములను స్వాధీనము చేసికొనినవారును, సమస్తప్రాణులయొక్క మేలును గోరిన వారునగు సన్న్యాసులు సాయుజ్యమును పొందుచున్నారు.

కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥ ౨౬ ॥

ఆశ కోపము మొదలగువానిచే విడువఁబడినవారును, మనోనిగ్రహము కలవారును ఆత్మతత్త్వమును దెలిసినవారునునగు సమస్త కర్మములను పరిత్యాగము చేసిన బ్రహ్మనిష్ఠులకు, సాయుజ్యము శరీరముతో నుండునపుడును, శరీరపతనాంతరమును ఉన్నది.

స్పర్శాన్ కృత్వాబహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాన్తరేభ్రువోః ।
ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యన్తరచారిణౌ ॥ ౨౭ ।
యతేన్ద్రియమనోబుద్ధి ర్మునిర్మోక్ష పరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః ॥ ౨౮ ।

బహిర్భవములైన శబ్దాది విషయములను వెలుపలఁద్రోసి, చూపును కనుబొమల నడుమనే నిలిపి ముక్కులలోపలనే సంచరించునట్టి ప్రాణాపానవాయువులను సమములుగాను జేసి స్వాధీనపఱచుకొనఁబడిన యింద్రియములు, మనస్సు, బుద్ధి వీనిని గలవాఁడును, పోగొట్టఁబడిన, ఆశ, భయము, కోపము మొదలగువానిని గలవాఁడును, మోక్షమే సద్గతియని తలంచుచుండు వాఁడునునగు మననశీలుఁడెవఁడో. వాఁడు శరీరముతోనుండినను ముక్తుఁడే.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి॥

యజ్ఞము తపస్సు వీనిఫలములకుఁ గర్తగాను దేవతగానుండి భుజించెడి భోక్తయును, సమస్తప్రాణులకు నుపకారిగానుండు నన్ను స్వానుభవరూప సమాధిచేఁ దెలిసికొని మోక్షమును బ్రహ్మనిష్ఠుఁడు పొందుచున్నాఁడు.

ఇట్లు, కర్మసన్న్యాస యోగమను నయిదవ
యధ్యాయము ముగిసెను.

శ్రీరస్తు.

# ఆఱవ అధ్యాయము.



## ఆత్మసంయమ యోగము.

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణమూర్తి యుపదేశించుచున్నాఁడు.

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సన్న్యాసీచ యోగీచ ననిరగ్నిర్నచాక్రియః॥ ౧

ఏగృహస్థు చేయవలసినకర్మమును, కర్మఫలము నపేక్షింపనివాఁడై చేయుచున్నాఁడో, వాఁడే సన్న్యాసియును నిష్కామ కర్మయోగి యనని కొనియాడఁబడుచున్నాఁడు. అగ్నిహోత్రాది కర్మములను విడిచిన గృహస్థు సన్న్యాసితోను యోగితోను తుల్యుఁడు కాఁడు.

యం సన్న్యాసమితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ!।
నహ్యసన్న్యస్త సఙ్కల్పో యోగీ భవతి కశ్చన ॥ ౨॥

ఓ యర్జునుఁడా! జ్ఞాననిష్ఠులు దేనిని కర్మ పరిత్యాగమని చెప్పుచున్నారో, దానిని నిష్కామకర్మయోగమని తెలిసికొనుము. ఏకార

ణము వలన ననిన విడువఁబడని సకలఫలాపేక్షనుగల ఎవ్వఁడును నిష్కామ కర్మయోగి కానేరఁడు.

ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణ ముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥ 3 ॥

ధ్యానయోగాభ్యాస దశను పొందఁగోరెడు యోగికి నిష్కామకర్మము సాధనమని చెప్పఁబడుచున్నది. ధ్యాన యోగాభ్యాస దశనుబొందిన యామునికే సర్వకర్మనివృత్తి సాధనమని చెప్పఁబడుచున్నది.

యదా హి నేన్ద్రియార్థేషు నకర్మ స్వనుషజ్జతే।
సర్వసఙ్కల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే ॥ ౪॥

ఎప్పుడు శబ్దాది విషయములయందును, కర్మములయందును, ఆసక్తినుంచఁడో, అప్పుడు సమస్త యపేక్షలను విడిచినవాఁ డనియు, యోగాభ్యాస సిద్ధిని బొందినవాఁడనియుఁ జెప్పఁబడుచున్నాఁడు.

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః ॥ ౫॥

విషయములయం దాసక్తిలేని పరిశుద్ధ మనస్సుచేత సంసార

సాగరమందు మున్గఁడైన తన్ను గట్టునఁ జేర్చుకొనవలసినది. తన్ను యధోగతిని బొందించుకొనఁగూడదు. ఏలయనఁగా తనకు వశీకృతమైన తనమనస్సే ఆప్తుఁడు, తనకు విషయములలోఁ బ్రవేశించునట్టి వశీకృతముగాని తనమనస్సే శత్రువు.

బన్ధురాత్మాఽత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥ ౬.

ఎవ్వనిచేత తన దేహేంద్రియాది సంఘాతములతోఁ గూడుకొనిన మనస్సు జయింపఁబడినదో, అట్టివానియొక్క మనస్సు తనకు బం

ధువు. మనోజయము లేనివానికి తన యపరిశుద్ధమనస్సు శత్రు
వలె నపకారమందే ప్రవర్తించుచుండును.

జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥ ౭ ॥

జయింపఁబడిన మనస్సుకలవాఁడును కామక్రోధాదులను వద
లినవాఁడునగు వానియొక్క శుద్ధ మనస్సు శీతోష్ణ సుఖ దుఃఖాది
ద్వంద్వములయందును, అట్లే పూజా పరిభవములయందును, ఉండ
దు. అధికముగా ధ్యానాభ్యాస మందే యుండును.

జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః॥ ౮॥

జ్ఞానము చేతను, విజ్ఞానము చేతను, తృప్తిపొందిన మనస్సుగలవాఁడును, మనోవికార రహితుఁడును, ఇంద్రియనిగ్రహముగలవాఁడును, మంటిబెడ్డ, ఱాయి, బంగారము వీనిని సమముగాఁదలంచువాఁడునగు జ్ఞాని, ఆత్మానుభవముగలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు.

సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబన్ధుషు।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥ ౯॥

సుహృత్తులు, మిత్రులు, శత్రువులు, ఉదాసీనులు, మధ్యస్థులు, ద్వేష్యులు,బంధువులు, అను వీరి యందఱియందును,సత్పురుషులయం దును, సమమైన బుద్ధిగలవాఁడు శ్రేష్ఠుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥ ౧౦॥

మనస్సును దేహమును ఇంద్రియమును స్వాధీనపఱచుకొన్నవాఁ డును, ఆశలేనివాఁడును, తనకుఁగావలసినదని యొకవస్తువు నుంచు కొననివాఁడునగు యోగి, ఒంటరిగా యేకాంతస్థలములయం దున్న

వాఁడై మనస్సు నెల్లప్పుడును నిశ్చలము చేయవలసినది.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్॥ ౧౧॥
తత్రైకాగ్రం మనఃకృత్వా యతచిత్తేన్ద్రియక్రియః।
ఉపవిశ్యా సనే యుఞ్జ్యా ద్యోగమాత్మ విశుద్ధయే॥ ౧౨॥

పరిశుద్ధమైనస్థలంబున మిక్కిలి యెత్తుగా నుండనిదియు, మిక్కిలి పొట్టిగా నుండనిదియు, దర్భలు, పైన కృష్ణాజినము లేక పులిచర్మము ఆపైన వస్త్రముగలిగినదియు, తఱచుగా మార్పనిదియునగు నాస్తరణ

ము నుతన నిమిత్తము వేసికొని యాస్థిరాసనమందుఁ గూర్చుండి మన స్సును నిశ్చలముగాఁ జేసి మనస్సు యొక్కయు నింద్రియములయొక్కయు వ్యాపారములు లేని వాఁడగుచు మనశ్శుద్ధికొఱకు బ్రహ్మధ్యానము నభ్యసింపవలెను.

సమం కాయ శిరో గ్రీవం ధారయ న్నచలం స్థిరః।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చా నవలోకయన్॥ ౧౩॥
ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారి వ్రతే స్థితః।
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥ ౧౪॥

ధ్యానాభ్యాసి శరీరశిరఃకంఠములను గదలకుండ సమముగానిలుపుకొనుచుఁ జిరకాలమట్లు కదలకున్నవాఁడై దిక్కులనుఁగూడ చూడక, తనదగు కనుబొమల మధ్యస్థానమును చూచుచున్నట్లుండుచు మనస్సును విషయములలోఁ బ్రవేశింపకుండఁ ద్రిప్పి విషయములనుండి యుపరతమైన యంతఃకరణము కలవాఁడై, భయములులేనివాఁడై, బ్రహ్మచారివ్రతమందున్నవాఁడై నాయందె చిత్తమును నిలిపినవాఁడై నన్నే ధ్యానముచేయువాఁడునై యుండవలసినది.

యుఞ్జన్నేవం సదాత్మానం గీ నియతమానసః।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి॥ ౧౫॥

విషయములలోనుండి త్రిప్పఁబడిన మనస్సుగల ధ్యానాభ్యాసి యెల్లప్పుడు నీవిధముగా మనస్సునునిలిపినవాఁడై మోక్షము నే పర్యవసానముగాఁగలదియు, నాస్వరూపముగా నుండుటయనునదియునగు నుపరతిని పొందుచున్నాఁడు.

నాత్యశ్నతస్తు గోఽస్తి నచైకాన్త మనశ్నతః।
నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున! ॥ ౧౬॥

ఓ అర్జునుఁడా! ధ్యానయోగము అపరిమితముగా భుజించువాని కిని, బొత్తిగా భుజింపనివానికిని, మిక్కిలి నిద్రపోవు స్వభావముకలవాని కిని, నిద్రయే లేక మేలుకొనియుండువానికిని, కలుగనే కలుగదు.

యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు।
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥ ౧౭॥

మితమైనయాహారంబును, సంచారంబునుగలవాఁడును, కర్మముల యందు మితమైన వ్యాపారముగలవాఁడును, మితమైన నిద్రయును, మెలఁకువయునుగలవాఁడునగు ధ్యానాభ్యాసికి సంసార[illegible]

మరణ దుఃఖమును బోఁగొట్టునట్టి ధ్యానయోగము సిద్ధించుచున్నది.

యదా వినియతం చిత్త మాత్మన్యే వావతిష్ఠతే ।
నిస్పృహః సర్వ కామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥౧౮॥

ఎప్పుడు మనస్సు లెస్సగా నిగ్రహింపఁబడినదై నాత్మస్వరూపము నందే నిలుచుచున్నదో, ఎప్పుడు (యోగాభ్యాసి) సమస్తవిషయముల వలనఁగలుగు నాశలలోనుండి విడువఁబడునో, అప్పుడు ధ్యానాభ్యాసమున కర్హుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః॥

ఆత్మధ్యానము నభ్యసించుచున్న వాఁడును, స్వాధీనమైనమనస్సు గలవాఁడునగు సమాధినిష్ఠునియొక్క మనోనిశ్చలతకు, గాలిలేనిచోట నున్న దీపముగదలనట్లు గదలదని దృష్టాంతముగా, యోగానుభవము గలవారిచేతఁ జెప్పఁబడినది.

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్రచైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥ ౨౦॥

సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః॥ ౨౧॥
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే॥ ౨౨॥
తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥ ౨౩॥

యోగాభ్యాసముచేత విషయములలోనుండి త్రిప్పఁబడిన మనస్సు యే ధ్యానాభ్యాసకాలమందేకాగ్రము గానిలుచునో, ఏ ధ్యానా

ధ్యానమందుండువాఁడు సమాధిశుద్ధమైన మనస్సుచేతఁ బరంజ్యోతి
స్స్వరూపమైన యాత్మను సాక్షాత్కరించి అనుభవించుచున్నవాఁడై
తనలోనే యానందమును బొందునో, ఏ ధ్యానయోగమందు స్థిరము
గానున్న యీధ్యానయోగి, ఏది ఇంద్రియములకు గోచరము గానట్టి
యు, బుద్ధిచే గ్రహింపఁబడఁదగనిదియు, అంతములేనిదియునగు నా
సుఖమును ఎఱుఁగుచున్నాఁడో (అనుభవించుచున్నాఁడో) మఱి
యు స్వానుభవమునుండి బొత్తిగామఱలఁడో, ఏ స్వానుభవమును
పొందినపిమ్మట దానికంటెనితరమైనలాభమును నధికమైన దానిఁగాఁ

దలంపఁడో, ఏధ్యానమందున్నవాఁడై విశేషమైన దుఃఖముచేఁగూడ కదల్పఁబడఁడో, సమస్తదుఃఖములతో సంబంధముగల విషయవృత్తిని బోఁగొట్టునటువంటి దానిని ధ్యానమను పేరుగలదిగాఁ దెలిసికొనవలయును. యోగాభ్యాసమందెంతకష్టములున్నను వానిచేత దుఃఖపడని మనస్సుగలవానిచే నటువంటి ధ్యానయోగసిద్ధిని బొందవలెనను పట్టుదలతోఁ బొందఁదగినది.

సఙ్కల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః

శనైః శ్శనైః రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా।
ఆత్మసంస్థం మనఃకృత్వా నకించిదపి చిన్తయేత్॥ ౨౫॥

సంకల్పమువలనఁ గలుగు సమస్తమైన విషయాశలను నిశ్శేషముగా విడిచి, వివేకముగల మనస్సుచేతనే సమస్తేంద్రియముల విషయములలోనుండి త్రిప్పి, ధైర్యముచే స్వాధీనముచేసికొనఁబడిన బుద్ధిచేత మనస్సును స్వానుభవమందుండునట్లుఁ జేసి, మెల్లమెల్లగా మనస్సును విషయములనుండి మరలింపవలసినది; ఆత్మవ్యతిరిక్తమైన యేవస్తువును తలంపఁగూడదు.

యతో యతో నిశ్చరతి మన శ్చఞ్చల మస్థిరమ్।
తత స్తతో నియమ్యైత దాత్మ న్యేవ వశంనయేత్॥ ౨౬॥

చలన స్వభావముగలది గనుక నిలుకడగా నుండనిదియగు మనస్సు ఏయే విషయములయందుఁ బ్రవర్తించుటకై బయలువెడలుచున్నదో ఆయా విషయములలోనుండి మనస్సును త్రిప్పి, ఆత్మయందే నిలుచు లాగునఁ జేయవలసినది.

ప్రశాన్త మనసం ్యనం గినం సుఖ ముత్తమమ్।
ఉపైతి శాన్త రజసం బ్రహ్మభూత మకల్మషమ్॥ ౨౭॥

శాన్తమనస్సుగలవాఁడును, రజోగుణవికారములు లేనివాఁడును, జీవన్ముక్తుఁడును పాపరహితుఁడునగు నిటువంటి ధ్యానయోగిని శ్రేష్ఠమైన మోక్షము, తానే పొందుచున్నదియనుట వేదప్రసిద్ధముగా నున్నది.

యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ విగత కల్మషః।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖ మశ్నుతే॥ ౨౮॥

ఈవిధముగా నెల్లప్పుడును మనస్సును స్వానుభవమందు నిలిపినవాఁడై పుణ్యపాపరహితుఁడైన ధ్యానయోగి సులభముగా బ్రహ్మసాక్షాత్కారరూపమగు పరమానంద సుఖమును పొందుచున్నాఁడు.

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ ౨౯॥

సమస్తవస్తువులయందు బ్రహ్మమును సమముగాఁ జూచువాఁడు
ను, ధ్యానయోగమం దేకాగ్రమైన మనస్సుగలవాఁడునగు యోగి,
తన్ను సమస్తభూతములయం దుండువానిఁగాను, తనయందు సమస్త
భూతములు నుండునవిగాను, చూచుచున్నాఁడు.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి॥ 30॥

ఎవ్వఁడు సమస్త వస్తువులయందును నన్ను చూచుచున్నాఁడో, సమస్తవస్తువులను నాయందు చూచుచున్నాడో, వానికి నేను కనఁబడకపోను. వాఁడును నాకు కనఁబడకపోఁడు.

సర్వభూత స్థితం యోమాం భజత్యేకత్వ మాస్థితః।
సర్వథావర్తమానోఽపి సయోగీ మయివర్తతే॥ ౩౧॥

సమస్తభూతములయందున్న నన్ను నభేదజ్ఞానమును బొందినవాఁడగుచు నెవ్వఁడు ధ్యానము చేయుచున్నాఁడో, ఆ ధ్యానయోగి సమాధియందున్నప్పుడును లేనప్పుడును నాయందే వర్తించువాఁడగుచున్నాఁడు.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ ౩౨॥

ఓ యర్జునుఁడా ! సమస్త ప్రాణులయందును సుఖమునుగాని దుః
ఖమునుగాని తనవానిపోలికను సమముగా నెవ్వఁడు చూచుచున్నాఁ
డో, ఆ ధ్యానయోగి శ్రేష్ఠుఁడని నానిశ్చయము.

అర్జున ఉవాచ—అర్జునుఁడు ప్రశ్నచేయుచున్నాఁడు.

యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన'
ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్॥ ౩౩॥

ఓ శ్రీకృష్ణా! మనోనిశ్చలతచేత సిద్ధింపఁదగిన యేయీధ్యానయోగము నీచేతఁ జెప్పఁబడినదో, ఈ యోగముయొక్క చలింపని నిలుకడను, మనస్సు చంచలముగుటవలన నేను కానకున్నాను.

చఞ్చలం హి మనఃకృష్ణ ! ప్రమాథి బలవద్దృఢమ్ ।
తస్యాహం నిగ్రహంమన్యే వాయోరివసుదుష్కరమ్॥ ３౪॥

ఓ శ్రీకృష్ణా! మనస్సు మిగులఁజంచలస్వభావముగలదియు, దేహేంద్రియాదులను క్షోభపెట్టి పరవశతను బొందించునట్టిదియు, నిగ్రహించుట కశక్యమైనదియు, విషయములయందు గట్టిపట్టుఁదలగలిగి ప్రవ

ర్తించునదియునుగా నున్నదికదా? అట్టిమనస్సుయొక్క నిరోధము ను, వాయువును సంచరింపకుండఁ గుండ మొదలగువానిలోనుంచి కట్టి పెట్టినట్లు మిక్కిలి యసాధ్యమైనదానిఁగా నేను తలంచుచున్నాను.

శ్రీభగవానువాచ — శ్రీకృష్ణస్వామి సమాధానము చెప్పుచున్నాఁడు.

అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్।
అభ్యాసేనతు కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే। ౩౫॥

గొప్పభుజబలముగల ఓ యర్జునుఁడా! మనస్సు నిగ్రహించుట క సాధ్యమైనదనియు, చంచల స్వభావముగలదనియు, చెప్పుటలో సం

దేహము లేదు; అయినను అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను, అరికట్టఁబడుచున్నది.

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః॥ ౩౬॥

స్వాధీనపఱచుకొనఁబడని మనస్సుకలవానిచేత ధ్యానయోగము పొందఁబడుట కసాధ్యమయినదని నాయొక్క నిశ్చయము. మఱి యెట్లనిన స్వాధీనమైన మనస్సుగల, విడువని ప్రయత్నమును జేయువానిచేత ఉపాయములవలనఁ బొందుటకు సాధ్యమైనది.

అర్జున ఉవాచ — అర్జునుఁడు మఱల ప్రశ్న చేయుచున్నాఁడు.

అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలిత మానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం కాంగతిం కృష్ణ! గచ్ఛతి?॥ ౩౭॥

ఓ శ్రీకృష్ణస్వామీ! శ్రద్ధతో ధ్యానాభ్యాసము చేయుటకు ప్రారంభించినవాఁడును, పట్టుదల లేనివాఁడును ధ్యానయోగమునుండి జాఱిన మనస్సుగలవాఁడు నగు పురుషుఁడు, ధ్యానయోగసిద్ధినిఁ బొందక యే గతినిబొందును?

కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణఃపథి॥ ౩౮॥

ఓ శ్రీకృష్ణమూర్తీ! నిష్కామకర్మ, యోగమార్గములనుండి జాఱిన వాఁడును, పరమాత్మయొక్కమార్గమందు జ్ఞానము లేనివాఁడును, నిరాధారుఁడగుచు చెదరిన మేఘమువలె క్రమముగా నశించి చెడి పోఁడా యేమి?

ఏతం మే సంశయం కృష్ణ! ఛేత్తుమర్హస్యశేషతః।
త్వదన్యస్సంశయస్యాస్య ఛేత్తా నహ్యుపపద్యతే॥ ౩౯॥

ఓ శ్రీకృష్ణస్వామీ ! నాయొక్క యీసందేహమును సంపూర్తిగాఁ బోఁగొట్టుటకుఁ దగుదువు. ఈసందేహమును నివర్తింపఁ జేయువాఁడు నీకంటె నితరుఁడు బొత్తిగాఁ దటస్థింపఁడు కదా?

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణమూర్తి సమాధానము చెప్పుచున్నాఁడు.

పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే।
నహి కల్యాణ కృత్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి॥ ౪౦॥

ఓ యర్జునుడా! యోగభ్రష్టుని కీలోకమందు నికృష్టజన్మప్రాప్తి కలుగనేరదు. పరలోకమందును హీనగతి కలుగఁబోదు. చిన్నవాఁ

గా! మంచిపనిని జేయువాఁడెవ్వఁడును చెడుగతిని పొందఁడుగదా?

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వాశాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥ ౪౧॥

ధ్యానాభ్యాసమునుండి జాఱినవాఁడు పుణ్యము చేసినవారియొక్క లోకములను పొంది, అనేకకాల మచ్చటనుండి, సదాచారవంతులైన ఐశ్వర్యవంతులయొక్క గృహమందు పుట్టుచున్నాఁడు.

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥ ౪౨

లేక, జ్ఞానవంతులగు దరిద్రులైన ధ్యానాభ్యాసముఁ జేయువార లయొక్క వంశమందే పుట్టుచున్నాఁడు. భూలోకమునందిట్టిఁ బు ట్టుక యేదికలదో, అదియే మిక్కిలి దుర్లభమైనది.

తత్రతం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్ ।
యతతే చ తతోభూయః స్సంసిద్ధౌ కురునన్దన ! ॥ ౪౩॥

ఓ యర్జునుఁడా ! అచ్చట పూర్వదేహ సంబంధమైనదగు నాత్మ విషయకమైన జ్ఞానసంబంధమును పొందుచున్నాఁడు. అందువలన

ధ్యాన యోగముయొక్క సిద్ధి నిమిత్తమై విశేషముగాఁ బ్రయత్నముఁ జేయుచుండును.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః।
జిజ్ఞాసురపి యోగస్య శబ్ద బ్రహ్మాతి వర్తతే॥ ౪౪॥

వాఁడు తానుగాఁ బ్రయత్నింపకపోయినను ఆపూర్వజన్మాభ్యాసముచేతనే బలాత్కారముగా ధ్యానాభ్యాసము చేయుటకు నాకర్షింపఁబడుచున్నాఁడు. ధ్యానయోగము నభ్యసించుటకుఁ దలంపుగలవాఁడైనంతనె వేదోక్తకర్మానుష్ఠానఫలముల నతిక్రమించుచున్నాఁడుగదా?

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః।
అనేకజన్మ సంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్॥ ౪౫॥

ధ్యానాభ్యాసి పట్టుదలతో యత్నము చేయుచున్నవాఁడై పిమ్మట పాపములనుండి విడువఁబడిన పరిశుద్ధుఁడై యనేక జన్మములయందుఁ జేయఁబడిన యభ్యాసవిశేషము చేత బ్రహ్మజ్ఞానముకలవాఁడై, ఆపిదప నుత్తమైన మోక్షమును పొందుచున్నాఁడు.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపిమతోఽధికః।
కర్మభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున!॥ ౪౬॥

ధ్యానయోగి, వ్రతములు మొదలైన తపస్సులు చేయువారలకం
టెను, శాస్త్రజ్ఞానముమాత్రము గలవారలకంటెను, అగ్నిహోత్రాది
కర్మములను జేయువారలకంటెను శ్రేష్ఠుడని దలంపఁబడుచున్నాఁడు.
ఆ హేతువువలన ఓ యర్జునుఁడా! నీవు ధ్యానాభ్యాసము గలవాఁడ
వగుము.

యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥ ౪౭॥

యోగులంచటిలోపల నెవ్వఁడు నాయందు నిలుపఁబడిన మన

నుచేత భక్తికలవాఁడై ధ్యాననిష్ఠను ఏకాగ్రచిత్తుఁడై జేయుచున్నాఁడో, అట్టి యోగి, అతిశ్రేష్ఠుఁడని నాయభిప్రాయము.

ఇట్లు,

ఆత్మసంయమ యోగమను

నాఱవ యధ్యాము.

ముగిసినది.

---

శ్రీరస్తు.

# ఏడవ అధ్యాయము.

## జ్ఞానయోగము.

శ్రీభగవానువాచ — శ్రీకృష్ణమూర్తి మరల ఉపదేశించుచున్నాడు

మయ్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జన్మదాశ్రయః।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥ ౧

ఓ యర్జునుఁడా! నాయందాసక్తిగల మనస్సుగలవాఁడవుగను, యోగాభ్యాసము నాచరించుచున్నవాఁడవుగను, నన్నే శరణముగాఁ బొందినవాఁడవునై సంశయ విపర్యయములులేని జ్ఞానము కలుగునట్లుగ సమస్తగుణములతో నొప్పెడు నన్నే ప్రకారమున తెలిసికొనఁగలవో, ఆయుపాయమును జెప్పెద వినుము.

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః।
యజ్జ్ఞాత్వా నేహభూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే॥ ౨॥

దేనిని తెలిసికొనిన పిమ్మట నీ మోక్షమార్గమునఁ దిఱిగియు, మఱి

యొక్కయు పాయము దెలియవలసినదిగా మిగిలియుండదో, స్వానుభవ సాధనమగు నీజ్ఞానమును నిశ్శేషముగా నేను నీకొఱకుఁ జెప్పఁబోవుచున్నాను.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ 3॥

శాస్త్రపాండిత్యముగల మనుష్యులయొక్క వేలలో నొకానొకఁడు జ్ఞానసిద్ధికొఱకుఁ బ్రయత్నము చేయును. అట్లు ప్రయత్నము చేయుచున్న ధ్యానాభ్యాసులలో వేలలో నొకానొకఁడు

నన్ను వాస్తవముగా తెలిసికొనుచున్నాఁడు.

భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ।
అహఙ్కార ఇతీయంమే భిన్నా ప్రకృతి రష్టధా॥ ౪।

పృథివీ తన్మాత్ర గంధగుణమును, ఉదక తన్మాత్ర రసగుణమును, అగ్ని తన్మాత్ర రూపగుణమును, వాయు తన్మాత్ర స్పర్శగుణమును, ఆకాశ తన్మాత్ర శబ్దగుణమును, మనస్సునకుఁ గారణమైన యహంకార తత్త్వమును, మహత్తత్త్వమును, అవ్యక్తమును, అని యిట్లు నా యొక్క యీ ప్రకృతి యెనిమిదివిధములుగా భేదమును బొందినది.

అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమే పరామ్।
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్॥౫॥

ఓ యర్జునుఁడా! ఇది నికృష్టమైనది. ఈప్రకృతికంటె నితరమైనదియు,నీప్రపంచమును ధరించియుండునదియు,జీవస్వరూపమైనదియునగు నాయొక్క పరప్రకృతి నుత్కృష్టమైనదానింగాఁ దెలిసికొనుము.

ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా॥ ౬॥

సగుసమైన భూతములు నీ రెండువిధములుగ నుండు ప్రకృతిచేఁ

గలుగునవియని తెలిసికొనుము. ఆ ప్రకృతిద్వయ ద్వారా సకల ప్రపం
చమున కుత్పత్తి, నాశ కారణమునైన వాఁడను నేనే.

మత్తః పరతరం నాన్యత్ కిఞ్చిదస్తి ధనఞ్జయ! ।
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ ౭॥

ఓ యర్జునుఁడా! నాకంటె మిక్కిలి శ్రేష్ఠమగు నితరకారణమేది
యు లేదు. దారమునందు రత్నములు మొదలగు వస్తుసమూహములు
వలె నాయందీ సమస్తప్రపంచమును గ్రుచ్చఁబడినది.

రసోఽహమప్సు కౌన్తేయ! ప్రభాఽస్మి శశిసూర్యయోః।
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ ౮।

ఓ యర్జునుఁడా! నీళ్లయందు రుచియును, చంద్రసూర్యులయందు కాంతియును, సమస్తవేదములయందు నోంకారమును, ఆకాశమందు శబ్దమును, మనుష్యులయందుఁ బౌరుషస్వభావము నేనేయైయున్నా [ను.

పుణ్యో గన్ధః పృథివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు॥ ౯।

భూమియందు పరిమళించుచున్న గంధంబును, అగ్నియందు ప్రకా

శంబును, సమస్త ప్రాణులయందు జీవనాధారమైన యాయుస్సును, తపస్సుగలవారలయందు తపస్సును నేనే.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్।
బుద్ధిర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్॥ ౧౦॥

ఓ యర్జునుఁడా! నిత్యుఁడనైన నన్ను సమస్తభూతములకును విత్తనమునుగా నెఱుంగుము. బుద్ధిమంతులయొక్క బుద్ధియును ధీరులయొక్క మనోధైర్యమును, నేనే.

బలంబలవతాంచాహం కామ రాగవివర్జితమ్।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ!॥　　౧౧॥
ఓ యర్జునుఁడా! బలముగలవారలయొక్క నాశయు, విషముల యందలి యనురాగంబును లేని బలంబును, ప్రాణులయందు ధర్మమునకు విరుద్ధము గాని కామమును, నేనే.

యేచైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చయే।
మత్త ఏవేతితాన్ విద్ధి నత్వహం తేషు తే మయి॥　　౧౨॥
సత్త్వ రజ స్తమోగుణములచేఁ గలిగినవస్తువులేవియో నావస్తు

వులను నావలనఁ గలిగినవియే యని తెలిసికొనుము. వానియందు నే నున్ననో, లేను. నాయందవి యున్నవి.

త్రిభిర్గుణమయైర్భావై రేభి స్సర్వమిదం జగత్।
మోహితంనాభిజానాతి మామేభ్యః పర మవ్యయమ్॥ ౧౩॥

మూఁడువిధములైన గుణవికారములుగల యీవస్తువులచేత సమస్తమైన యీప్రపంచ మవివేకమును బొందింపఁబడినదై, యీత్రిగుణములకంటె విలక్షణునిగను, నాశరహితునిగను, నన్నెఱుంగఁజాలదు.

దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా।
మామేవయే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే॥ ౧౪॥

లోకోత్తర సామర్థ్యము కలదియు త్రిగుణాత్మకమైనదియు నగు నీ చెప్పఁబడిన నా యొక్క ప్రకృతి, దాఁట శక్యము కానిది. నన్నెవ్వరు శరణము నొందుదురో, వారీ ప్రకృతిని దాఁటుచున్నారుగదా?

నమాందుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః।
మాయయా పహృతజ్ఞానా ఆసురంభావ మాశ్రితాః॥ ౧౫॥

అవివేకులును పాపములను మనఃపూర్వకముగాఁ జేయువారును,

మాయచేత నపహరింపఁబడిన జ్ఞానముగలవారును, అసురస్వభావము నాశ్రయించినవారును, మనుష్యాధములును, నన్ను పొందరు.

చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున!।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ!॥ ౧౬॥

ఓ భరతకుల శ్రేష్ఠుడవైన యర్జునుఁడా! చోరుఁడు, వ్యాఘ్రము, వ్యాధి మొదలగువానిచేఁ బీడితుఁడైనవాఁడును, తత్త్వజ్ఞానమును పొందుట కిచ్ఛగలవాఁడును, సత్కార్యములను జేయు తలంపుతోఁ దత్సాధనమగు ధనమును గోరువాఁడును, బ్రహ్మజ్ఞానియును, అని నీ

నాలుగువిధములైనవారును పుణ్యశాలులునగు జనులు నన్ను భజించుచున్నారు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే।
ప్రియోహిజ్ఞానినోఽత్యర్థ మహంసచ మమప్రియః॥ ౧౭॥

వారలలో స్థిరమైన ధ్యానమును జేయువాఁడును, ఏకాగ్రచిత్తముగలవాఁడునగు బ్రహ్మజ్ఞాని శ్రేష్ఠుఁడనఁబడుచున్నాఁడు. నేనట్టి జ్ఞానికి మిక్కిలి ఇష్టుఁడను కదా? కాఁబట్టి వాఁడును నాకు మిక్కిలి ప్రియుఁడు.

ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్।
ఆస్థితస్సహియుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥ ౧౮॥
ఈ నలుగురును శ్రేష్ఠులే; స్వానుభవముగల జ్ఞానియో, నేనే యని నాయొక్క తాత్పర్యము. యే కారణమువలననిన వాఁడు నియమింపఁబడిన మనస్సుగలవాఁడై, నన్నే సర్వోత్తమమైన ప్రాప్యస్థానమునుగాఁ బొందినవాఁడై యున్నాఁడు.

బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥ ౧౯॥

ఎవ్వఁడు పెక్కుజన్మములకుఁ దుదను జ్ఞానసిద్ధిని బొందినవాఁడగుచు సమస్తమును వాసుదేవస్వరూపమని తలఁచి నన్ను సాక్షాత్కరించుచున్నాఁడో, అట్టి శుద్ధాంతఃకరణముగల మహానుభావుఁడు మిక్కిలి దుర్లభుఁడు.

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః।
తంతం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా॥ ౨౦॥

తమ తమయొక్క జన్మాంతరార్జిత సంస్కారముచే ప్రేరేపింపఁబడిన జనులు వేనివేనియందాశగలవారై యున్నారో, ఆయా యనే

కములైన కోరికలచేత నపహరింపఁబడిన వివేకముగలవారలై యా యా దేవతారాధనాది నియమము నవలంబించి యితరదేవతలను భజించుచున్నారు.

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥ ౨౧॥

ఏ యే కామములుగలవాఁడే యే దేవతా విగ్రహమును భక్తికలవాఁడగుచు విశ్వాసముతోఁ బూజించుటకొఱకుఁ గోరుచున్నాఁడో,

ఆ యా కామము గలవాని కా విశ్వాసము నే స్థిరమైనదానిఁగా నేను చేయుచున్నాను.

సతయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే।
లభతేచ తతః కామా న్మయైవ విహితా న్హితా న్॥ ౨౨॥

వాఁడట్లు నాచేత స్థిరపఱుపఁబడిన విశ్వాసముతోఁ గూడినవాఁడై యాదేవతా విగ్రహారాధనమును జేయుట కిచ్ఛించుచున్నాఁడు. నాచేతనే నిర్ణయింపఁబడిన యా యిష్టమైన కోరికల నాదేవతలనుండి పొందుచున్నాఁడు సుమీ.

అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్।
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి॥ ౨౩॥

దేవతలను బూజించువా రట్టిదేవతల లోకములను పొందుచున్నారు. బుద్ధిహీనులైన వారలయొక్క యా దేవతాపూజలచేఁ గలుగు లోకములయందలి సుఖము నాశముగలదిగా నగుచున్నది. నాభక్తులా, నన్ను పొందుచున్నారు.

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః।
పరంభావ మజానన్తో మమావ్యయ మనుత్తమమ్॥ ౨౪॥

నాశరహితమైనట్టిదియు, సర్వోత్తమమైనదియు, ప్రపంచవిలక్షణమైనదియునగు నాస్వరూపము నెఱుంగని యవివేకులు, కనఁబడని నన్ను కనఁబడురూపములను గలవానిగాఁ దలంచుచున్నారు.

నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః।
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజమవ్యయమ్॥

నేను సమస్త ప్రజలకును బ్రత్యక్షమైనవాఁడను కాను త్రిగుణవిశిష్టమగు మాయచే నావరింపఁబడిన వివేకశూన్యమైన యీజనము నన్నుఁ బుట్టుకలేనివానిగాను, నాశరహితునిగాను, నెఱుంగరు.

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణిచ భూతాని మాంతు వేద న కశ్చన ॥ ౨౬ ॥

ఓ యర్జునుఁడా ! గతించినవియు, ఉన్నవియు, కలుగఁబోవునవియు నగు ప్రాణులను నే నెఱుఁగుదును. నన్నొ యొక్కఁడు నెఱుంగఁడు.

ఇచ్ఛా ద్వేష సముత్థేన ద్వన్ద్వ మోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరన్తప ॥ ౨౭ ॥

ఓ యర్జునుఁడా ! జన్మించుకాలమందు కామక్రోధములవలనఁబు

ట్టిన సుఖదుఃఖహేతువైన యవివేకముచేత సమస్తప్రాణులును విష యాభిమానమును బొందుచున్నవి.

యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్।
తేద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః॥ ౨౮॥

సత్కర్మములనాచరించిన యేజనులయొక్క పాపమైతే నాశమును బొందినదో, యా జనులు ద్వంద్వహేతువగు నవివేకముచే విడువఁబడినవారలై, నిశ్చయమైన నియమము కలవారలై, నన్ను భజించుచున్నారు.

జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్॥ ౨౯॥

ఎవ్వరు నన్నాశ్రయించి బ్రహ్మజ్ఞానసంపన్నులై ముదిమిని, చావును, పోగొట్టుకొనుటకుఁ బ్రయత్నముచేయుదురో, వారా పరబ్రహ్మవస్తువే సమస్త కర్మస్వరూపమనియు, సకలవిధమైన ప్రత్యగాత్మ స్వరూపమనియు, నెఱుఁగుదురు.

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః।
ప్రయాణకాలేపి చ మాం తే విదుర్యుక్తచేతసః॥ ౩౦॥

ఎవ్వరధిభూతాధి దైవమును అధియజ్ఞముతోఁగూడినవాఁడునగు నన్ను తెలిసికొనుచున్నారో, వారు మరణకాలమందును నాయందు నియమింపఁబడిన యంతఃకరణముగలవారలై నన్నెఱుఁగుదురు.

ఇట్లు,
విజ్ఞాన యోగమను
నేడవ యధ్యాయము
ముగిసెను.

శ్రీరస్తు.

# ఎనిమిదవ అధ్యాయము.



## అక్షరపరబ్రహ్మయోగము.

**అర్జునఉవాచ**—అర్జునుఁడు ప్రశ్నచేయుచున్నాఁడు.

కింతద్బ్రహ్మ? కిమధ్యాత్మం? కింకర్మ? పురుషోత్తమ!
అధిభూతంచకిం ప్రోక్త? మధిదైవం కిముచ్యతే? ॥ ౧

అధియజ్ఞః కథం కోఽత్ర? దేహేఽస్మిన్మధుసూదన! ।
ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః? ॥ ౨॥

పురుష శ్రేష్ఠుఁడవగు ఓ కృష్ణస్వామీ! వెనుకటి యధ్యాయము తుదను జెప్పఁబడిన బ్రహ్మమెయ్యది? అధ్యాత్మ మెట్టిది? కర్మమెట్టిది? అధిభూతంబు నెట్టిదిగాఁ జెప్పఁబడియున్నది? అధిదైవమనగా నేమి? ఓ శ్రీకృష్ణా! ఈ దేహమునం దధియజ్ఞుఁడెవ్వఁడు? యధియజ్ఞుని విషయములో నెట్లు? మరణకాలమందును మన స్స్వాధీనము గలవారిచేత నెట్లు తెలియఁబడఁ దగినవాఁడవగుచున్నావు?

శ్రీభగవానువాచ—శ్రీకృష్ణస్వామి చెప్పుచున్నాఁడు.

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞిత 3।।

ఉత్తమైన నాశరహితమైనదియే బ్రహ్మ; జీవసంజ్ఞగల ప్రత్యగాత్మ, (దేహము స్థానముగాఁగల) అధ్యాత్మమని చెప్పఁబడుచున్నది. ప్రాణివస్తువుల కుత్పత్తిని గలుగఁజేయు యజ్ఞము మొదలగునవి కర్మమను పేరుగలది.

అధిభూతం క్షరోభావః పురుషశ్చాధి దైవతమ్।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వ ౪।

ఓ శరీరమును ధరించినవారిలో శ్రేష్ఠుఁడగు అర్జునుఁడా! నాశనమును బొందఁదగిన వస్తు వధిభూతమనఁబడును. విరాట్పురుషుఁడనఁబడు హిరణ్యగర్భుఁడే, యధిదైవతమనఁబడును. ఈ శరీరమందు అంతర్యామిగానుండు నేనే యధియజ్ఞుఁడనఁబడుదును.

అన్తకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్।
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః।

ఎవ్వఁడు మరణకాలమందుఁగూడ నంతర్యామియైన నన్నే స్మరించుచు శరీరమును విడిచి వెడలుచున్నాఁడో, వాఁడు నా స్వరూపమును పొందుచున్నాఁడు. ఈవిషయమున సందేహము లేదు.

యం యం వాపి స్మరన్భావం త్యజత్యన్తే కళేబరమ్।
తం తమేవైతి కౌన్తేయ! సదా తద్భావ భావితః॥ ౬

ఓ యర్జునుఁడా! ఎవ్వఁడు మరణకాలమం దేయే దేవతారూపమును దలంచు చున్నవాఁడై శరీరమును విడుచుచున్నాఁడో, వాఁడెల్లప్పుడు నా యా రూపము యొక్క స్మరణము చేఁగలిగిన సంస్కారము

కలవాఁడై యా యా స్వరూపమునే పొందుచున్నాఁడు.

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్యచ।
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామేవైష్య స్యసంశయః॥ ౭।

ఆ హేతువువలన నెల్లప్పుడును నన్ను చింతనచేయుము. స్వధర్మమగు యుద్ధమును జేయుము. నాయందుంచఁబడిన మనస్సును, బుద్ధినిగలవాఁడవై నన్నే పొందఁగలవు. సందేహము లేదు.

అభ్యాసయోగ యుక్తేన చేతసా నాన్యగామినా।
పరమం పురుషం దివ్యం యాతి పార్థా! నుచిన్తయన్॥౮।

ఓ యర్జునుఁడా! అభ్యాసమనెడు యోగముతోఁ గూడుకొనినది యు, నితరవిషయములయందుఁ బ్రవర్తింపనిదియు నగు మనస్సుచేత స్వయం ప్రకాశ స్వరూపుఁడైన పరబ్రహ్మమును ధ్యానించువాఁడా పరబ్రహ్మమునే పొందుచున్నాఁడు.

కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాం సమనుస్మరేద్యః।
సర్వస్యధాతార మచిన్త్యరూప
మాదిత్యవర్ణం తమసఃపరస్తాత్॥ ౯।

ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్॥ ౧౦॥

ఎవ్వఁడు భక్తితోఁ గూడుకొన్నవాఁడై యంత్యకాలమునందు ధ్యానాభ్యాస బలముచేత నిశ్చలమైన మనస్సుతోఁ గూడిన ప్రాణమును నిశ్చయాత్మకమైన బుద్ధికి స్థానమైన కనుబొమలయొక్క మధ్యమందు లెస్సగా నిలిపి సర్వజ్ఞుడైనవాఁడును, యెల్లప్పుడునుండువాఁ

డును, సమస్తలోక నియామకుఁడును, అణువుకంటెను మిక్కిలి సూక్ష్మమైనవాఁడును, సమస్త ప్రపంచమునకు నాధారమైనవాఁడును, తలంచుట కశక్యమైన స్వరూపముగలవాఁడును, స్వయంప్రకాశస్వరూపుఁడును, అజ్ఞానరూప మోహాంధకారరహితుఁడునునగు పరమాత్మను యెడతెగక చింతించునో, వాఁడు స్వప్రకాశమైన యా పరమాత్మను పొందుచున్నాఁడు.

యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదంసంగ్రహేణప్రవక్ష్యే॥

వేదార్థము నెఱింగినవారు దేనిని నాశములేనిదానిగాఁ జెప్పుచు
న్నారో, కామక్రోధాదులను జయించిన యింద్రియ నిగ్రహముగల
సన్న్యాసులే నాశరహితమైన పదమును ప్రవేశించుచున్నారో, ఏ
యక్షరపదమును తెలియఁగోరుచున్న వారలగుచు బ్రహ్మచారి వ్రత
ము ననుష్ఠించుచున్నారో, ఆ ప్రాప్యవస్తువును సంక్షేపముగా నీకొ
ఱకు లెస్సగాఁజెప్పెదను.

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్యచ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్॥

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్॥౧౩॥

ఎవ్వఁడు దనయొక్క సమస్తేంద్రియ ద్వారములను చక్కగాని యమించి, మనస్సునుహృదయకమలమందుండునాయందునిలిపియు, శిరః ప్రాంతమైన బ్రహ్మరంధ్రమందు బ్రాణవాయువు నుంచి ధ్యానాభ్యాసమునకుఁ బర్యవసానస్థితిని బొందినవాఁడై బ్రహ్మప్రతిపాదకము గు 'ఓ' మనెడు ప్రణవము నుచ్చరించుచుఁ బ్రణవమునకు లక్ష్యార్థమైన నన్ను ధ్యానించుచున్నవాఁడై శరీరమును(అభిమానింపనివాఁడై)వి

నుచుచుబయలువెడలునో, వాఁడుశ్రేష్ఠమైనగతినిపొందుచున్నాడు.

అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః॥౧౪॥

ఓ యర్జునుఁడా! ఇతరవిషయములయందుఁ బ్రవర్తింపని మనస్సు కలవాఁడగు నే యోగి నన్నెల్లప్పుడును చింతనచేయుచున్నాఁడో, స్థిరమైన సమాధిగల యట్టి ధ్యానాభ్యాసికి నేను ప్రయాసలేకుండఁ బొందఁదగినవాఁడ నగుదును.

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్।
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాంగతాః॥ ౧౫॥

శ్రేష్ఠమైన మోక్షమును పొందిన అనుభవజ్ఞానులు నన్నుఁబొంది, మఱల నాధ్యాత్మికాది దుఃఖములకు స్థానమైనదియు, ననిత్యమైనదియునగు జన్మమును పొందరు.

ఆ బ్రహ్మభవనాల్లోకాః పునరావర్తినోఽర్జున!।
మా ముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ న విద్యతే॥ ౧౬॥

ఓ యర్జునుఁడా! బ్రహ్మలోకముతోఁగూడ సమస్తలోకములును

పునరావృత్తిగలవి. ఓ యర్జునుఁడా! నన్ను (స్వస్వరూపమును) స్వానుభవముచే బొందినయెడలఁ దిరిగిపుట్టుట లేదు.

సహస్రయుగపర్యన్త మహర్యద్బ్రహ్మణో విదుః।
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః॥౧౭॥

ఏ జనులు రాత్రింబగళ్ల పరిమాణమును దెలిసినవారో, అట్టి కాలసంఖ్యావేత్తలు చతుర్ముఖబ్రహ్మకేది పగలో దానిని వేయి యుగముల పరిమితి గలదానిగాను, రాత్రిని వేయి యుగముల పరిమితి గలదానిగాను, తెలిసికొనుచున్నారు.

అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయ న్తే తత్రై వావ్యక్త సంజ్ఞకే॥ ౧౮॥

బ్రహ్మదేవుఁడు మేల్కొను సమయమందు కనఁబడనిదానినుండి కనఁబడెడు సమస్తమైన స్థూలప్రపంచములును, నందలి పదార్థములును కలుగుచున్నవి. రాత్రిప్రారంభమందు గనఁబడనిదియని చెప్పఁబడు ప్రకృతియందే లీనములగుచున్నవి.

భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే।
రాత్ర్యాగమేఽవశః పార్థ! ప్రభవత్యహరాగమే॥ ౧౯॥

ఓ యర్జునుఁడా! భూతసముదాయము కర్మపరాధీనమై పగటి యొక్క ప్రారంభమునందుఁ గలుగుచున్నది. రాత్రి సమయారంభమందు లీనమగుచున్నది. ఆ యీ భూతసముదాయమే పుట్టి పుట్టి లయ మగుచున్నది.

పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః।
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥ ౨౦॥

ఏది యవ్యక్తము కంటెను విలక్షణమైనదియు, నుత్తమమైనదియు, నింద్రియములకుఁ గనఁబడనిదియు, ననాదియైనదినగునో, అది

సమస్తభూతములును నశించుచున్నను నశింపదు.

అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్।
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ॥ ౨౧॥

ఏ పరమాత్మ, అవ్యక్తుఁడనియు నాశరహితుఁడనియు, చెప్పఁబడు చున్నాఁడో, వానిని పరమప్రాప్య స్థానమునుగాఁ జెప్పుచున్నారు. దేనిని బొంది మఱల పుట్టరో యట్టి యుత్తమైన స్థానము, నాదియై యున్నది.

పురుష స్సపరః పార్థ! భక్త్యాలభ్య స్త్వనన్యయా।
యస్యాన్త స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥ ౨౨॥

ఓ యర్జునుఁడా! ప్రాణు లే పురుషునియొక్క లోపలనున్నవో, ఎవనిచేత నీ సకలజగత్తును వ్యాపింపఁబడియున్నదో, ఆ పరమపురుషుఁడితరవ్యాపారశూన్యమైన భక్తిచేతనే పొందఁదగినవాఁడు.

యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ!॥ ౨౩॥

ఓ యర్జునుఁడా! ఏకాలమందు పోయినట్టి జ్ఞాన కర్మయోగు

లపునర్జననమును, యే కాలమందుఁబోయిన పునర్జననమును, బొం
దుచున్నారో, ఆ కాలవిభాగమును జెప్పఁబోవుచున్నాను.

అగ్ని ర్జ్యోతి రహశ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥ ౨౪॥

కాలాభిమాని దేవతయు, ప్రకాశాభిమాని దేవతయు, పగటికి నభి
మానిదేవతయు, శుక్లపక్షమునకభిమాని దేవతయు, ఆఱునెలలుగల
యుత్తరాయణాభిమాని దేవతయు నేమార్గమునఁగలరో, యామార్గ
ముగాఁ బోయినట్టి (మహాత్ములు) పరబ్రహ్మమును బొందుచున్నారు.

ధూమో రాత్రి స్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్।
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే॥ ౨౫॥

ధూమాభిమానిదేవతయు, రాత్ర్యభిమాని దేవతయు, కృష్ణపక్షాభిమాని దేవతయు, ఆఱునెలలుగల దక్షిణాయనాభిమాని దేవతయు, నే మార్గమునఁ గలరో, ఆ మార్గముగాఁబోవు కర్మయోగి చన్ద్రప్రకాశముతోఁ గూడుకొన్న స్వర్గాది లోకములనుఁ బొంది మఱల నివర్తించుచున్నాఁడు.

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తి మన్యయావర్తతే పునః॥ ౨౬॥

శుక్లకృష్ణపక్షము మొదలగువాని కభిమానిదేవతల లోకములగు నీ రెండుమార్గములు శాశ్వతముగానుండు మార్గములని నాయభిప్రాయము. మొదటిదానిచేత అపునర్జన్మమును బొందుచున్నాఁడు. రెండవ మార్గముచేత అవివేకి, ఫలములను గోరిచేయు కర్మములచేత మరల బుట్టుచున్నాఁడు.

నైతే సృతీ పార్థ! జానన్ యోగీముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున!॥ ౨౭॥

ఓ యర్జునుఁడా! ఈచెప్పఁబడిన రెండుమార్గముల నెఱుంగుచున్న జ్ఞానయోగి మోహముఁజెందఁడు. ఆ హేతువువలన ఓ యర్జునుఁడా! సమస్త కాలములయందును ధ్యానయోగముచే లభ్యమగు జ్ఞానయోగ నిష్ఠుఁడవు కమ్ము.

వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ దానేషు యత్పుణ్య ఫలంప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదంవిదిత్వాయోగీపరం స్థానముపైతిచాద్యమ్॥

జ్ఞానయోగనిష్ఠుడైన వాఁడీ యర్థము నెఱిఁగి వేదములయందును, యాగములయందును, తపములయందును, దానములయందును, యే పుణ్యఫలముపదేశింపఁబడెనో, ఆ సమస్తమైన ఫలముల నతిక్రమించుచున్నాఁడు. మఱియు (అట్లతిక్రమించి) మూలకారణమైనదియునగు బ్రహ్మమును పొందుచున్నాఁడు.

ఇట్లు,
యక్షరపరబ్రహ్మయోగమును
ఎనిమిదవ యధ్యాయము ముగిసెను.

శ్రీరస్తు.

# తొమ్మిదవ అధ్యాయము.



## రాజవిద్యారాజగుహ్య గము.

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణమూర్తి మఱల నుపదేశించుచున్నాఁడు.

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥౧॥

దేనిని౯ జక్కఁగా౯ దెలిసికొని జననమరణరూప సంసారమునుండి విడువఁబడఁగలవో, అట్టి యతి రహస్యమైనదియు, అనుభవజ్ఞానము తో౯ గూడుకొనినదియునగు నీ బ్రహ్మజ్ఞానమును నీ కొఱకు లెస్సగా౯ జెప్పెదను.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్॥ ౨॥

ఈ బ్రహ్మజ్ఞానము విద్యలలో శ్రేష్ఠమైనదియు, రహస్యములలో శ్రేష్ఠమైనదియు, నుత్కృష్టమైనదియు, పరిశుద్ధమైనదియు, స్వానుు

భవమును గలుగఁజేయునదియు, ధర్మమార్గమునుండి తప్పనిదియు, ననుష్ఠించుటకు మిక్కిలి సులభమైనదియు, నాశము లేనిదియు నగుచున్నది.

అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప ।
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥ ౩॥

ఓ యర్జునుఁడా! భక్తితోఁ గూడుకొనిన జ్ఞానమనెడు ధర్మమును నమ్మని పురుషులు నన్ను పొందక మృత్యురూపమైన సంసారమార్గమందు మఱలుచున్నారు.

మయా తత మిదం సర్వం జగ దవ్యక్త మూర్తినా।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥ ౪॥
న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః॥ ౫॥

ఇంద్రియగోచరముగాని స్వరూపముగల నాచే సమస్త ప్రపంచము వ్యాపింపఁబడినది. సమస్త ప్రపంచములును నాయందున్నవి. నేనైతే యాభూతములయందున్న వాఁడను కాను. అనఁగాఁ, నా కవి యాధారములు కావు. భూతములు నన్నంటుకొనియున్నవియుఁ గావు. నా

యొక్క యద్భుతమైన శక్తిని చూడుము. నాయొక్క స్వరూపము భూతములను భరించునట్టిదియు, భూతములను రక్షించునట్టిదియునై నను, భూతముల నాధారముచేసికొని యుండునదిగాదు.

యథాఽఽకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్।
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ॥ ౬॥

అంతట సంచరించునదియుఁ బెద్దదైనదియునగు వాయువెల్లప్పుడు నేలాగున నాకాశమునందున్నదో, ఆప్రకారముగానే సమస్త భూతములును నాయందున్నవియని తెలిసికొనుము.

సర్వభూతాని కౌన్తేయ! ప్రకృతిం యాన్తి మామికామ్।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్॥ ౭॥

ఓ యర్జునుఁడా! ప్రళయకాలమందు సమస్తభూతములును నా స్వాధీనమైన మాయనుబొందుచున్నవి. సృష్టికాలమందు వానిని మఱల నేను సృష్టించుచున్నాను.

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః।
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్॥ ౮॥

స్వకీయమైన యవిద్య నవలంబించి యస్వతంత్రమైన సమస్తమైన

భూతసముదాయమును మాటిమాటి వాని ప్రాచీన కర్మస్వభావము ననుసరించి సృజించుచున్నాను.

న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ।
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు ॥ ౯ ॥

ఓ యర్జునుఁడా! కర్మములయందభిమానమును సంబంధమును లేనివాఁడనునగు నన్ను, ఆ సృష్టికర్మములు బంధింపవు.

మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునాఽనేన కౌన్తేయ! జగద్విపరివర్తతే ॥ ౧౦ ॥

ఓ యర్జునుఁడా ! సాక్షిమాత్రుఁడనగు నాయొక్క సన్నిధాన విశేషముచేత మాయ జంగమస్థావరములతోఁగూడిన ప్రపంచమును పుట్టించుచున్నది. ఇట్లు నేను సాక్షినై యుండు నిమిత్తముచేతనే ప్రపంచము ప్రవర్తించుచున్నది.

అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్॥ ౧౧॥

నాయొక్క పరమాత్మతత్త్వము నెఱుంగని యవివేకులు సమస్త భూతములకు నియామకుఁడను భక్తులయెడల ననుగ్రహముచేత మను

ష్యదేహము నాశ్రయించినవాఁడనునగు నన్నవమానించుచున్నారు.

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః।
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥ ౧౨॥

వ్యర్థములైనయాశలును వ్యర్థములైనకర్మములునుగలవారును,వ్యర్థమైన జ్ఞానముగలవారునునగు నవివేకులు మోహమును గలుగఁ జేయునదియు, హింసారూపమైనదియు, అసురస్వభావమైనదియునగు మాయనే యాశ్రయించినవారలై నన్నవమానించుచున్నారు.

మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః।
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥ ౧౩।

ఓ యర్జునుఁడా! మహాత్ములైతే సాత్త్విక స్వభావము నాశ్రయించిన వారలగుచుఁ బ్రపంచమునకుఁ గారణమైనవాఁడను, నాశము లేనివాఁడనునగు నన్నుఁ దెలిసికొని యితర చింత లేనివారలై సేవించుచున్నారు.

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ ౧౪।

ప్రయత్నించుచున్నవారును, యెల్లప్పుడును నన్ను స్మరించుచు

న్నవారును, స్థిరమైన భక్తిచేత నెల్లప్పుడు నేకాగ్రచిత్తము గలవారును, నన్ను హృదయములయందు నమస్కరించు చున్నవారును నయి సేవించు చున్నారు.

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్॥　　౧౫॥

మఱికొందఱు సర్వాత్మకుఁడనైన నన్ను జ్ఞానమనెడి యజ్ఞము చేతఁ బూజించుకొనుచు యభేదభావనతోను, (మఱియుఁగొందఱు) భేదభావనతోను యిట్లనేకవిధములుగా నుపాసించుచున్నారు.

అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహమౌష ధమ్।
మన్త్రో2హ మహ మేవాజ్య మహమగ్ని రహం హుతమ్।౧౬॥

నేను క్రతుస్వరూపుఁడను. నేను యజ్ఞస్వరూపుఁడను. నేనన్న ముగను, ఓషధిగను, మంత్రముగను, నేయి మొదలగు ద్రవ్యస్వరూపుఁ డుగను, అగ్నిగను, హోమాదికర్మ స్వరూపుఁడుగనునై యున్నాను.

పితాహ మస్య జగతో మాతా ధాతా పితామహః।
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవ చ॥ ౧౭॥

ఈ ప్రపంచమునకు నేనే తండ్రియుఁ, దల్లియు, తాతయుఁ గర్త

ఫలమును గలుగఁజేయువాఁడును, దెలిసికొనవలసినవస్తువును, పరిశుద్ధ వస్తువును, ప్రణవస్వరూపుఁడును, ఋగ్యజుస్సామవేద స్వరూపుఁడును, అగుచున్నాను.

గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్।
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయమ్॥ ౧౮॥

కర్మఫలమును, పోషకుఁడును, నియామకుఁడును, సాక్షియును, ప్రాణులకు నివాసంబును, శరణుపొందినవారిదుఃఖములను బోఁగొట్టువాఁడును, మిత్రుఁడును, సృష్టిస్థితిలయకర్తయును, నిక్షేపము

ను, నాశములేని విత్తనమును నేనే అయియున్నాను.

తపామ్యహ మహంవర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ।
అమృతం చైవ మృత్యు శ్చ సదస చ్చాహ మర్జున! ॥౧౯॥

ఓ యర్జునుండా! నేను తపింపఁ జేయుచున్నాను. వర్షమును కురిపించుచున్నాను. నిలుపుచున్నాను. అమృతమును, మృత్యుదేవతయును, స్థూలమును, సూక్ష్మమును, నేనే అయియున్నాను.

త్రైవిద్యామాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే।

తే పుణ్యమాసాద్య సురేన్ద్రలోక
మశ్నన్తి దివ్యాన్ దివిదేవభోగాన్ ౨౦।

అనిత్యములగు స్వర్గాదిసుఖములయందాశగల యే యజ్ఞానులు యజ్ఞములచేత నన్ను బూజించి సోమపానమును జేసినవారై పాపములులేనివారై స్వర్గలోకప్రాప్తి నపేక్షించుచున్నారో, వారు పుణ్యఫలప్రదమైన దేవేంద్రలోకమును బొంది యాస్వర్గమునం దమానుష్యములైన దేవతాభోగముల ననుభవించుచున్నారు.

తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి
ఏవం త్రయీ ధర్మమను ప్రపన్నా
గతాగతం కామ కామా లభన్తే ౨౧

వారు విస్తారమైన స్వర్గలోకసుఖము ననుభవించి పుణ్యము ముగిసినతోడనే మనుష్యలోకమును ప్రవేశించుచున్నారు. ఈప్రకారముగా వేదోక్తకర్మమును ఫలాపేక్షతో ననుష్ఠించెడివార లగు విషయేచ్ఛగలవారు చావుపుట్టుకలను బొందుచున్నారు.

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్

ఏ జనులు భేదబుద్ధినిమాని నన్నే చిత్తమున నిలిపినవారై యెడతెగక ధ్యానముచేయుచున్నారో, ఎల్లప్పుడు నిష్ఠగల [illegible]వారియొక్క యోగక్షేమములను, నేను నిర్వహించుచున్నాను.

యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః
తేఽపి మామేవ కౌంతేయ! యజంత్యవిధిపూర్వకమ్॥ ౨౩.

ఓ యర్జునుఁడా! ఎవ్వారలు నితరదేవతలయందు భక్తిగలవారై [illegible]

శ్వాసముతో నారాధించుచున్నారో, వారలును క్రమమైన మార్గము నువదలినన్నే యారాధించుచున్నారు.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభు రేవచ।
న తు మా మభిజానన్తి తత్త్వేనా తశ్చ్యవన్తి తే॥ ౨౪॥

సమస్త శ్రౌతస్మార్త కర్మములకు భోక్తను, యజమానుఁడును, నేనే కదా? నన్ను యథార్థముగా నెఱుంగఁజాలరు. ఇందువలన వారు పునర్జన్మమును బొందుచున్నారు.

యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపిమామ్॥

దేవతలనుగూర్చిన వ్రతములను జేయువారు దేవతాలోకములను పితృదేవతలనుగూర్చిన వ్రతములను జేయువారు పితృలోకములను, భూతములను బూజించువారు భూతములను పొందుచున్నారు. నన్ను ధ్యానించువారో, నన్నేఁ బొందుచున్నారు.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥ ౨౬॥

ఎవ్వఁడు నాకొఱకు భక్తితోడను మాఱేడు, తులసి మొదలగు ఆకులను, పువ్వులను, పండ్లను, ఉదకములను, నిచ్చుచున్నాఁడో, అట్టి శుద్ధాంతఃకరణముగలవానియొక్క భక్తిపూర్వకముగా సమర్పింపఁబడిన యా పత్రపుష్పాదులను నేను స్వీకరించుచున్నాను.

యత్కరోషి య దశ్నాసి య జ్జుహోషి దదాసి యత్।
య త్తపస్యసి కౌన్తేయ! త త్కురుష్వ మ దర్పణమ్॥ ౨౭॥

ఓ యర్జునుడా! ఏశాస్త్రీయకర్మమును జేయుచున్నావో, తనంతటఁ దటస్థించిన యే వస్తువును భుజించుచున్నావో, దేనిని హోమ

ము జేయుచున్నావో, ఏ తపస్సును జేయుచున్నావో, దాని నంతయును నాకొఱకు సమర్పింపఁ బడుదానిఁగాఁ జేయుము.

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మ బన్ధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥ ౨౮ ॥

ఈ విధముగా నిష్టానిష్టఫలములకు హేతువులైన కర్మబంధముల చేత విడువఁబడఁగలవు. బ్రహ్మార్పణయోగనిష్ఠుఁడవగు నీవు జీవన్ముక్తుఁడవై నన్నుఁ బొందఁగలవు.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।
యే భజన్తితు మాం భక్త్యా మయి తే తేషుచాప్యహమ్॥ ౨౯॥

నేను అన్ని భూతములయందును సమముగానుండువాఁడను. నాకు ప్రియుఁడును, ఇష్టుఁడును, లేదు. ఎవ్వరైతే నన్ను యితరవిషయాసక్తిలేకుండ భజించుచున్నారో, వారు నాయందున్నారు. నేనును వారియందున్నాను.

అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్।
సాధు రేవ స మన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః॥ ౩౦॥

నిందితములైన యాచారములుగలవాఁడైనను ఆత్మకంటె నితర దేవతను భక్తిచేయనివాఁడగుచు నన్ను (స్వస్వరూపమును) ధ్యానము చేయునేని, వాఁడు స్థిరమైన మనోనిశ్చయముగలవాఁడు గనుక సదాచారము గలవాఁడుగానే తలఁపఁబడఁదగినవాఁడు.

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిచ్ఛతి
కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥ ౩౧

శీఘ్రముగా ధర్మముతోఁ గూడిన చిత్తము గలవాఁడగుచు స్థిరమైన వుపశమనమును పొందుచున్నాఁడు. ఓ యర్జునుఁడా! నా

యొక్క భక్తుఁడు చెడఁడని ప్రతిజ్ఞ చేయుము.

మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాన్తి పరాం గతిమ్॥

ఓ యర్జునుఁడా! స్త్రీలును, వైశ్యులును, శూద్రులునునగు నెట్టివిధ పాపముఁ గలవారును,నన్ను గురూపదేశప్రకారము ధ్యానము మొదలగువానిద్వారా యుత్తమమైనపదవిని నిశ్చయముగాఁ బొందుదురు.

కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా।
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్॥33॥

పుణ్యవంతులును భక్తులునగు బ్రాహ్మణులును, అట్లే క్షత్రియులును, ధ్యానాభ్యాసముద్వారా యుత్తమగతిని బొందుదురని చెప్పనేల? క్షణభంగురమగు నీ శరీరముగల నీవు నన్ను సేవింపుము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥ ౩౪॥

నాయందుమనస్సుగలవాఁడవుగను నాకు సేవకుఁడవుగను, నన్నుఁ గూర్చి యాగములఁ జేయువాఁడవుగను, అగుము. నన్ను యీ ప్రకా

రముగా శరణము నొందినవాఁడవై చిత్తమును నాయందే స్థిరముగా నుంచి నమస్కరించుము. పరమాత్మ స్వరూపుఁడనైన నన్నే పొంద గలవు.

ఇట్లు
జవిద్యా రాజగుహ్య యోగమను
తొమ్మిదవ యధ్యా ము.
ముగిసినది.



శ్రీరస్తు.

# పదియవ అధ్యాయము.

## విభూతి యోగము.

శ్రీభగవానువాచ—శ్రీకృష్ణమూర్తి మరల ఉపదేశించుచున్నాఁడు

భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమం వచః।
యత్తేఽహం ప్రియమాణాయ వక్ష్యామి హితకామ్యయా।౧

ఓ యర్జునుఁడా! సంతసించెడి నీకొఱకు హితమును గలుగఁజేయ వలె ననెడు నుద్దేశముచేతను తిరుగ నే వాక్యమును నేను జెప్పఁగ లనో, నాయొక్క శ్రేష్ఠమైన యావాక్యమును వినుము.

న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః।
అహ మాది ర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః॥ ౩॥

నాయొక్క యవతార మహిమను దేవసమూహములును మహర్షులు నెఱుఁగరు. నేను దేవతలకును, మహర్షులకును, అన్నివిధముల చేతను మొదటివాఁడనుగదా?

యో మామజమనాదించ వేత్తి లోకమహేశ్వరమ్।
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥ ౩॥

ఎవ్వఁడు నన్నాది లేనివానిఁగను, సమస్తలోకములకును నియామకునిఁగను దెలిసికొనుచున్నాఁడో, వాఁడు మనుష్యులలో నజ్ఞానము లేనివాఁడై, సమస్తపాపములచేతను విడువఁబడుచున్నాఁడు.

బుద్ధిర్జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః।
సుఖం దుఃఖం భవోభావో భయం చాభయమేవ చ॥

అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః॥ ౫।

బుద్ధియును, జ్ఞానంబును, మోహరాహిత్యంబును, నోర్పును, యథార్థంబును, బాహ్యేంద్రియ నిగ్రహమును, అంతఃకరణ నిగ్రహంబును, నాహ్లాదంబును, సంతాపంబును, ఉత్పత్తియు, నాశముగుటయు, భయంబును, భయము లేకపోవుటయు, నితర ప్రాణులను బాధించ కుండుటయు, సమత్వంబును, సంతోషంబును, తపస్సును, ఈవియు, కీర్తియును, అపకీర్తియును, ప్రాణులయొక్క యిరువది రక

భావములు నావలననే నానావిధములుగాఁ గలుగుచున్నవి.

మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥

లోకమునందున్న యీ చరాచర రూపములైన సమస్త ప్రజలు నెవ్వరియొక్క సృష్టియైయున్నవో అట్టి ప్రాచీనులైన మహర్షులును, దేవర్షులును, మనువులును, నాయొక్క సంకల్పముచేఁబుట్టిరి. నాసంబంధమైన సామర్థ్యము గలవారు.

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః।
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాఽత్ర సంశయః॥

నా యొక్క పైనఁజెప్పఁబడిన విస్తారమును, యోగైశ్వర్యమును నిజముగా నెవ్వఁడెఱుఁగునో, వాఁడు నిశ్చలమైన జ్ఞానముతోఁ గూడినవాఁడగుచున్నాఁడు. ఈవిషయమున సందేహము లేదు.

అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః॥ ౮॥

నేను సమస్తమైన జగత్తునకును ఉత్పత్తికారణమైనవాఁడను.

నావలన సమస్తజగత్తును ప్రవర్తించుచున్నది. ఈవిధముగా నెఱింగి వివేకులు పరమార్థతత్త్వము భావసక్తితోఁగూడిన వారై నన్ను భజించుచున్నారు.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥

నాయందు మనస్సుగలవారును, నన్నుఁబొందిన ప్రాణములుగల వారునగు జ్ఞానులు నన్నొకరితో నొకరు ప్రవాక్యములచేఁ బోధన జేసికొనుచున్నవారును, కీర్తనము చేయుచున్నవారును సంతుష్టులై

సంతోషమును బొందుచున్నారు; ఆత్మానందమగ్నులగుచున్నారు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే॥ ౧౦॥

దేనిచేత వారు నన్నుఁ దెలిసికొనుచున్నారో, అట్టి జ్ఞానయోగము నెల్లప్పుడును నాయందు దేకాగ్రమైన మనస్సుగలవారును, విశ్వాసపూర్వకముగా భజించుచున్నవారునగు వారలకిచ్చుచున్నాను.

తేషా మే వానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః।
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥ ౧౧॥

నేను వారలయొక్క యంతఃకరణమందు నివసించుచుండువాఁడనై యనుగ్రహించుతలంపుతో వారలయొక్క యవివేకమువలనఁ బుట్టిన సంసార మనెడి చీఁకటిని బ్రకాశించుచున్న వివేక మనెడి దీపముచేతనే నశింపఁ జేయుచున్నాను.

అర్జునఉవాచ—ఇట్లు అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు.

పరం బ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్।
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్॥ ౧౧॥

ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే॥ ౧౩॥

నీవే పరబ్రహ్మస్వరూపుఁడవుగాను, ఉత్తమమైన తేజస్స్వరూపుఁడవుగాను, పరమపావనుఁడవుగానున్నావు; నిన్ను నిత్యునిగాను, ప్రకాశ స్వరూపునిగాను, పరమపురుషునిఁగాను, దేవతాదులకు నాదియైనవానిఁగాను, పుట్టుకలేనివానిఁగాను, సర్వవ్యాపినిగాను, సమస్తఋషులును, దేవర్షియగు నారదుఁడును, అసితుఁడును దేవలుఁడును వేదవ్యాస మహర్షియును, చెప్పుచున్నారు. నీవును నాకొఱకు నా

బాగుననే చెప్పుచున్నావు.

సర్వ మేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥ ౧౪ ॥

ఓ శ్రీకృష్ణస్వామీ! నీయొక్క యవతారమహిమను దేవతలును, అసురులు నెఱుంగరుగదా యని, నన్ను గూర్చి యేవాక్యమును చెప్పుచున్నావో, ఓభగవంతుండా! ఈసమస్తమును సత్యమని తలంచుచున్నాను.

స్వయ మేవాత్మనా త్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే! ॥ ౧౫ ॥

ఓ పురుషశ్రేష్ఠుఁడా! సకల భూతములను గలుగఁజేసినవాఁడా! భూతములకు నియామకుఁ డగువాఁడా! సూర్యాది దేవతలకుఁ బ్రకాశము నిచ్చువాఁడా! సమస్తజగత్తులను బరిపాలించువాఁడా! నీవు నీ చేతనే నీవే నిన్ను దెలిసికొనుచున్నావు.

వక్తు మర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః।
యాభి ర్విభూతిభిర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి॥ ౧౬॥

నీ మాహాత్మ్య విస్తారములు మిక్కిలి యద్భుతమైనవి కదా! ఏ నీ మాహాత్మ్య విస్తారములచే నీ లోకములను వ్యాపించి యున్నావో, వానిని

నిశ్శేషముగాఁ జెప్పుటకు నీవే తగుదువు.

కథం విద్యామహం యోగిం స్త్వాం సదా పరిచిన్తయన్।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా॥ ౧౭॥

ఓ యోగానుభవస్వరూపుఁడా! నే నెల్లప్పుడు నేప్రకారముగా ధ్యానముచేయుచున్నవాఁడనై నిన్ను తెలిసికొందును. ఓభగవంతుఁడా! యే యే వస్తువులయందు నాచేత ధ్యానముచేయఁ దగిన వాఁడవుగా నగుచున్నావు.

విస్తరేణాఽఽత్మనో యోగం విభూతించ జనార్దన ! ।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్॥

ఓ జనార్దన ! నీ యొక్క సామర్థ్య విశేషమును, ధ్యానము చేయవలసినవస్తువుల విస్తారమును, సవిస్తారముగా తిఱిగియు చెప్పుము. ఏలననఁగా నీ వాక్యామృతమును వినుచున్న నాకు తృప్తి లేదు.

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణస్వామి సమాధానములు చెప్పుచున్నాఁడు.

హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ ! నాస్త్యన్తో విస్తరస్య మే॥౧౯॥

ఓ యర్జునుఁడా! ఇప్పుడు నీకొఱకు నద్భుతములైనవియు ముఖ్యములైనవియు నగు నా యొక్క నానా విధమాహాత్మ్యములను చెప్పెదను. ఏల ననిన నాయొక్క విభూతివిస్తారమునకు నంతము లేదు.

అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః।
అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మన్త ఏవచ॥ ౨౦॥

నిద్రను జయించిన ఓ యర్జునుఁడా! సమస్తభూతములయొక్క హృదయమున నున్న ప్రత్యగాత్మ నేనే; భూతములకుత్పత్తిలయ కారణుఁడును, నేనే.

ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్।
మరీచిర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ॥ ౨౧॥

నేను ఈద్వాదశాదిత్యులలో విష్ణు ననెడి సూర్యుఁడును, ప్రకాశింపఁజేయువానిలోపల కిరణములుగల సూర్యుఁడును, నేను నక్షత్రములలోపల చంద్రుఁడును, దేవతలలోపల మరీచియు నగుచున్నాను.

వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా॥ ౨౨॥

వేదములలోపల సామవేదమును, దేవతలలోపల నింద్రుఁడును, నిం

ద్రియములలోపల మనస్సును భూతములలోపల చేతనుడును నేనే.

రుద్రాణాం శఙ్కరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్।
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్॥ ౨౩॥

రుద్రులలోపల శంకరుడనుగాను, యక్షులు రాక్షసులు వీరిలోపల కుబేరుడనుగాను, వసువులలోపల అగ్నిగాను, శిఖరములుగల కొండలలోపల మేరుపర్వతముగా నే నగుచున్నాను.

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిమ్।
సేనానీనామహం స్కన్దః సరసామస్మి సాగరః॥ ౨౪॥

ఓ యర్జునుఁడా! రాజపురోహితులలోపల శ్రేష్ఠమైన బృహస్పతి
గాను, సేనాపతులలోపల కుమారస్వామిగాను, జలాశయములలో
పల సముద్రముగాను, నే నగుచున్నాను.

మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥౨౫॥

మహర్షులలోపల భృగుమహాముని గాను, మాటలలోపల నేక
అక్షరముగాను, యజ్ఞములలోపల మానసయజ్ఞముగాను, కదల
కుండువానిలో హిమవత్పర్వతముగాను, నే నగుచున్నాను.

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః।
గన్ధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః॥ ౨౬॥
ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్॥ ౨౭॥

అన్ని చెట్లలో రావిచెట్టును, దేవర్షులలో నారదుఁడును, గంధర్వులలో చిత్రరథుఁడును, సిద్ధులలో కపిలమునియును, నేనే. గుఱ్ఱములలో నమృతము నిమిత్తము సముద్ర మథనము చేసినప్పుడందుఁ బుట్టిన ఉచ్చైశ్శ్రవస్సును, గజ శ్రేష్ఠములలో నైరావతమును నే

రుగల నింద్రగజమును, మనుష్యులలో రాజును నేనే.

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్।
ప్రజన శ్చాస్మి కన్దర్ప స్సర్పాణా మస్మి వాసుకిః॥ ౨౮॥

ఆయుధములలో వజ్రాయుధమును, యావులలోఁ గామధేనువును, ప్రజల యుత్పత్తికిఁ గారణమైన కామస్వరూపుఁడును, సర్పములలో వాసుకిగాను నగుచున్నాను.

అనన్త శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్!
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్॥

నాగములలో అనంతుఁడును, జలదేవతలలో వరుణుఁడును, పితృదేవతలలో నర్యముఁడును, శిక్షింపువారిలో యముఁడును నేనే.

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్।
మృగాణాం చ మృగేన్ద్రో౽హం వైనతేయశ్చ పక్షిణామ్॥

అసురులలోఁ బ్రహ్లాదుఁడును, లెక్క పెట్టువారిలోఁ జిత్రగుప్తుఁడును, మృగములలో సింహమును, పక్షులలో గరుత్మంతుఁడును నేనే.

పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ॥ ౩౧॥

పరిశుద్ధముఁ జేయువానిలో వాయువును, ఆయుధమును ధరించినవారిలో శ్రీరాముఁడును, మత్స్యములలో మొసలిగాను, నదులలో గంగా నగుచున్నాను.

సర్గాణా మాది రన్తశ్చ మధ్యం చైవాహ మర్జున ।
అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్॥ ౩౨॥

ఓ యర్జునుఁడా! సృష్టులకుత్పత్తిస్థితి నాశమును గలుగఁజేయువాఁడును, విద్యలలో బ్రహ్మవిద్యయును, వాద జల్ప వితండములను జేయు వారిలో గురుశిష్య సంవాదమును, నేనే.

అక్షరాణా మకారోఽస్మి ద్వన్ద్వ స్సామాసికస్యచ।
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః॥

అక్షరములలో, అ, వర్ణమును, తత్పురుషాది సమాస సమూహములలో ద్వంద్వమనెడి సమాసమును, నియామకుడును, కర్మఫలములనిచ్చు విరాట్స్వరూపియు, నేనే.

మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవ శ్చ భవిష్యతామ్।
కీర్తి శ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥ ３౪॥

సమస్తమైనవారి ప్రాణములను బోగొట్టునట్టి మృత్యుదేవతయు

ను, ఉత్పత్తికాఁగల వారలయొక్క పుట్టుకయు, స్త్రీలయొక్క ఖ్యాతియును, లక్ష్మియును, వాగభిమానదేవతయగు సరస్వతియును, జ్ఞాపకశక్తియును, మేధయును, ధైర్యమును, ఓర్మియు, నేనే.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛన్దసామహమ్।
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః॥ ౩౫॥

సామవేదగానములలో బృహత్సామమును, ఛందస్సులతోఁగూడిన ఋగ్వేదములలో గాయత్రియను ఋక్కును, మాసములలో మార్గశీర్షమును ఋతువులలో వసంత ఋతువును, నేనే.

ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతా మహమ్॥

మోసపుచ్చువారిలో జూదమును, తేజోవంతులయొక్క తేజస్సును, జయముగలవారలయొక్క జయమును, ప్రయత్నముగలవారియొక్క ప్రయత్నమును, సాత్వికులయొక్క సత్త్వగుణమును; నేనే.

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనంజయః।
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః॥ ౩౭

యాదవులలో శ్రీకృష్ణుడును, పంచపాండవులలో నర్జునుడును,

మునులలో వేదవ్యాసుఁడును, శుక్రాచార్యుఁడును, నేనే.

దణ్డో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్॥ ౩౮॥

శిక్షించువారియొక్క శిక్షయు, శత్రువులను జయింప నిచ్ఛగల వారలయొక్క సామ, దాన, భేద, దండములనెడియుపాయములును, రహస్యములలో మౌనమును, జ్ఞానముగలవారిలో జ్ఞానమును, నేనే.

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున।
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్॥ ౩౯॥

ఓ యర్జునుఁడా! సమస్తభూతములకును నేది బీజమైనదో, అది యును నేనే. విస్తరించి చెప్పనేల? స్థావర జంగమాత్మకమైన యే భూత సమూహము గలదో నది యంతయు నన్ను వినా నితరవస్తువు లేదు.

నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా॥ ౪౦॥

ఓ యర్జునుఁడా! నాయొక్క యద్భుతములైన మహాత్మ్యవిస్తారములకు నంతము లేదు. బహురూపములయొక్క యీ వివరణము నేకదేశముగా నాచేతఁ జెప్పఁబడినది.

యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా।
తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసమ్భవమ్॥ ౪౧॥

ఐశ్వర్య యుక్తమైనదియు, కాంతి యుక్తమైనదియు, దృఢమైన యుత్సాహముతోఁ గూడినదియునగు వస్తు సమూహ మేదేది కలదో, ఆయావస్తు సమూహమును, నా తేజస్సుయొక్క యంశము వలనఁ గలిగినదానిఁగానే నీవు తెలిసికొనుము.

అథవా బహు నైతేన కిం జ్ఞాతేన త వార్జున।
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్॥ ౪౨॥

ఓ యర్జునుఁడా ! ఇదిగాక విస్తారమైన యీ తెలివిచేత నీకు నే మిప్రయోజనము ? నేను సమస్తమైన యీ జగత్తు నొకయంశము చేతను వ్యాపించి యున్నాను.

ఇట్లు,
విభూతి యోగమను
పదియవ యధ్యాయము
ముగిసెను.

శ్రీరస్తు.

# పదునొకండవ అధ్యాయము.

## విశ్వరూప సందర్శన యోగము.

అర్జునవువాచ=అర్జునుఁడు విన్నపము చేయుచున్నాఁడు.

మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ॥

నన్ననుగ్రహించుటకొఱకు నిరతిశయమైనదియు, తత్త్వార్థము తోఁ గూడుకొన్నదియు, అధ్యాత్మమను పేరుగలిగినదియునగు, నే వాక్యము నీ చేతఁ జెప్పఁబడినదో, ఆవాక్యముచేత నాయొక్క యవివేకము పోఁగొట్టఁబడెను.

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా।
త్వత్తః కమలపత్రాక్ష! మాహాత్మ్యమపి చావ్యయమ్॥ ౨॥

ఓ శ్రీకృష్ణస్వామి! నీవద్దనుండి ప్రాణులయొక్క యుత్పత్తినాశనమును నాచేత సవిస్తరముగా వినఁబడినవి కదా? నీయొక్కనాశ

రహితమైన శక్తియుఁగూడ నాచేత వినఁబడినదియే.

ఏవ మేత ద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర!।
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ! ॥ ౩॥

ఓ పరమేశ్వరుఁడా! నీవు నిన్నుగూర్చి యేవిధముగా చెప్పితివో, ఇందుకు వ్యత్యాసమే లేదు. ఓ శ్రీకృష్ణస్వామీ! నీ యొక్క యైశ్వర సంబంధమైనదియగు విశ్వరూపమును చూచుటకుఁగోరుచున్నాను.

మన్యసే యది త చ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో!।
యోగేశ్వర! తతో మేత్వం దర్శయాత్మాన మవ్యయమ్॥౪॥

ఓ స్వామి! ఆ స్వరూపము నా చేతఁ జూచుటకు సాధ్యమగునట్లు తలంతువేని, ఓ అణిమాది సిద్ధులు గలవాఁడా! నీవు నాశములేని నీ విశ్వరూపమును నాకొఱకుఁ జూపుము.

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.

పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥ ౫॥

ఓ యర్జునుఁడా! అనేక విధములైనవియు, ప్రపంచ విలక్షణములైనవియు, అనేక విధములగు రంగులును, అవయవములనుగలవియు,

లెక్క పెట్టుటకు వీలుగాక, అనేకములైనవియు నగు నా యొక్క రూపములను జూడుము.

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుతస్తథా।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత! ॥ ౬ ॥

ఓ యర్జునుఁడా! సూర్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీదేవతలను, మరుత్తులను, జూడుము. అలాగుననే యిదివఱకెన్నఁడును జూడఁబడనివియు, ననేకములు నగు నద్భుతములను జూడుము.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్।
మమ దేహే గుడాకేశ ! యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి॥ ౭॥

ఓ యర్జునుఁడా ! స్థావర జంగమములతోఁ గూడినదియు, సమస్తమైనదియు నగు జగత్తును, ఈ యుద్ధమందుఁ గలుగఁబోవునదియు నగు జయాపజయములను, జూడఁగోరుచున్న యెడల దానిని నా యొక్క యీఁకనీకుఁ గనుపఱుపఁబోవు శరీరమందొక్కచోట నున్న దానిఁగా నిప్పుడు చూడుము.

న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్॥ ౮॥

ఈ నీ చక్షుస్సుచేత నన్నుఁ జూచుటకు శక్తుఁడవు కావు. జ్ఞానదృష్టిని నీ కొఱకిచ్చెదను. నాయొక్క యచింత్య సామర్థ్యాతిశయమును జూడుము.

సఞ్జయవువాచ—ధృతరాష్ట్రునితో సంజయుఁడిట్లనియె.

ఏవ ముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్॥ ౯॥

అనేక వక్త్రనయన మనేకాద్భుత దర్శనమ్।
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥ ౧౦॥
దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్॥ ౧౧॥

ఓ ధృతరాష్ట్రమహారాజా! మహాత్ముఁడును, సమస్తమైన యోగులకు నీశ్వరుఁడునగు శ్రీకృష్ణమూర్తి యీప్రకారముగాఁ జెప్పి, ఇటుపైన ననేకములగు ముఖములును, నేత్రములును గలదియును, నాశ్చర్యములగు ననేక చమత్కారములను జూపుచున్నదియును,

అనేక దివ్యభూషణములు గలదియును, దివ్యములు ననేకములు నెత్తఁబడినవియునగు నాయుధములు గలదియును, దివ్యములైన పుష్ప మాలికలను వస్త్రములను ధరించినదియును, శ్రేష్ఠమైన వాసనద్రవ్యముల నైపూఁతగలదియును, సమస్తమైన యాశ్చర్యములతో నిండియున్నదియును, ప్రకాశించునదియును, అంతము లేనిదియును సమస్త స్థావరజంగమరూపముగలదియుననగు శ్రేష్ఠమైన విశ్వరూపమును నర్జునుని కొఱకుఁ జూపెను.

దివి సూర్యసహస్రస్య భవే ద్యుగప దుత్థితా।
యది భా స్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః॥౧౨॥
ఆకాశమునం దనేక సూర్యుల యొక్క కాంతి యేక కాలమునం దు బయలు వెడలునెడల, నా కాంతి యా మహాత్ముని యొక్క కాంతికి సాటియగును.

తత్రైకస్థం జగ త్కృత్స్నం ప్రవిభ క్త మనేకధా।
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాణ్డవ స్తదా॥ ౧౩॥
అప్పుడు దేవ పితృ మనుష్యాదిభేదములచే విభజింపఁబడి యుం

డునదియు, సమస్తమైనదియునగు జగత్తును భగవంతుడైన శ్రీకృష్ణ మూర్తియొక్క యా విశ్వ రూపమునందొకచోట నున్నదానిగా నర్జునుఁడు చూచెను.

తత స్సవిస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః।
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత॥ ౧౪।

పిమ్మట యాశ్చర్యముతోఁగూడినవాఁడును, గగురుపొడిచిన దేహము గలవాఁడునగు, నా యర్జునుఁడు భగవంతుని సాష్టాంగముగా నమస్కరించి రెండుచేతులనుజోడించినవాఁడై శ్రీకృష్ణమూర్తినిగూర్చి పలికెను.

అర్జునవువాచ=అర్జునుఁడిట్లనియె.

పశ్యామి దేవాం స్తవ దేవ! దేహే
సర్వాం స్తథా భూత విశేష సఙ్ఘాన్।
బ్రహ్మాణ మీశం కమలా సనస్థ
మృషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్॥ ౧౫:

ఓ శ్రీకృష్ణస్వామీ! నీ యొక్క విశ్వరూపమైన శరీరమందింద్రాది సకలదేవతలను, ఆలాగుననే ప్రజలకధిపతియును నాభికమలమందుండువాఁడునగుచతుర్ముఖబ్రహ్మను, సమస్తమైనరుషులను, సమస్తములైన

భూతసమూహములను, విచిత్రములైన సర్పములను జూచుచున్నాను.

అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్।
నాన్తం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప!॥ ౧౬॥

ఓ విశ్వేశ్వరా! ఓ ప్రపంచస్వరూపుడా! అనేకములగు భుజములను, కడుపులను, ముఖములను, నేత్రములను, అనేక రూపములును గలవాడవునగు నిన్నంతటను జూచుచున్నాను. నీయొక్క మొద

మును మధ్యమును, నంతమును చూడలేకున్నాను.

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్।
పశ్యామి త్వాం దుర్నిరీక్షం సమన్తాత్
దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్॥ ౧౭॥

కిరీటమును, గదయును, చక్రమును గలవాఁడవును, అంతటవ్యాపించియుండెడి ప్రకాశముగలవాఁడవును, చూచుటకసాధ్యమైనవాఁడవును, జ్వలించెడి యగ్ని సూర్యులవంటి కాంతిగలవాఁడవును, తలఁ

చుటకు శక్యముకానివాఁడవునగు నిన్ను సర్వత్ర చూచుచున్నాను.

త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్।
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మ గోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే॥ ౧౮॥

నీవు తెలియఁబడవలసిన పరబ్రహ్మము. నీవీ సమస్త ప్రపంచము
నకును గొప్పయాధారమయి యున్నావు; నీవు నాశరహితుఁడవు;
శాశ్వతమైన మోక్షధర్మమును గాపాడువాఁడవు. నీవు ప్రాచీనుఁ

డైన పురుషుఁడవని నాయొక్క యభిప్రాయము.

అనాది మధ్యాన్త మనన్తవీర్య
మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వ మిదం తపన్తమ్॥ ౧౯।

ఉత్పత్తి, స్థితి, నాశములులేనివాఁడవును, అపరిమితమైన సామర్థ్యముగలవాఁడవును, చంద్రుఁడును సూర్యుఁడును నేత్రములుగాఁగలవాఁడవును, జ్వలించెడి యగ్నిహోత్రునివంటి ముఖముగలవాఁ

**డవును**, నీ తేజస్సుచేత నీ సమస్త ప్రపంచము**ను** పరితపింపఁ జేయు
చున్నవాఁడవునగు నిన్ను చూచుచున్నాను.

ద్యావాపృథివ్యో రిద మన్తరంహి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః।
దృష్ట్వాఽద్భుతం రూప ముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥ ౨౦॥

ఓ మహాత్మా! ఆకాశము యొక్కయు, భూమియొక్కయు, మధ్య
ప్రదేశమైన యీ యంతరిక్షము యొక్కడవైన నీ చేత సమస్త ది

క్కులును వ్యాపింపఁబడియున్నదిగదా? భయంకరమైనదియు, ఆశ్చర్యకరమైనదియునగు నీయొక్క యీ విశ్వరూపమును జూచి మూఁడులోకంబులును కంపమును బొందియున్నవి.

అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి
కేచి ద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి।
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధ సఙ్ఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥ ౨౧॥

ఈ యుద్ధభూమిని జేరియున్న, భూభారమును దీర్చుటకై భీష్ముఁడు

మొదలగువారుగా నవతరించిన వసువులు మొదలగు దేవతా సమూహములు నిన్ను ప్రవేశించుచున్నవి; కొందఱు భయమును బొందినవారై, చేతులు జోడించినవారలగుచు స్తుతించుచున్నారు. మహర్షుల సిద్ధుల సమూహములు క్షేమమగుపుంగాతయని పలికి, సంపూర్ణములగు స్తోత్రములచేత నిన్ను స్తోత్రము చేయుచున్నవి.

రుద్రాదిత్యా వసవో యేచసాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।

గన్ధర్వ యక్షాసుర సిద్ధ సఙ్ఘా
వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥ ౨౨॥

రుద్రులును, సూర్యులును, వసువులును, సాధ్యులయినవారును, విశ్వేదేవతలును, అశ్వినీదేవతలును, మరుత్తులును, పితృదేవతలును, గంధర్వ యక్ష యసుర సిద్ధులయొక్క సమూహములును, వీరందఱును యాశ్చర్యమును బొందినవారలై నిన్ను జూచుచున్నారు.

రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదమ్।

బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్॥ ౨౩॥

గొప్ప భుజములుగలవాఁడా! అనేకముఖములును, కన్నులును గలదియు, అనేకభుజములును, తొడలును, పాదములుగలదియు, అనేక కడుపులుగలదియు, అనేకములైన కోఱలచేత భయంకరమైనదియు నగు నీ యొక్క మిగుల గొప్ప రూపమును చూచి జనులును వణఁకుచున్నారు. నేను నాలాగుననే వణఁకుచున్నాను.

నభఃస్పృశం దీప్తమనేకవర్ణమ్
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో ॥ ౨౪ ॥

ఓ మహావిష్ణో! ఆకాశము నంటియున్న వాఁడవును, ప్రకాశించుచున్న వాఁడవును, భయంకరములైన యనేకావయవములు గలవాఁడవును, తెఱచిన నోరులుగలవాఁడవును, ప్రకాశించునవియు, విశాలములునగు నేత్రములుగలవాఁడవు నగు నిన్నుఁ జూచి, మిక్కిలి భయ

పడిన మనస్సుగలవాఁడనగు నేను ధైర్యమును, మనస్సమాధానము ను పొందకున్నానుగదా ?

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస ! ॥ ౨౫

కోఁఱలచేత వికారముగలవి యును, ప్రళయకాలమునందు లోక ములను దహించునట్టి యగ్ని వంటివియునగు నీ యొక్క ముఖములను

[illegible]ాంచి, దిగ్భ్రమమును బొందియున్నాను. సుఖమును పొందకయే యున్నాను. ఓ దేవేశ! ఓ జగన్నివాసా! ప్రసన్నుఁడవగుము.

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసఙ్ఘైః।
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః॥ ౨౬॥
వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాళాని భయానకాని।

కేచి ద్విలగ్నా దశనా న్తరేషు
సన్దృశ్యన్తే చూర్ణితై రుత్తమాఙ్గైః॥ ౨౭॥

సమస్తులైన యీ దృతరాష్ట్రుని కొడుకులైనదుర్యోధనాదులును, భీష్మాచార్యుడును, ద్రోణాచార్యుఁడును, ఈ సూతునికొడుకైన కర్ణుఁడును, సమస్తమైనరాజుల సమూహములతోఁ గూడను, అలాగుననే మావారలును యుద్ధమందు శూరులగువారితోఁగూడను, అతిశీఘ్రముగా నిన్నుఁజేరి కోఱలచే వికారరూపములైనవియు, భయమును గలుగఁజేయు నవియునగు నీ యొక్క నోటిలోఁ ప్రవేశించుచున్నా

రు. కొందఱు పండ్లసందులయందు చిక్కుకొనినవారై పొడుముగాఁ జేయఁబడిన శిరస్సులతోఁగూడ కనఁబడుచున్నారు.

యథా నదీనాం బహవోఽమ్బువేగాః
సముద్రమేవాభిముఖా ద్రవన్తి।
తథా తవామీ నరలోకవీరా
విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి॥ ౨౮

పెక్కునదులయొక్క జలప్రవాహములు సముద్రమును యేలాగునఁ బ్రవేశించుచున్నవో, ఆలాగుననే యీరాజులు, మిక్కిలి ప్రకా

శించుచున్న నీ యొక్క నోటిలో ప్రవేశించుచున్నారు.

యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః।
తథైవ నాశాయ విశన్తి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥ ౨౯॥

మిడతలు నాశముకొఱకు నతివేగముగలవై మిక్కిలి మండుచున్న యగ్ని నేలాగున బ్రవేశించుచున్నవో, ఆలాగుననే యీ దుర్యోధనాది జనులును నీ యొక్క నోటిలో నతివేగముగలవారై నాశము

కొనుటకు ప్రవేశించుచున్నారు.

లేలిహ్యసే గ్రసమాన స్సమన్తా
ల్లోకా న్సమగ్రా న్వదనైర్జ్వలద్భిః।
తేజోభి రాపూర్య జగత్సమగ్రం
భాస స్తవోగ్రాః ప్రతప న్తి విష్ణో ! ॥　　　　౩౦॥

ఓ విష్ణో! నీ తేజస్సుచేత సమస్తమైన ప్రపంచమును వ్యాపించి, సమస్తములైన జనులను జ్వలించుచున్న ముఖములచేత నంతటను భక్షించుచున్నవాఁడవై రుచిచూచుచున్నావు. నీ యొక్క తీక్ష్ణ

ముత్తైన కాంతులు జగత్తును దపింపఁజేయుచున్నవి.

ఆఖ్యాహి మే కో భవా నుగ్ర రూపో
నమోఽస్తుతే దేవవర ! ప్రసీద।
విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం
నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥

ఓ దేవవరా ! క్రూరమైన రూపముగల నీ వెవ్వఁడవు [illegible] జెప్పుము. నీకొఱకు నమస్కారముఁగాత. ప్రసన్నుడ [illegible] టికిని మొదటివాఁడవగు నిన్ను దెలిసికొనుటకుఁ గోరు [illegible]

వేలయిట్టి భయంకరాకారమును ధరించితివో. ఆసంగతిని దెలిసికొన లేకయే యున్నాను.

శ్రీభగవానువాచ— శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ ౩౨॥

జనులకు నాశమును గలుగఁజేయువాఁడను, మిగుల నెత్తుగాఁబెరిగి

నవాఁడునగు కాలుఁడయి జనులను సంహరించుటకు నిప్పుడు ప్రవర్తించినవాఁడను నయితిని; ప్రతిపక్ష సైన్యములయందు యుద్ధము చేయువారెవ్వరున్నారో, భీష్మద్రోణాది సమస్తమైనవారిని, నీవు యుద్ధము చేసి చంపకపోయినను వారు జీవింపరు.

తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ
జిత్వా శత్రూన్భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ ౩౩

కావున నీవు లెమ్ము. శత్రువులను జయించి, కీర్తినిపొందుము. శత్రువులులేని రాజ్యము ననుభవింపుము. ఈ నీశత్రువులు నాచేత నిదివఱకే నిశ్చయముగాఁ జంపఁబడియున్నారు. ఓ యర్జునుఁడా! నీవు కారణమాత్రముగా నగుము.

ద్రో॥ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్ ౩౪

నాచేత నిదివఱకే చంపఁబడినట్లున్న ద్రోణాచార్యుని, భీష్మాచార్యుని, కర్ణుని , అలాగుననే మఱియు మిగిలిన యుద్ధవీరులను, నీవు చంపుము. బెదరకుము. యుద్ధముఁజేయుము. యుద్ధమున శత్రువులను జయింపఁగలవు

సఞ్జయ ఉవాచ—సంజయుఁడు ధృతరాష్ట్రునితో జెప్పుచున్నాడు.

ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ ।

నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య ।　　　　౩౫।

అర్జునుఁడు శ్రీకృష్ణమూర్తియొక్క యీవాక్యమును విని, వణఁకుచున్నవాఁడై, చేతులు జోడించినవాఁడై శ్రీకృష్ణమూర్తినిగూర్చి నమస్కరించి మాటిమాటికి భయపడుచున్న వాఁడగుచు వినయముతోఁ గూడినవాఁడై హీనస్వరము గలవాఁడై తొట్రుపాటుతోఁ గూడుకొనిన కంఠస్వరము కలిగినట్లు తిరిగియు స్వామితోఁ బలికెను.

అర్జున ఉవాచ= అర్జునుఁడు ముందుఁ జెప్పఁబోవు ప్రకారము పలికెను.

స్థానే హృషీకేశ ! తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతేచ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తిచ సిద్ధసఙ్ఘాః॥ ౩౬॥

ఓ శ్రీకృష్ణస్వామి! నీ యొక్క మహాత్మ్యమును గొని యాడుట చేతఁ బ్రపంచము మిగుల సంతోషించుచున్నది. మిక్కిలి ప్రీతినిగూడఁ బొంచున్నది. రాక్షసులు భయపడినవారలై దిక్కులనుపూర్చి పరు

గిడుచున్నారు. సమస్తములైన సిద్ధుల సమూహములును నిన్ను నమస్కరించుచున్నవి. ఇవియన్నియు నీకుఁ దగును.

కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్!
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే।
అనన్త! దేవేశ! జగన్నివాస!
త్వమక్షరం సదసత్తత్పరం యత్॥ ౩౭

ఓ మహాత్మా! ఓ అనన్తా! ఓ దేవేశ! ఓ జగన్నివాసా! ఉన్నదియును, లేనిదియు నేదో దానికి మూలకారణమైన నాశరహితముగు

బ్రహ్మము నీవే. చతుర్ముఖ బ్రహ్మకు నాదికారణుండవు గనుకనే సర్వో
త్కృష్టుండవగు నీకొఱకేల నమస్కరింపకుందురు ?

త్వ మాదిదేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్।
వేత్తాఽసి వేద్యంచ పరంచ ధామ
త్వయా తతం విశ్వమన న్తరూప! ॥ 38 ॥

ఓ అనన్తరూపా! మొదటిదేవుండవును, ప్రాచీన పురుషుండవును,
నీవే. ఈప్రపంచమునకు శ్రేష్ఠమైన స్థానమును, అన్నిటినిఁ దెలిసినో

నినవాఁడవును, తెలియఁబడువస్తుసమూహమును ఉత్తమమైనప్రాప్యస్థానమును నీవే. సమస్తప్రపంచమును నీచేత నే వ్యాపింపఁబడియున్నది.

వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాఙ్కః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥ ౩౯ ॥

వాయువును, యముఁడును, అగ్నియును, వరుణుఁడును, చంద్రుఁడును, ప్రజాపతులును, చతుర్ముఖబ్రహ్మకుఁ దండ్రియును, నీవే; నీకా

ఇంక వేయిపర్యాయములు నమస్కారము నమస్కారమగుఁగాత.
అనేకపర్యాయములు నీకొఱకు నమస్కారము నమస్కారము.

నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।
అనన్త వీర్యామితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥ ౪౦॥

ఓ సకలస్వరూపా! ముందరను, వెనుకను నీ కొఱకు నమస్కా-
రము. ఇంక నన్నిదిక్కులను నీ కొఱకు నమస్కారమగుఁగాత. అమి

తమైన సామర్థ్యమును, అపరిమితమగు పరాక్రమమును గలవాఁడ
వగు నీవు సమస్తమును నంతటను లెస్సగా వ్యాపించి యున్నావు.
అందువలన సర్వ స్వరూపుఁడవగుచున్నావు.

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ ! హే యాదవ ! హే సఖేతి ।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి ॥ ౪౧॥

చ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు।
ఏకోఽథవా ప్యచ్యుత! తత్సమక్షం
తత్క్షామయే త్వా మహ మప్రమేయమ్॥ ౪౨॥

నీయొక్క యిప్పుడు చూడఁబడుచుండు విశ్వరూపమును మహాత్మ్యమును నెఱుఁగనివాఁడను, గనుక నేనా చేత నజ్ఞానము వలననైనను స్నేహము చేతనైనను చెలికాఁడవనితలంచి, ఓశ్రీకృష్ణుఁడా! ఓయాదవుఁడా! ఓ నేస్తుఁడా! యని యాలోచింపక పామరబుద్ధితో నే

వాక్యము చెప్పఁబడినదో, నాశరహితుఁడవగునో కృష్ణా! ఆడుకొను సమయందును, షికారు వెడలు నప్పుడును, పడక యందును, కలసి కూర్చుండునప్పుడును, భోజనమందును, నొక్కఁడవై యుండఁగాఁ గాని లేక, పెద్దలయెదుటఁగాని పరిహాసముకొఱకు నవమానింపఁబడితి వనునది యేదికలదో, అవియన్నిటిని ప్రమాణములచేఁ దెలియఁబడని వాఁడవగు నిన్ను నేను క్షమాపణము చేయఁ గోరుచున్నాను.

పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।

నత్వత్సమో౽స్త్యభ్యధికః కుతో౽న్యో
లోకత్రయే౽ప్యప్రతిమప్రభావః ॥ ౪౩॥

ఓ సాటిలేని ప్రభావము గలవాఁడా ! నీవు జంగమస్థావరరూపమైన యీ ప్రపంచమునకు తండ్రివి. మఱియు గురువుగాను, పూజింపఁ బడఁదగిన వాఁడవుగాను గురుశ్రేష్ఠుఁడవుగాన మూఁడు లోకముల యందును నీతో సమానుఁడు మఱియొకఁడు లేఁడు. ఆస్థితిలో నకు కుఁడైనవాఁడెట్లు కలుగును ?

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్॥ ౪౪॥

ఆ హేతువువలన నీశ్వరుఁడవును, స్తోత్రముచేయఁదగిన వాఁడవునగు నిన్ను సాష్టాంగముగా నమస్కరించి, క్షమింపుమని ప్రార్థించుచున్నాను. ఓ దేవా! పుత్రునియొక్క తప్పును క్షమించు తండ్రివలెను చెలికానియొక్క చెలికాఁడువలెను, యిష్టురాలైన భార్యయొక్క

తప్పును క్షమించు భర్తవలెను, నాతప్పును క్షమించుటకుఁదగుదువన్నావు.

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే ।
తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస! ॥ ౪౫

చూడఁబడని యీవిశ్వరూపమును, చూచి సంతసించిన వాఁడనగుచున్నాను. భయముచేత నాయొక్క మనస్సు వణకుచున్నది. ఓశ్రీకృష్ణస్వామీ అనుగ్రహింపుము; పూర్వరూపమునే నాకు మఱలజూపుము.

కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే!॥ ౪౬

మును పటివలెనే కిరీటము గదాయుధము చక్రము గలవాఁడవునగు నిన్నుఁజూచుటకు నేను గోరుచున్నాను. ఓ యనేక భుజములు గలవాఁడా! ఓ సమస్త ప్రపంచంబును స్వరూపముగాఁ గలవాఁడా నాలుగుచేతులుగల రూపముతోడనే మఱల అగుము.

శ్రీభగవానువాచ— శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్।
తేజోమయం విశ్వ మనన్త మాద్యం
యన్మే త్వదన్యేన నదృష్టపూర్వమ్॥ ౪౭॥

ప్రకాశస్వరూపమైన నాశరహితమైనదియును, మొదటిదియును నీకంటె నితరమైనవానిచేత నిదివఱకెన్నఁడును జూడఁబడనిదియు నగు నాయొక్క శ్రేష్ఠమైన యే విశ్వరూపమును చూచితివో, ఆ రూ-

పము నీయం దనుగ్రహబుద్ధిగల నా యొక్క యోగమాయా సామ
ర్థ్యముచేత ఓ యర్జునుఁడా ! చూపఁబడినది.

న వేద యజ్ఞాధ్యయనైర్న దానై
ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః।
ఏవం రూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ! ॥ ౪౮ ॥

ఓ కౌరవశ్రేష్ఠుఁడా ! ఇట్టి విశ్వరూపముగల నేను మనుష్యలోక
మున నీకంటె నితరునిచేతను వేదము యాగము అధ్యయనము మొదల

లగు వారిచేతను, గొప్ప దానములు చేయుటచేతను, శ్రౌతస్మార్తకర్మములనాచరించుటచేతను క్రూరములైన చాంద్రాయణాది తపస్సులచేతను జూచుటకు సాధ్యమైనవాండను గాను.

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య॥ ౪౯॥

నీకంటె నితరులచేఁ జూడశక్యముగానిదియు, భయంకరమైనది

యునగు నా యొక్క యీ విశ్వరూపమును జూచి, నీకు భయము వలదు; తెలివితప్పిన చిత్తమును వలదు; భయము లేనివాఁడవును, సంతోషమును బొందిన మనస్సుగలవాఁడవు నగుచు, ఇప్పుడు నేను ధరించి యుండెడి శంఖచక్రగదాధరమైయుండు పూర్వ రూపమునే తిరిగియు లెస్సగాఁ జూడుము.

సఞ్జయ ఉవాచ=సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకంరూపం దర్శయామాస భూయః।

ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా॥ ౫౦॥

శ్రీకృష్ణస్వామి యర్జుననిగూర్చి యీవిధముగాఁ జెప్పి. యర్జునుని యొక్క ప్రార్థన ప్రకారము శంఖచక్ర గదా ధరమగు తన పూర్వ రూపమును తిరిగియు చూపెను. అపరిమితమైన దయతోఁగూడిన మనస్సుగల శ్రీకృష్ణస్వామి తిరిగియు శాంతమైన మనుష్యస్వరూపము నుధరించి భయమునుబొందియున్న యీ యర్జునునియోదార్చెను.

అర్జున ఉవాచ—అర్జునుఁడు శ్రీకృష్ణమూర్తినిగూర్చి పలుకుచున్నాఁడు.

దృష్ట్వేదం మానుషం రూపం తవసౌమ్యం జనార్దన!।
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః॥　　౫౧॥

ఓ శ్రీకృష్ణస్వామి! నీ యొక్క ప్రసన్నమైన యీ మనుష్యరూపమును చూచి, నేను ప్రజ్ఞయును తేటపడిన మనస్సును, స్వస్థతను నిశ్చయమును జెందితిని.

శ్రీభగవానువాచ—శ్రీకృష్ణమూర్తి మఱలఁ జెప్పుచున్నాఁడు.

సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః॥ ౫౨॥

నా యొక్క యే రూపమును చూచినవాఁడవైతివో, ఆ యిట్టి విశ్వరూప మితరులచేఁ జూచుటకు మిక్కిలి దుర్లభమైనది. దేవతలును కూడ నెల్లప్పుడు నీ విశ్వరూపము జూడఁగోరువారగుచున్నారు.

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥ ౫౩॥

నన్నేవిధముగా చూచితివో, ఆవిధముగ నేను వేదముల చేతను ఘోర తపస్సు మొదలగువానిచేత సాధ్యుఁడను కాను.

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున ! ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ! ॥ ౫౪ ॥

ఓ యర్జునుఁడా ! ఓ పరంతప ! ఇట్లు విశ్వరూపియైన నేను స్థిరమైన భక్తిచేతనే యథార్థముగా తెలిసికొనుటకును, చూచుటకును, నాలో నైక్యమునొందుటకును, శక్యుఁడనగుచున్నాను.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ ! ॥౫౫॥

ఓ యర్జునుఁడా ! సత్కర్మములను జేయువాఁడును, నన్నే నమ్మినవాఁడును, నాయందే భక్తిగలవాఁడును, భోగములయందుఁ బ్రీతిని విడిచినవాఁడును, సమస్తప్రాణులయందు ద్వేషము లేనివాఁడు నెవ్వఁడో, వాఁడు నన్నుఁ బొందుచున్నాఁడు.

ఇట్లు, విశ్వరూపసందర్శన యోగమను
పదునొకండవ యధ్యాయము ముగిసెను.

శ్రీరస్తు.

# పంద్రెండవ అధ్యాయము.

## భక్తియోగము.

**అర్జున ఉవాచ**—అర్జునుఁడు శ్రీకృష్ణస్వామినిగూర్చి ప్రశ్నచేసెను.

**ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే।**
**యేచాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ?॥ ౧॥**

ఈ విధముగా నెల్లప్పుడు కర్మములను జేసెడి యే భక్తులు నిన్నుపాసించుచున్నారో, ఎవ్వరు సమస్తమునందు సభిమానము విడిచి సకల కర్మములను వదలిన నిర్గుణోపాసకులు నింద్రియాగోచరమైన బ్రహ్మమును ధ్యానము చేయుచున్నారో, వారలలో నెవ్వరు శ్రేష్ఠులు?

శ్రీభగవానువాచ- శ్రీకృష్ణస్వామి యుత్తరమును జెప్పుచున్నాఁడు.

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః॥ ౨॥

నా యందు మనస్సును నిలిపి సమస్తకర్మములఁ జేయువారును,

ఉత్కృష్టమైన శ్రద్ధతో గూడినవారునయి యెవ్వారలు నన్నుపాసిం
చుచున్నారో, వారు శ్రేష్ఠులని నాయభిప్రాయము.

యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగ మచిన్త్యం చ కూటస్థ మచలం ధ్రువమ్॥ ౩॥
సన్నియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితేరతాః॥ ౪॥

జ్ఞానకర్మేంద్రియముల సమూహమును లెస్సగా నిగ్రహించి, స
మస్తకాలములయందును ఒక్కవిధమైన బుద్ధిగలవారును, సకలప్రా

ణులకును హితమును గలుగఁజేయుటయందాసక్తిగలవారునయి, ఎ
వ్వారలిట్టిదని జెప్పుట కశక్యమైనదియు, తెలియఁబడనిదియు, మన
స్సునకుఁగూడ విషయము కానిదియుఁ జలింపనిదియు, శాశ్వతమై
నదియు, అంతట వ్యాపించియున్నదియు నగు నిర్గుణబ్రహ్మమును
ధ్యానించుచున్నారో, అట్టివారే నన్ను బొందుచున్నారు.

క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥ ౫॥

నిర్గుణబ్రహ్మమందాసక్తిగల మనస్సుగలవారికి కష్టము మిక్కిలి

యసుఖకమైనది. ఏకారణమువలన ననిన నిర్గుణవిషయమైన మార్గము దేహాభిమానముగలవారిచేత నతికష్టముగాఁ బొందఁబడుచున్నది.

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥ ౬॥
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి న చిరాత్పార్థ! మయ్యావేశితచేతసామ్॥ ౭॥

ఎవ్వారలు సమస్తకర్మములను నాయందు సమర్పించి, నన్నుత్తమమైనగతిగాఁ దలంచినవారలై నన్ను విడిచి యితరమైనదానిని

వాలంబనముగాఁ గైకొనక నన్నుఁ జింతించుచున్నవారలై యుపా-
సించు చున్నారో, నాయందు చొఁబడిన మనస్సుగల వారలను, ఓ
యర్జునుఁడా! మరణాద్యనర్థముగల సంసారమనెడి సముద్రమునుం-
డి, శీఘ్రముగా జ్ఞానమను తెప్పచే నేనుద్ధరించు చున్నాను.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥ ౮

నాయందే మనస్సును బుద్ధిని స్థిరముగానుంచుము. ఈశరీరము
పోయినతరువాత నాయందే యుందువు. సందేహము లేశమైన లేదు.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ॥౯॥

ఓ యర్జునుఁడా! చిత్తమును నాయందు నిశ్చలముగునట్లు నిలుపుటకు. శక్తుఁడవు గాకపోతివేని, అభ్యాసయోగము చేత బొందుటకుఁ బ్రయత్నము చేయుము.

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ।
మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి॥ ౧౦॥

అభ్యాసయోగమందునుగూడ నశక్తుఁడవైతివేని నాకుఁ బ్రీతిని గలు-

గఁజేయు నుత్తమకర్మములేఁ గలవాఁడవగుము. నాప్రీతికొఱకుఁ గర్మలను జేయుదువేని పరంపరాక్రమమున మోక్షసిద్ధిని పొందఁగలవు.

అథైత దప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః।
సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥ ౧౧॥

దీనినిఁగూడ నాచరించుట కసమర్థుఁడవగుదువేని, జేసెడి సమస్త సత్కర్మములను నాకు సమర్పించినవాఁడవై, సమస్తమైన కర్మముల యొక్క ఫలములను, ఈశ్వరార్పణ బుద్ధితోఁ జేయుము.

శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ధ్ధ్యానం విశిష్యతే।
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాన్తి రనన్తరమ్॥౧౨॥
అవివేకముతోఁగూడిన యభ్యాసముకన్న శాస్త్రజ్ఞానము శ్రేష్ఠమైనదిగదా? అట్టిజ్ఞానముకన్న ధ్యానము నిర్విషయమైన మనస్సు శ్రేష్ఠమగుచున్నది. ధ్యానముకన్న గర్మఫలమును విడుచుట విశేషము. కర్మఫలమునువిడుచుటవలన వెంటనేబంధనివృత్తి కలుగుచున్నది.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహఙ్కార స్సమదుఃఖ సుఖః క్షమీ॥　౧౩॥

సన్తుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్సమే ప్రియః॥ ౧౪॥

సమస్తప్రాణులయందు ద్వేషము లేనివాఁడును, స్నేహబుద్ధియు ద
యను గలవాఁడును, మమతయు నహంకారము లేనివాఁడును, సుఖ
దుఃఖములయందు సమబుద్ధిగలవాఁడును, యోర్పుగలవాఁడును, ఎ
ల్లప్పుడును సంతోషముగలవాఁడును, నిశ్చలచిత్తుఁడైనవాఁడును, మ
నస్సును స్వాధీనమందుంచుకొనినవాఁడును, స్థిరమైన నమ్మకముగల
వాఁడును, నాయందు సమర్పించిన మనస్సును బుద్ధినిగలవాఁడునగు

నాభక్తుడెవ్వఁడో, వాఁడు నాకిష్టుఁడు.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో య స్సచ మే ప్రియః॥ ౧౫॥

ఎవనివలన జనులేవిధమైన భయమునుబొందరో, లోకుల కెవ్వఁడు బయపడఁడో, సంతోషము, కోపము, మనోవ్యాకులత మొదలగువానిచేత, నెవ్వఁడు విడువఁబడినవాఁడో, వాఁడే నాకిష్టుఁడు.

అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః॥ ౧౬॥

ఆసక్తిలేనివాఁడును, మనశ్శుద్ధి గలవాఁడును, సమయస్ఫూర్తి గలవాఁడును, పక్షపాతము లేనివాఁడును, భయము లేనివాఁడును, కర్మములనువిడిచినవాఁడునునగు నాభక్తుఁ డెవ్వఁడో, వాఁడు నాకిష్టుఁడు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి।
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః॥ ౧౭

ఎవ్వఁడు సంతోషింపఁడో, ద్వేషింపఁడో, దుఃఖింపఁడో, యపేక్షింపఁడో, బంధమూలమగు పుణ్యపాపముల రెంటిని విడిచినవాఁడో, అట్టి స్వానుభవశాలియే నా కిష్టుఁడు.

సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానాపమానయోః।
శీతోష్ణ సుఖ దుఃఖేషు సమస్సఙ్గవివర్జితః॥ ౧౮॥
తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ సన్తుష్టో యేన కేనచిత్।
అనికేత స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః॥ ౧౯॥

శత్రువునందును స్నేహితునియందును మానావమానములయందును, చలువయందును, వేడిమియందును, సుఖమునందును, దుఃఖమునందును, సమముగా నుండువాఁడును, కాంతకనకాదులయందు మనస్సం

బంధము లేనివాఁడును, స్తుతి నిన్దాదులయందు దుల్యుఁడును, మానము గ
లవాఁడును, యేయాహార పదార్థము చేతనైనను సంతోషించువాఁడు
ను, నియతమైన స్థలము నేర్పఱచుకొననివాఁడును, నిశ్చయబుద్ధిగల
వాఁడును, భక్తిగలవాఁడునునగు మనుష్యుఁడు, నాకిష్టుఁడు.

యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥ ౨౦॥

పైఁ జెప్పఁబడిన యీ మోక్షసాధనమైన ధర్మములను నమ్మినవా

రును నన్నే గతి గాఁ దెలిసికొనినవారునగు నెవ్వారలు ధ్యానముచేత నన్ను నుష్ఠించుచున్నారో, అట్టి భక్తులు నాకు మిక్కిలి యిష్టులు.

ఇట్లు,
భక్తియోగమను
పంద్రెండవ యధ్యాయము
ముగిసినది.

---

శ్రీరస్తు.

# పదుమూడవ అధ్యాయము.

## క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము.

అర్జున ఉవాచ—అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు.

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ।
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ! ॥ ౧

ఓ శ్రీకృష్ణస్వామీ ! ప్రకృతియొక్కయు, పురుషుని యొక్కయు, పరమాత్మ, క్షేత్రము, క్షేత్రజ్ఞుఁడు, జ్ఞానము మొదలగువాని యొక్కయు, తెలియవలసిన వస్తువు యొక్కయు స్వరూపమును తెలిసికొనుటకు కోరుచున్నాను.

శ్రీభగవానువాచ=శ్రీకృష్ణమూర్తి వివరింపఁదొడంగుచున్నాఁడు.

ఇదంశరీరం కౌన్తేయ ! క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥　　౨॥

ఓ అర్జునుఁడా ! ఈ దేహము క్షేత్రమని చెప్పఁబడుచున్నది. ఈ క్షే

త్రము నెవ్వఁడెఱుంగుచున్నాఁడో, వానిని క్షేత్రజ్ఞుఁడని క్షేత్ర క్షేత్రజ్ఞవిభాగము నెఱుంగువారు చెప్పుచున్నారు.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత ।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ ॥ ౩ ॥

ఓ యర్జునుఁడా! సమస్తశరీరములయందును నన్నే క్షేత్రజ్ఞునిఁగాఁ దెలిసికొనుము; శరీరముయొక్కయు, ఆత్మయొక్కయు జ్ఞానము యేదికలదో యది జ్ఞానమని నాయొక్క నిశ్చయము.

తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్।
సచయోయత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు॥　　　４॥

ఆ శరీర మేస్వరూపముకలదో, ఎట్టిధర్మములుకలదో, ఎట్టి వికారములకలదో, దేనివలన నే కార్యము పుట్టుచున్నదో, ఆ క్షేత్రజ్ఞుఁడెవ్వఁడో, ఎట్టిమహిమలుగలవాఁడో, ఆ స్వరూపమును సంక్షేపముగా నావలన వినుము.

ఋషిభిర్బహుధాగీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః॥　　　౫॥

అనేకవిధములుగా ఋషులచేతను, ప్రత్యేకముగా నానావిధములగు వేదములచేతను, యుక్తులతోఁగూడుకొనినవియు సంశయవిపర్యయరహితమైనయర్థములను దెలియఁజేసెడివియునగు బ్రహ్మసూత్రపదముల చేతను, చెప్పఁబడినది.

మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ।
ఇన్ద్రియాణి దశైకంచ పఞ్చ చేన్ద్రియగోచరాః॥ ౬॥
ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సఙ్ఘాతశ్చేతనా ధృతిః।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్॥ ౭॥

సూక్ష్మభూతములును యహంకార తత్త్వంబును, మహత్తత్త్వంబును, అవ్యాకృతంబును, ఇంద్రియంబులు పదియును మన స్సాక్షియును శబ్దస్పర్శరూప రసగంధములయిదును, కోరికయును, ద్వేషంబును, సుఖంబును, దుఃఖంబును, తెలివియును, ధైర్యంబును, ఇంద్రియ వికారములతోఁగూడిన యీ శరీరమే క్షేత్రముగాఁ జెప్పఁబడినది.

అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః॥　　౭॥

ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహఙ్కార ఏవ చ।
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖదోషాను దర్శనమ్॥ ౯॥
అసక్తి రనభిష్వఙ్గః పుత్ర దార గృహాదిషు।
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టో పపత్తిషు॥ ౧౦॥
మయిచానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ।
వివిక్తదేశ సేవిత్వ మరతి ర్జనసంసది॥ ౧౧॥
అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్।
ఏతద్జ్ఞానమితిప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా॥ ౧౨॥

అభిమానము దంబము లేకపోవుటయు, ప్రాణులను బాధింపకుండుటయు, ఓరిమియు, ఋజుమార్గము, గురు శుశ్రూష చేయుటయు, మనోనిగ్రహంబును, మోక్షమార్గమునస్థిరముగానుండుటయు, దేహేంద్రియాదుల మోక్షమార్గమునందుపయోగించుటయు, ఇహపరభోగములలోఁగూడ నిరాశగానుండుటయు, అహంకారము లేకుండుటయు, మరణమును, ముదిమియును, వ్యాధియును దుఃఖమును లెస్సగాఁ దెలిసికొని వానిని దుచ్ఛములని తలంచుటయు, పుత్త్రుఁడు, భార్య, గృహము మొదలగువానియందు ప్రీతియు నభిమానము లేకుండు

టయు, ఇష్టా యిష్టములు కలిగినప్పుడు సమబుద్ధి కలిగియుండుట
యు, అభేదబుద్ధి సమాధిచేత చలింపనట్టి ధ్యానముచేయుటయు,
నేకాంతమందు నివసించుట కపేక్షించుటయు, జన సమూహమున
దు ప్రీతి లేకుండుటయు, ఆత్మ స్వరూపజ్ఞానమందు మనస్సు నెల్లప్పు
డు నుంచుటయు, తత్త్వజ్ఞాన స్వరూపమును తెలిసికొనుటయు నను
నీ యిరువదియును జ్ఞానమని చెప్పఁబడినది. దీనికి విరుద్ధముగా నుం
డునది యేదో, అది యజ్ఞానమే.

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥౧౩॥

తెలియఁదగినదేదో దేనిని తెలిసికొని మోక్షమును పొందఁగలవో, దానిని చెప్పెదను. ఆదిలేని పరబ్రహ్మమనఁబడునది సత్తనియు, అసత్తనియుఁ జెప్పఁబడదు.

సర్వతఃపాణిపాదంతత్ సర్వతోఽక్షిశిరోముఖమ్।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥౧౪॥

ఆ బ్రహ్మమంతట చేతులును గాళ్లను నేత్రములును శిరస్సులును ము

ఖములును చెవులును గలదియునై, లోకమునందు సమస్తమును వ్యాపించుకొని యున్నది.

సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ॥౧౪॥
బహిరన్తశ్చ భూతానామచరం చరమేవచ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థంచాన్తికేచ తత్॥౧౫॥
అవిభక్తంచ భూతేషు విభక్తమివచ స్థితమ్।
భూతభర్తృచ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ॥౧౬॥

జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య స్థితమ్॥ ౧౮॥

ఆ బ్రహ్మము ప్రకాశించునదిగాఁ దెలియఁదగినదియును, సమస్తేం
ద్రియములు లేనిదియును, ఎందుననంటనిదియును, సమస్తమున కాధా
రమైనట్టిదియును, గుణములు లేనిదైనను గుణముల ననుభవించునట్లుతో
చుచున్నదియును, భూతములయొక్క వెలుపలను లోపలనుండునది
యును, స్థావరజంగమ స్వరూపమైనదియును, సూక్ష్మముగుటచేత న
జ్ఞానులకుఁ దెలియఁబడనిదియును, ఆబ్రహ్మము నజ్ఞానులకు దూరస్థ

ము గాను, జ్ఞానులకు సమీపము గా నుండునదియును, భూతములయం
దు యా బ్రహ్మము విభజింపఁబడనిదియైనను, విభజింపఁబడినదివలె నుం
డునదియును, భూతములను పోషించునదియును, మింగునదియును,
కలుగఁజేయునదిగాను తెలియఁదగినది. సూర్యచంద్రాదులకుఁగూ
డ యా బ్రహ్మము ప్రకాశమునిచ్చునదియును, అజ్ఞానమునకు వ్యతి
రిక్తమైనదియును,జ్ఞానస్వరూపమైనదియును,తెలియఁదగిన వస్తువై
నదియును,జ్ఞానముచేఁ బొందఁదగినదియును, సమస్త ప్రాణులయొ
క్క హృదయమునందున్నదియనని చెప్పఁబడుచున్నది.

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే॥౧౮॥
క్షేత్రస్వరూపంబును జ్ఞానస్వరూపంబును జ్ఞేయంబును సంగ్రహముగాఁ జెప్పఁబడినది. నాభక్తుఁడీ గీతాశాస్త్రార్థంబును దెలిసికొని నాలో నైక్యము నొందుటకు యోగ్యుఁడగుచున్నాఁడు.

ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సమ్భవాన్॥౨౦॥
క్షేత్రమును క్షేత్రజ్ఞునిని యిద్దఱిని ప్రవాహరూప నిత్యమైనవిగాఁ

తెలియుము; దేహేంద్రియబుద్ధ్యాది వికారములను సుఖదుఃఖమోహాదులను ప్రకృతివలనఁబుట్టినవానిఁగానే తెలియుము.

కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥ ౨౧॥

కార్యకారణ కర్తృత్వములయందు మాయ కారణముగాఁ జెప్పఁబడుచున్నది. జీవుఁడు సుఖదుఃఖములయొక్క యనుభవవిషయమందుఁ గారణముగాఁ జెప్పఁబడుచున్నాఁడు.

పురుషః ప్రకృతిస్థోహి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్।
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోని జన్మసు॥౨౨॥

ప్రకృతిని తాననితలంచియుండెడి జీవుఁడు, ప్రకృతివలనఁ బుట్టిన గుణముల ననుభవించుచున్నాఁడుగదా? గుణములయందుఁగల విషయాసక్తి, యీజీవునికిఁ బుణ్యపాపములైన యోనులయందు పుట్టుకలవిషయమై హేతువుగా నగుచున్నది.

ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్పురుషః పరః॥౨౩॥

పురుషుఁడీశరీరమందుండినను దేహముకంటె నన్యుఁడును, సమీపముననుండి చూచువాఁడును, చూచి యూరకుండువాఁడును, దేహేంద్రియ మనోబుద్ధ్యాదుల వహించునట్టుతోఁచువాఁడును; భోక్తయనితోఁచబడువాఁడును, స్వతంత్రుఁడుగా నుండువాఁడును, పరమాత్మగాను, జెప్పఁబడుచున్నాఁడు.

య ఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ।
సర్వథావర్తమానోఽపి నసభూయోఽభిజాయతే॥ ౨౪॥

ఈవిధముగాఁ బురుషుని, త్రిగుణములతోఁ గూడుకొనిన ప్రకృతి

నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో, వాఁడెట్లున్నను తిరిగియు జన్మమును బొందఁడు.

ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మాన మాత్మనా।
అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥ ౨౪॥

ఉత్తమాధికారులు ధ్యానముచేతను, మధ్యమాధికారులు సాంఖ్యయోగముచేతను, అధమాధికారులు కర్మయోగముచేతను, బుద్ధియందుండు ప్రత్యగాత్మను బాగుచేయఁబడిన యంతఃకరణముచే జూచుచున్నారు.

అన్యేత్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపిచాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥ ౨౬॥

అధమతమాధికారులో పై విధముగాఁ దెలిసికొననివారలై యితరులవలన విని యనుష్ఠించుచున్నారో, వారలుఁగూడ వేదాంత శ్రవణానుష్ఠానపరులై సంసారబంధమును తప్పక దాఁటుదురు.

యావత్సంజాయతే కించి త్సత్త్వం స్థావర జఙ్గమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధి భరతర్షభ! ॥ ౨౭॥

ఓయర్జునుఁడా! స్థావరజంగమాత్మకమైన వస్తువు వేదేది పుట్టు

చున్నదో, అది క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క సంబంధమువలనఁ గలుగు నదియని యెఱుంగుము.

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్।
వినశ్యత్స్వవినశ్యన్తం యఃపశ్యతి సపశ్యతి॥ ౨౮॥

సమస్తప్రాణులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని, సకలము నశించినను నశింపనివానిగా నెవ్వఁడు చూచుచున్నాఁడో వాఁడు నిజమును చూచుచున్నాఁడు.

సమంపశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్।
నహినస్త్యాత్మ నాత్మానం తతో యాతి పరాంగతిమ్।౨౯॥

సమస్తప్రాణులయందును సమముగా నున్నట్టి యీశ్వరునిఁ దె
లిసికొనుచున్నవాఁడు, తనచేతఁ దన్ను హింసించుకొనఁడు; దానివ
లన ఉత్తమమైన గతిని పొందుచున్నాఁడు గదా?

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః।
యఃపశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి॥3౦॥

కర్మములను ప్రకృతిచేతనే చేయఁబడుచుండువానిఁగాను, తన్ను

కర్తకానివానిఁగా నన్ని ప్రకారములచేత నెవ్వఁడు జూచుచున్నాఁడో, వాఁడు తెలిసికొనుచున్నాఁడు.

యదా భూత పృథగ్భావ మేకస్థ మనుపశ్యతి।
తత ఏవచ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా॥ ౩౦॥

భూతములయొక్క వేఱుబాటు నొక్కదానియందున్న దానిఁగాను, దానివలననే యుత్పత్తిని నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో, వాఁడప్పుడు బ్రహ్మముగా (తానుతానే) నగుచున్నాఁడు.

అనాదిత్వాన్నిర్గుణత్వా త్పరమాత్మాఽయమవ్యయః।

శరీరస్థోఽపి కౌన్తేయ నకరోతి నలిప్యతే। ౩౨॥

ఓయర్జునుఁడా! కారణము లేనివాఁడగుటచేతను త్రిగుణవికారము లు లేనివాఁడగుటచేతను, నాశరహితుఁడగు నీ పరమాత్మ, శరీరముల యందున్నట్లు కనఁబడుచున్నవాఁడైనను కర్మములం జేయువాఁడు కాఁడు. కర్మఫల సంసర్గము లేనివాఁడు.

యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే। ౩౩।

అన్నిటిని వ్యాపించియున్న యాకాశము సూక్ష్మమగుటవలన

దేనిని నంటవో, అలాగున సమస్తమైన శరీరమందు నున్న పరమాత్మ గుణదోషములచేత నంటఁబడఁడు.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నంలోకమిమం రవిః|
క్షేత్రం క్షేత్రీ తథాకృత్స్నం ప్రకాశయతి భారత ॥ ౩౪॥

ఓయర్జునుఁడా! ఒక్కఁడైన సూర్యుఁడు సమస్తమైన యీ లోకమును నేలాగునఁ బ్రకాశింపఁజేయుచున్నాఁడో, అలాగుననే క్షేత్రజ్ఞుఁడు సమస్తమైన చరాచరప్రపంచమును ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ మన్తరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతి మోక్షంచ యేవిదుర్యాన్తి తే పరమ్॥ ౩౪॥

స్వానుభవజ్ఞానమనెడి దృష్టిచేత శరీరశరీరుల యొక్క యిట్టిభేదమును, సమస్తభూతములకుఁ గారణమైన యవ్యక్తమనెడి యవిద్యనుండి నివర్తించు నుపాయము నెవ్వారలు తెలిసికొను చున్నారో వారు పరమపదమైన మోక్షమును బొందుచున్నారు.

ఇట్లు క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమను
పదమూడవ యధ్యాయము ముగిసెను.

శ్రీరస్తు.

# పదునాల్గవ అధ్యాయము.



## గుణత్రయ విభాగ యోగము.

శ్రీభగవానువాచ—శ్రీకృష్ణస్వామి యుపదేశించుచున్నాఁడు:

**పరంభూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్**
**యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాంసిద్ధి మితోగతాః॥** ౧

దేనిని తెలిసికొని సమస్త జ్ఞానులు నీ దేహసంబంధము వదలిన పైన సర్వోత్తమమగు మోక్షసిద్ధిని బొందిరో, అట్టి పరమాత్మనిష్ఠను, జ్ఞానములలో శ్రేష్ఠమైనదియగు బ్రహ్మజ్ఞాన సాధనమును మఱల జెప్పఁబోవు చున్నాను.

ఇదంజ్ఞానముపాశ్రిత్య మమసాధర్మ్య మాగతాః
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే నవ్యథన్తిచ॥ ౨॥

ఈజ్ఞానోపాయము నాశ్రయించి నాయొక్క స్వరూపమును బొందిన వారు, సృష్టియందుఁ బుట్టరు ప్రళయకాలమునందును గష్టము నొందరు.

మమయోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సమ్భవస్సర్వభూతానాం తతో భవతి భారత!॥ ౩

ఓ యర్జునుఁడా! సమస్తదేశకాలములయందును వ్యాపించియుండెడి మాయ నా యొక్క గర్భస్థానముగానున్నది. ఆ ప్రకృతియందు జగదుత్పత్తిబీజమును నే నుంచుచున్నాను. అందువలన బ్రహ్మమొదలగు సమస్తప్రాణులయొక్క యుత్పత్తి గలుగుచున్నది.

సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయస్సమ్భవన్తి యాః।
తాసాం బ్రహ్మమహద్యోని రహం బీజప్రదః పితా॥ ౪

ఓ యర్జునుఁడా! సమస్తజాతులయందు నేదేహములు కలుగుచున్నవో, వానికి మూలప్రకృతి కారణము. (తల్లి). నేను గర్భాధానకర్తయగు తండ్రిని.

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః।
నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహినమవ్యయమ్॥ ౫॥

ఓ యర్జునుఁడా! మాయవలనఁ బుట్టుకగల సత్త్వరజస్తమోగుణములు దేహమునందుండు నాశరహితుఁడైన యాత్మను బంధించుచున్నట్లుండును.

తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్।
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ!॥ ౬॥

పాపములు లేని యోయర్జునుఁడా! ఆ గుణములలోఁ బరిశుద్ధము గుటవలనఁ బ్రకాశింపఁ జేయునదియు, ఉపద్రవములు లేనిదియు నగు సత్త్వగుణము, సుఖసంగముచేతను, వృత్తిజ్ఞానసంగముచేతను, బంధమును గలుగఁజేయునట్లు తోఁచుచున్నది.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసఙ్గేన దేహినమ్॥ ౭॥

ఓ యర్జునుఁడా ! రజోగుణము రాగాదులతోఁ గూడుకొనిన పని
యు, అభిలాషను, నభిమానమును గలుఁజేయునట్టిదియనియు నెఱుం
గుము. ఆ రజోగుణసంబంధముచేత బంధించునదివ లెఁదోఁచును.

తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్।
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత ! ॥ ౮

ఓ యర్జునుఁడా ! ఇఁకఁ దమోగుణ మజ్ఞానమువలనఁ గలుగునది
యనియును, సమస్తప్రాణులకు నవివేకమును గలుగఁజేయునదియని
యు నెఱుంగుము. అది పరాకు, సోమరితనము, నిద్ర మొదలగువాని

చేత బంధించునట్లు తోఁచును

సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత !।
జ్ఞానమావృత్యతు తమః ప్రమాదే సఞ్జయత్యుత॥ ౯॥

ఓ యర్జునుఁడా! సత్త్వగుణము సుఖమునందుఁ గలుపుచున్నది. రజోగుణము కర్మమునందుఁ గలుపుచున్నది. తమోగుణమో వివేకమునుకప్పి పరాకునందుఁ గూర్చుచున్నది. ఏమి ఆశ్చర్యము?

రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత !।
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా॥ ౧౦॥

ఓ యర్జునుడా! సత్త్వగుణము, రజోగుణమును తమోగుణమును నణంచి కలుగును. రజోగుణము, సత్త్వగుణమును తమోగుణమును నణంచి ప్రవర్తించును. తమోగుణము, సత్త్వగుణమును రజోగుణమును నణంచిఁ గలుగును.

సర్వద్వారేషు దేహేஉస్మిన్ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదా తదావిద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత॥ ౧౧॥

ఈ శరీరమునందుండు సమస్త ద్వారములయందుఁ బ్రకాశించుచుండు జ్ఞానమెప్పుడు కలుగుచున్నదో, అప్పుడు సత్త్వగుణము బా

డుగ వృద్ధిఁబొందియున్నదని తెలిసికొనవలెను.

లోభః ప్రవృత్తిరారమ్భః కర్మణామశమస్స్పృహా।
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ!॥ ౧౨॥

ఓ యర్జునుఁడా! రజోగుణమభివృద్ధిని బొందినదగుచుండఁగా పరద్రవ్యమును స్వీకరించుటయందుఁ బ్రవృత్తియు, కామ్యములును నిషిద్ధములునగు కర్మములను జేయుటకుఁ బ్రారంభించుటయు, ఇంద్రియనిగ్రహముయొక్క లేమియు, కనఁబడు ప్రతివస్తువునందాశయును గలుగుచున్నవి.

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన ॥ ౧౩॥

ఓ యర్జునుఁడా! తమోగుణ మధికమైనయెడల నవివేకమును స్తబ్ధుడై యుండుటయు, అజాగ్రత్తయు విపరీతజ్ఞానమును, అను నివిఁ గలుగుచున్నవి.

యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయంయాతి దేహభృత్।
తదోత్తమవిదాంలోకా నమలాన్ ప్రతిపద్యతే॥ ౧౪॥

సత్త్వగుణ మధికమైనప్పుడు మరణమును పొందినయెడల పరిశుద్ధ

ములైన నుత్తమజన్మమును బొందుచున్నాఁడు.

రజసిప్రళయంగత్వా కర్మసఙ్గిషు జాయతే।
తథాప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే॥ ౧౫॥

రజోగుణమునందు మరణమును బొందినవాఁడు, ఫలమునందుఁ గోరికలను గలుగఁజేయు నట్టి కామ్యకర్మములను జేయు మనుష్యుల లోఁ బుట్టుచున్నాఁడు. అలాగుననే తమోగుణమునందు మరణమును బొందినవాఁడు పశుప్రాయుల గర్భములయందుఁ పుట్టుచున్నాఁడు.

కర్మణ స్సుకృత స్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్॥ ౧౬।

సాత్త్విక కర్మమునకు సత్త్వగుణసంబంధమైన పరిశుద్ధమగు సుఖ
ము ఫలమనియు, రజోగుణముచేఁ గలుగుకర్మమునకు దుఃఖము ఫల
మనియు, తమోగుణముచేఁ గలుగు కర్మమునకు నవివేకము (విపరీత
జ్ఞానము) ఫలమనియు చెప్పుచున్నారు.

సత్త్వాత్సఞ్జాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవచ। ౧౭।

సత్త్వగుణమువలన జ్ఞానమును రజోగుణమువలన విషయాసక్తి యు తమోగుణమువలన విపరీతజ్ఞానమును నవివేకమునుగలుగుచున్నవి.

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యేతిష్ఠన్తి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛన్తి తామసాః॥ ౧౮

సాత్త్వికులుత్తమ జన్మములను, రజోగుణ ప్రవృత్తిగలవారు మధ్యమజన్మములను, నీచగుణ ప్రవృత్తిగల తమోగుణాభివృద్ధిగలవారు నీచయోనులయందలి జన్మములను బొందుచున్నారు.

నాఽన్యంగుణేభ్యఃకర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥ ౧౯

**వివేకి గుణములకంటె నన్యుఁడగు కర్తను నెప్పుడు తెలిసికొని తన్ను గుణములకంటె నన్యునిఁగాను సాక్షిభూతునిఁగాను దెలిసికొనుచున్నాఁడో, వాఁడు నాస్వరూపమును బొందుచున్నాఁడు.**

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మ మృత్యు జరా దుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే। ౨౦

**జీవుఁడు, శరీరమును గలుగఁజేయునట్టి మూఁడైన యీ సత్త్వాది**

గుణములను పోఁగొట్టుకొని పుట్టుక, చావు, ముదిమి, దుఃఖముల చేత విడువఁబడినవాఁడై మోక్షమును బొందుచున్నాఁడు.

అర్జున ఉవాచ—అర్జునుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు.

కైర్లిఙ్గై స్త్రీన్గుణా నేతా నతీతో భవతి ప్రభో!।
కిమాచారః కథంచైతాం స్త్రీన్గుణా నతివర్తతే?॥ ౨౧॥

ఓ శ్రీకృష్ణస్వామీ! ఈ మూఁడుగుణముల నతిక్రమించినవాఁడు ఏలక్షణములతోఁ గూడినవాఁడు? ఎట్టి నడవడికగలవాఁడు? ఎట్లీ మూఁడు గుణముల నతిక్రమించుచున్నాఁడు?

ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవ చ పాణ్డవ!।
న ద్వేష్టి సంప్రవృత్తాని ననివృత్తాని కాఙ్క్షతి॥ ౨౨॥
ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే॥ ౨౩॥
సమదుఃఖసుఖస్స్వస్థః స్సమలోష్టాశ్మకాఞ్చనః।
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః॥ ౨౪॥
మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే॥ ౨౫॥

ఓ యర్జునుఁడా! ఎవ్వఁడు సంప్రాప్తములైన సత్త్వరజస్తమో గుణకార్యములను ద్వేషింపఁడో, లేక యపేక్షింపఁడో, సాక్షివలె నున్నవాఁడై గుణములచేతఁ జలింపఁ జేయఁబడఁడో, గుణములే ప్రవర్తించుచున్నవియని యెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో, ఎవ్వఁడు కదలఁడో, స్వరూపనిష్ఠలోనే సంతుష్టి కలవాఁడుగాను సుఖదుఃఖములయందును, మంటిబెడ్డ, ఱాయి, స్వర్ణము వీనినియందును, ఇష్టానిష్టములయందును సమబుద్ధిగలవాఁడో, ఆత్మానాత్మవివేకము గలవాఁడుగాను, దూషణభూషణలచే మనోవికారములేని వాఁడు

గాను, దేహమునిలుచుటకుమాత్రము కావలసినది వినా తక్కిన కర్మ
ముల నన్నిటిని విడిచినవాఁడుగాను నున్నవాఁడు, గుణములనతిక్ర
మించినవాఁడని చెప్పఁబడుచున్నాఁడు.

మాంచయోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥ ౨౬॥

ఎవ్వఁడు నన్ను చలింపని భక్తియోగముచేత సేవించుచున్నాఁ
డో, వాఁడీ త్రిగుణముల నతిక్రమించి జీవన్ముక్తిదశను బొందుటకు
సమర్థుఁడగుచున్నాఁడు.

బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహ మమృతస్యావ్యయస్యచ।
శాశ్వతస్యచ ధర్మస్య సుఖస్యైకాన్తికస్యచ॥ ౨౭॥

నేను నాశరహితుఁడును, నిర్వికారుఁడును, నిత్యుఁడును, ధ్యాన యోగమనెడు ధర్మాచరణముచేఁ బొందఁదగినవాఁడును, ఆనందరూపుఁడును, నియతమైన స్వభావముగలవాఁడునగు పరబ్రహ్మము యొక్క స్వరూపము కదా యని స్వానుభవచే జ్ఞాని తెలిసికొనును.

ఇట్లు గుణత్రయ విభాగ యోగ మను
పదునాల్గవ యధ్యాయము ముగిసెను.

శ్రీరస్తు.

# పదియేనవ అధ్యాయము.



## పురుషోత్తమప్రాప్తియోగము.

శ్రీభగవానువాచ—శ్రీకృష్ణమూర్తి యర్జునుని కుపదేశించెను.

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద సవేదవిత్॥ ౧।

బ్రహ్మముయొక్క మాయాశక్తిని మూలముగాఁగలదియు, శబ్దాది విషయములను శాఖలుగాఁగలదియు, రేపటికుండనిదియునగు నశ్వత్థమును (ఇచ్చట నశ్వత్థ వృక్షమును సంసారమున కుపమానముగాఁ జెప్పఁబడినది. ఎట్లనిన, నదియొక్క యిసుకయొడ్డున నెప్పటికప్పుడు పడుటకు సిద్ధముగానుండు చెట్టువలే, పుత్రమిత్రకళత్ర ధన కనక వస్తువాహనాదులనెడు కొమ్మలతోఁ గూడి, కాలప్రవాహముయొక్క యొడ్డున నెప్పటికప్పుడు పడుటకు సిద్ధముగా నుండుటవలన) నాశనములేనిదిగా (ప్రవాహముచే పెళ్లగింపఁబడి చెట్టునశించినను విత్తన

ములవలన వేలకొలది చెట్లుకలుగునట్లు కాల ప్రవాహముచే నీ సంసారము నశించినను కామ క్రోధాదులవలన సంకల్ప వికల్పము లనెడి విత్తనముచే వేల కొలదిజన్మములకుఁ గారణ మగుటంబట్టె సంసారవృక్షమును నశింపనిదిగాఁ) జెప్పఁబడుచున్నది. ఏ సంసారవృక్షమునకు వేదము శాఖలుగా నున్నవో, (ఆకులెట్లువృక్షమును, వృక్షము లెట్లాకులను పరస్పర సంరక్షించునో, అట్లు వేదోక్తకర్మముల యందాసక్తిఁగలవారలకు తత్ఫలముల నిచ్చుచు, ఫలాసక్తిచే కర్మములఁ జేయుచుండుటవలన ననేక జన్మముల కాధారమగుటంబట్టె యీ

పమానముగూడును) అట్టి సంసార వృక్షము నెవ్వఁడెఱుంగునో వాఁడు, వేదార్థమును దెలిసినవాఁడు.

అధశ్చోర్ధ్వంచ ప్రసృతా స్తస్య శాఖా
గుణ ప్రవృద్ధా విషయ ప్రవాళాః।
అధశ్చ మూలా న్యనుస న్తతాని
కర్మాను బన్ధీని మనుష్యలోకే॥ ౨॥

గుణములచే వృద్ధిఁబొందింపఁబడినవియును, శబ్దాదివిషయములు చిగురులుగాఁగలవియునగు యీ సంసార వృక్షముయొక్క కొమ్మలు

స్థావరము మొదలుకొని బ్రహ్మలోకమువఱకును వ్యాపించియున్నవి మనుష్యలోకమందు కర్మసంబంధమును గలుగఁజేయు రాగద్వేషాదివాసనలనెడి వేరులు క్రిందనుమీఁద నంతటను బ్రవేశించియున్నవి.

నరూపమస్యేహ తథోపలభ్యతే నాన్తోనచాదిర్న చ సంప్రతిష్ఠా
అశ్వత్థమేనం సువిరూఢమూల మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా
తతఃపదంతత్పరిమార్గితవ్యం యస్మిన్గతా ననివర్తన్తి భూయః
తమేవచాద్యంపురుషంప్రపద్యే యతఃప్రవృత్తిఃప్రసృతా పురాణీ

ఈ సంసారాసక్తిగలవారిచేత యీ వృక్షముయొక్క స్వరూపము

ను, ఉత్పత్తియును, తుదయును, మధ్యమును కనఁబడకున్నది. దృఢమైనవేళ్లుగల యీ సంసారవృక్షమును యెడతెగని ధ్యానాభ్యాస మనెడి రాతిమీఁద నూఱఁబడిన పుత్త్రమిత్త్రకళత్త్ర ధనకనకవస్తు వాహనాదులయం దభిమానమును నాసక్తిని విడుచుటయనెడు వైరాగ్యాయుధముచేత ఛేదించి పిమ్మట నేస్థానమునఁ బ్రవేశించినవారు తిరిగియు సంసార నరకమునకు రారో, ఎవ్వనివలన ననాదియైన ప్రవృత్తివ్యాపింపఁబడియున్నదో, ఆ సంసార భ్రమాధిష్ఠానమగు నాత్మస్వరూపమునే శరణుఁ జెందుచున్నానని నాస్థానమును దెలిసికొనవలను.

నిర్మాన మోహా జిత సఙ్గ దోషా
అధ్యాత్మ నిత్యా వినివృత్త కామాః।
ద్వన్ద్వైర్విముక్తా సుఖదుఃఖ సంజ్ఞై।
ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్॥ ౫।

అహంకారము నవివేకమును లేనివారును, పుత్త్రమిత్త్రాది సంఙ్గరహితులును, సదాబ్రహ్మజ్ఞాననిష్ఠగలవారును, వాసనతోఁగూడ నాశలను విడిచినవారును, సుఖదుఃఖములనెడి పేరుగల ద్వంద్వములచేత విడువఁబడినవారునునగు బ్రహ్మజ్ఞానులు నాశరహితమైన, ఆ

స్థానమును పొందుచున్నారు.

న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః।
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ॥ ౬॥

ఏ స్వరూపానుభవమును బొందినపిదప మరలరో యా బ్రహ్మస్వరూపమును సూర్యుఁడును చంద్రుఁడు నగ్నియు ప్రకాశింపఁజే యఁజాలరు. అది నాయొక్క యుత్తమమైన స్థానము.

మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః।
మనష్షష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥ ౭।

నాయొక్క యంశమైనవాఁడును అనాదియునైనజీవుఁడు, మాయామూలకములును, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణాం తఃకరణములనెడు యింద్రియములను సంసారమందు భోగార్థముగా నాకర్షించుచున్నాఁడు.

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్ ॥ ౮॥

దేహేంద్రియాది సంఘాతమునకు స్వామియగు జీవుఁడెప్పుడైతే శరీరమునుండి బయలుదేఱుచున్నాఁడో, ఎప్పుడు మఱియొక్క శరీరమును పొందుచున్నాఁడో, అప్పుడు పరిమళమునకు స్థానమైన పుష్ప

ము మొదలగువానినుండి వాయువు వాసనగల సూక్ష్మాంశములను స్వీకరించి పోవునట్లే, కామాదివాసనలను స్వీకరించి పోవుచున్నాఁడు.

శ్రోత్రం చక్షు స్స్పర్శనంచ రసనం ఘ్రాణమేవ చ।
అధిష్ఠాయ మనశ్చాఽయం విషయా నుపసేవతే॥ ౯॥

ఈ జీవుఁడు చెవిని, కంటిని, త్వక్కును, నాలుకను, ముక్కును, మనస్సు, నాశ్రయించి శబ్దాది విషయముల ననుభవించుచున్నాఁడు.

ఉత్క్రామన్తం స్థితంవాపి భుఞ్జానంవా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః॥ ౧౦॥

శరీరమునందుండువాఁడును, వెడలువాఁడును, విషయముల ననుభవించువాఁడును, గుణములతోఁ గూడినవాఁడునగు నీ జీవుని నజ్ఞానులు తెలిసికొనఁజాలరు. జ్ఞానదృష్టిగలవారీజీవుని తెలిసికొనుచున్నారు.

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః॥౧౧॥

ధ్యానాదులచే ప్రయత్నము నుజేయుచున్న ధ్యానయోగులు బుద్ధియందున్న యీ యాత్మను చూచుచున్నారు. శాస్త్రాభ్యాసముచే బ్రహ్మజ్ఞానమునకై ప్రయత్నముఁ జేయుచున్నవారైనను యవివేకులీ

యాత్మను తెలిసికొనలేరు.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్॥౧౨॥

సూర్యునియందుండెడు నేచైతన్యము సమస్తమైనజగత్తును ప్రకాశింపఁజేయుచున్నదో, చంద్రునియందే తేజస్సుకలదో, అగ్నియందు నే తేజస్సు కలదో, ఆ తేజస్సును నాయదియని తెలిసికొనుము.

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా।
పుష్ణామి చౌషధీస్సర్వాః సోమో భూత్వా రసాత్మకః॥

నేను భూమిని బ్రవేశించి బలముచేత జగత్తులను ధరించుచున్నాను. రసస్వరూపియగు చంద్రుఁడనయి సమస్తమైన సస్యములఁ బోషించుచున్నాను.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥౧౪॥

నేను జఠరాగ్నిగనుండి ప్రాణులయొక్క శరీరము నాశ్రయించినవాఁడను, ప్రాణాపానవాయువులతోఁగూడుకొనినవాఁడనునగుచు నాలుగువిధములగు నన్నముఁ బక్వము చేయుచున్నాను.

సర్వస్య చాహం హృదిసన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ।
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో
వేదాన్త కృద్వేదవిదేవ చాహమ్॥ ౧౫॥

నేను సమస్తప్రాణులయొక్క యు హృదయమందంతర్యామిరూపముగా నున్నాను. నావలనఁ దలంపును, తెలివియును, మఱపును, కలుగుచున్నవి. సమస్తమైన వేదములచేతను తెలియఁబడఁదగినవాఁడు నేనే; వేదాంతములను వానియర్థములను జక్కఁగాఁ దెలిసినవాఁడును,

వేదాంత సంప్రదాయమును స్థాపించిన గురువును నేనే.

ద్వావిమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థో௨క్షర ఉచ్యతే॥ ౧౬॥

లోకమందు క్షరుఁడనియు, అక్షరుఁడనియు, నీ యిద్దఱు పురుషు లుకలరు. సమస్త ప్రాణులు క్షరమనియు, జీవుఁడు (భగవన్మాయాశక్తి) అక్షరుఁడనియు, చెప్పఁబడుచున్నాఁడు.

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్య వ్యయ ఈశ్వరః॥౧౭॥

క్షరాక్షరులకంటె నన్యుఁడును నాశరహితుఁడును, నియామకుఁడునునగు నేయాత్మ మూఁడులోకములను, ప్రవేశించిభరించుచున్నాఁడో, వాఁడు పరమాత్మయని జెప్పఁబడుచున్నాఁడు.

యస్మాత్క్షర మతీతోఽహ మక్షరా దపిచోత్తమః।
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః॥ ౧౮॥

నేనెందువలన యచేతనము నతిక్రమించినవాఁడుగను, చేతనముకంటె నుత్కృష్టుఁడుగనున్నానో, ఇందువలనఁ బ్రపంచమునందును, శ్రుతులయందును, పురుషోత్తముఁడని ప్రసిద్ధుఁడనై యున్నాను.

యోమామేవ మసమ్మూఢో, జానాతి పురుషోత్తమమ్।
స సర్వవిద్భజతిమాం సర్వ భావేన భారత!। ౧౯

ఓ యర్జునుఁడా! ఎవ్వఁడు మోహము లేనివాఁడగుచు నీప్రకారము నన్ను పురుషోత్తమునిఁగాఁ దెలిసికొనుచున్నాఁడో, వాఁడు సమస్తము నెఱింగినవాఁడు; నన్ను సమస్తమునకు నాత్మయను నధ్యవసాయముతో భజించుచున్నాఁడు.

ఇతి గుహ్యతమం శాస్త్రమిద ముక్తం మయాఽనఘ!।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్ కృతకృత్యశ్చ భారత!।౨౦।

ఓ యర్జునుఁడా! ఈ విధముగా నతిరహస్యమైన యీ గీతాశాస్త్రమునందలి యీ యధ్యాయము నాచేతఁనీకుప దేశింపఁబడినది. ఓ నిర్దోషుఁడా! ఈ సంపూర్ణమైన యధ్యాయము దెలిసికొనిన పిమ్మట స్వానుభవముగలవాఁడుగాను, చేయవలసిన సమస్తమును జేసికొనినవాఁడుగాను నగును.

ఇట్లు,
పురుషోత్తమప్రాప్తియోగమను
పదియేనవ యధ్యాయము ముగిసెను.

శ్రీరస్తు.

# పదునాఱవ అధ్యాయము.



## దైవాసురసంపద్విభాగయోగము.

శ్రీభగవానువాచ — శ్రీకృష్ణమూర్తి యర్జునునికిఁ జెప్పుచున్నాఁడు.

అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. ౧.

అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్।
దయా భూతే ష్వలోలత్వ మార్దవం హ్రీ రచాపలమ్। 2॥
తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాఽతి మానితా।
భవన్తి సమ్పదం దైవీ మభిజా తస్య భారత!॥ 3॥

భయము లేకుండుటయును, మోసము, అసత్యము, మాయ మొదలగు వానిని విడుచుటయును, ఆత్మ జ్ఞానోపాయమును దెలిసికొని యా ప్రకారము నిష్ఠలో నుండుటయును, దానంబును, బాహ్యేంద్రియ నిగ్రహమును, యజ్ఞములను అధ్యయనమును జేయుటయును,

తపస్సును సర్వదా ఋజుత్వంబును, ఇతరులను బాధింపకుండుటయును, యథార్థమునే చెప్పుటయును, కోపము నణఁచుకొనుటయును, సన్న్యాసంబును చిత్తసమాధానమును, పరులదోషములను ప్రకటన చేయమియును, ప్రాణులయందు కనికరమును, వికారము నొందకుండుటయును, మృదుత్వంబును, సిగ్గును, ప్రయోజనము లేని కార్యముల విషయమై వాక్పాణిపాదములను వ్యాపింపఁజేయకపోవుటయును, ప్రాగల్భ్యమును, మనోవికారము లేకయుండుటయును, ధైర్యంబును, చిత్తశుద్ధియును, పరులను బాధింపకయుండుటయును, గర్వము

లేకపోవుటయును, అను నీ యిరువదియాఱులక్షణములును ఓ యర్జునుఁడా! దేవతలు పొందఁదగిన వైభవమును పొందఁదగి పుట్టిన వానికిఁ గలుగుచున్నవి.

దమ్భో దర్పో ఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ।
అజ్ఞానంచా ఽభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్॥ ౪॥

ఓ యర్జునుఁడా! కపటవేషము, గర్వము, దురహంకారము, కోపము, ఇతరులఁజూచి కఠినము గావచించుట, తెలివితక్కువతనము, అనునివి యసురవైభవమును పొందఁదగి పుట్టినవానికిఁ గలుగుచున్నవి.

దైవీ సమ్ప ద్విమోక్షాయ నిబన్ధా యాసురీ మతా।
మాశుచ స్సమ్పదం దైవీ మభిజాతో ఽసి పాణ్డవ!॥ ౫॥

దేవతా సంబంధమైన గుణములు బంధనివృత్తికొఱకును, అసురసంబంధమైనగుణములు బంధమును గలుగఁజేయుటకును, కారణములని నిశ్చయింపఁబడినది. ఓ యర్జునుఁడా! నీవు దేవతాసంబంధమైన గుణములను పొందుటకుఁ దగియున్నావు కావున దుఃఖింపకుము.

ద్వౌ భూత సర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు॥ ౬॥

ఈ లోకమునందు దేవతాగుణములు గలదియనియును, అసురగుణములుగలదియనియు, ప్రాణులు రెండువిధములుగా నున్నవి; దేవతా సంబంధమైనది విస్తారముగాఁ జెప్పఁబడినది. ఓ యర్జునుఁడా! అసుర సంబంధమైన సృష్టిని నావలన నిఁక వినుము.

ప్రవృత్తించ నివృత్తించ జనా న విదు రాసురాః।
నశౌచం నాపిచాచారో న సత్యం తేషు విద్యతే॥ ౭॥

అసురస్వభావముగల జనులు పురుషార్థసాధనములగు నే కార్యములననుష్ఠింపవలెనో దానిని, యనర్థహేతువులగు నే కార్యములను

విడిచిపెట్టవలెనో, దానిని నెఱుఁగరు. వారియందు బాహ్యాంతరశుద్ధియు, ఆచారమును, నిజమును బలుకుటయును లేదు.

అసత్య మ ప్రతి ష్ఠం తే జగదాహు రనీశ్వరమ్।
అపరస్పర సంభూతం కిమన్య త్కామ హైతుకమ్॥ ౮॥

వారు జగత్తు వేదాదిప్రమాణములు లేనిదనియు, ధర్మాధర్మవ్యవస్థలు లేనిదనియు, కర్తయగు నీశ్వరుఁడు లేనిదనియు, స్త్రీపురుషులయన్యోన్య సంయోగము చేఁగలుగనదియనియు, కామోద్రేకమే కారణము గాఁగలదనియు, ఇతరమైన కారణ మేమియున్నదనియు, చెప్పుదురు.

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో ఽల్ప బుద్ధయః।
ప్రభవ న్త్యుగ్ర కర్మాణః క్షయాయ జగతో ఽహితాః॥ ౯॥

వారినాస్తికదృష్టి నవలంబించి చెడిపోయిన స్వభావముగలవారును, విషయములలోనే బుద్ధిని ప్రవేశ పెట్టువారును, హింసను గలుగఁజేయఁదగిన కర్మములను జేయువారును, జగత్తునకు శత్రువులై ప్రపంచముయొక్క నాశముకొఱకుఁ బుట్టుచున్నారు.

కామ మాశ్రిత్య దుష్పూరం దమ్భ మాన మదాన్వితాః।
మోహాద్గృహీత్వా ఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తే ఽశుచివ్రతాః॥

నింప శక్యముకాని యాశ నవలంబించి దంభగర్వమదములతోఁ గూడినవారును, మద్యము మాంసము మొదలగు నపరిశుద్ధములైన వస్తువులను భుజించెడి వ్రతములుగలవారును, అవివేకముచేత దురాగ్రహములనవలంబించి ప్రవర్తించుచున్నారు.

చిన్తా మపరిమేయాం చ ప్రళయాన్తా ముపాశ్రితాః।
కామోపభోగ పరమా ఏతావ దితి నిశ్చితాః॥ ౧౧॥
ఆశా పాశ శతై ర్బద్ధాః కామ క్రోధ పరాయణాః।
ఈహన్తే కామ భోగార్థ మన్యాయే నార్థ సఞ్చయాన్॥౧౨॥

అపరిమితమైనదియు, మరణమువఱకును వెంటఁబడునదియు నగు మనోరథపరంపరను బొందినవారును, శబ్దాది విషయానుభవము గొప్పదని తలంచువారును, కామోపభోగమే పరమపురుషార్థము, ఇంతకంటె నుత్తమసుఖము లేదని నిశ్చయించుకొనినవారును, ఆశలనెడు ననేకములగు త్రాళ్లచేతఁ గట్టఁబడినవారును, దురాశను, కోపమును, ముఖ్యాధారముగా నాశ్రయించినవారునగుచు విషయానుభవ సంపూర్తికొఱకై యన్యాయమార్గముచేత ధనసమూహములఁ గూర్చ నిచ్ఛించుచున్నారు.

ఇదమద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్॥ ౧౩॥
అసౌ మయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ॥ ౧౪॥
ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః॥ ౧౫॥
అనేక చిత్తవిభ్రాన్తా మోహజాల సమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥ ౧౬॥

ఈకోరిక యిప్పుడు నాచేతఁ బొందఁబడినది. ఈకోరికఁ బొందఁగలను. గోభూహిరణ్యాదికమగు నీద్రవ్యము నాకుఁగలదు. ఈధనముకూడ నాకు మఱియు కలుగఁగలదు. ఈశత్రువు నాచేతఁ జంపఁబడెను. మిగిలినశత్రువులనుకూడఁ జంపెదను. నేను ప్రభువును. సమస్తభోగములననుభవించువాఁడను, తలఁచినపనులను నెఱవేర్చుకొనుటకుశక్తుఁడను, కొడుకులు, మనుమలు, మునిమనుమలు కలవాఁడను, బలవంతుఁడను, సుఖముకలవాఁడను, ధనవంతుఁడను, ఉత్కృష్టమైనకులమునఁ బుట్టినవాఁడనుగానున్నాను, నాతో సమానుఁడి

తరుఁ డెవ్వఁడున్నాఁడు. యజ్ఞముచే నేదను ద్రవ్యమిచ్చెదను, సం
తోషింపఁగలను అని యవివేకముచే మోహితులైనవారును, అనేక
విధములైన చిత్తభ్రమను బొందినవారును, దారాపుత్రపౌత్ర
ధన వాహన క్షేత్రాదులయం దభిమానమనెడి వలచేత నావరింపఁ
బడినవారును, విషయభోగములయం దాశచేతఁ దగులుకొన్నవారు
నగుచు నపరిశుద్ధమైన నరకమున బడుచున్నారు.

ఆత్మసమ్భావితా స్తబ్ధా ధనమానమదాన్వితాః।
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనావిధిపూర్వకమ్॥　　౧౭॥

అహఙ్కారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః।
మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తో ఽభ్యసూయకాః॥
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు॥ ౧౯॥

తమ్మునుదామే గారవించువారును, పెద్దలయెడల మర్యాదలేనివారును, ధనాభిమానముతోను ధనమదముతోనుగూడినవారుసు, అహంకారమును, బలమును, "నాకువెండిచెంబు వానికిని వెండిచెంబా" అనెడి యంతఃకరణ దోషవిశేషమును, ఆశను, క్రోధమును ఆశ్ర

యించినవారును, తమశరీరమందును ఇతరశరీరములయందును సాక్షిగనుండు నన్ను నాయాజ్ఞను నుల్లఘ్ఘనము సేయువారును, సన్మార్గము నందుండెడి పెద్దల సుగుణములను సహింపఁజాలక దోషములను గల్పించువారును నగు వారు, దంభముతో డశాస్త్రీయమైన పనులను కీర్తిని యాలోచించి తనకుఁదోచినట్లు చేయుదురు. ద్వేషముగలవారును, క్రూరమైన స్వభావముగలవారును, బాహ్యాంతర శుచిత్వములేనివారును నగునిట్టి హీనప్రవృత్తిగల మనుష్యులను జనన మరణ మార్గములయందుఁ గ్రూరవ్యాపారములు తఱుచుగాఁగల నీచజన్మముల

యందే యెల్లప్పుడును నేనుంచెదను.

ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని।
మామప్రాప్యైవ కౌన్తేయ! తతో యాన్త్యధమాంగతిమ్॥

ఓ యర్జునుడా! వారలు ప్రతిజన్మమందును నసురస్వభావము గల జన్మమును బొందినవారును, అవివేకులు నగుచు నన్ను పొందక యే యంతకంటె నీచతరమగు జన్మమును పొందుచున్నారు.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేత త్త్రయం త్యజేత్॥ ౨౧॥

ఆశ, కోపము, పరద్రవ్యాపేక్ష, అను మూడును నరకమును బొం దుటకు ద్వారములు. ఇవి జీవునికి నాశహేతువుగానున్నవి. ఆ హే తువువలన నీ వీ మూటిని విడువవలెను.

ఏతైర్విముక్తః కౌన్తేయ! తమోద్వారైస్త్రిభిర్నరః।
ఆచరత్యాత్మనశ్శ్రేయ స్తతో యాతి పరాంగతిమ్॥ ౨౨॥

ఓ యర్జునుఁడా! నరకమునకుఁ గారణములైన యీ మూటిచేత నువిడువఁబడిన పురుషుఁడు, తనకుఁ బురుషార్థసాధనమును జేసి కొనుచున్నాఁడు. దానివలన మోక్షముఁ బొందుచున్నాఁడు.

యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥ ౨౩॥

ఎవ్వఁడు శాస్త్రోక్తమైన విధినిషేధములను విడిచిపెట్టి తనయిష్టప్రకారము ప్రవర్తించుచుండునో, వాఁడు తత్త్వజ్ఞానమును, ఇహలోకసుఖమును, ఉత్తమమోక్షమును బొందఁడు.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాఽకార్య వ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహాఽర్హసి॥ ౨౪॥

ఆ హేతువువలన నీకు చేయఁగూడినవానిని, చేయరానివానిని నే

ర్పఱచుటయందు వేదము ప్రమాణము. వేదమనెడు నుత్తమప్రమాణమందుఁ జెప్పఁబడినదానిం దెలిసికొని యీ ప్రపంచములో నీ వర్ణాశ్రమవిహిత కర్మమును జేయుటకుఁ దగియున్నావు.

ఇట్లు,
దైవాసుర సంపద్విభాగ యోగమను
పదునాఱవ యధ్యాయము
ముగిసెను.

---

శ్రీరస్తు.

# పదునేడవ అధ్యాయము.

## శ్రద్ధాత్రయ విభాగ యోగము.

అర్జున ఉవాచ—అర్జునుఁడుఁ బ్రశ్న చేయుచున్నాఁడు.

యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేషాం నిష్ఠాతు కా కృష్ణ! సత్త్వమాహో రజస్తమః॥ ౧॥

ఓ శ్రీకృష్ణస్వామీ ! ఎవ్వరు శ్రుతులయందును, స్మృతులయందు
ను జెప్పఁబడియుండెడి విధిని విడిచిపెట్టి శ్రద్ధతోఁ గూడినవారలై దే
వతలను పూజించుచున్నారో వారలయొక్క పూజ మొదలగునవి
సాత్వికమా ? రాజసమా ? లేక తామసమా ? ఏది.

శ్రీభగవానువాచ—శ్రీకృష్ణస్వామి చెప్పుచున్నాఁడు.

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥ ౨॥

ప్రాణులయొక్క పూర్వజన్మ వాసనచేఁగలిగిన యా శ్రద్ధ సా

త్త్వికమనియు రాజసమనియుఁ తామసమనియు, మూఁడువిధములైన
దిగా నగుచున్నది. దానిని వినుము.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత!।
శ్రద్ధామయోఽయం పురుషో యోయచ్ఛ్రద్ధ స్సఏవసః॥

ఓ యర్జునుఁడా! సమస్తమైన ప్రాణులకును వానివాని యంతఃకరణము ననుసరించి శ్రద్ధ కలుగుచున్నది. ఆ శ్రద్ధతోఁ బూజించుచు సంసారియైన జీవుఁడు, శ్రద్ధయే స్వరూపముగాఁగలవాఁ డెవ్వఁ డెట్టి శ్రద్ధ కలవాఁడో, వాఁడట్టిశ్రద్ధకుఁదగినవాఁడే యగుచున్నాఁడు.

యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః॥ ౪॥

సత్త్వగుణముగలవారు దేవతలను, రజోగుణముగలవారు యక్షులను, రాక్షసులను, మిగిలిన తామసగుణముగలవారు ప్రేతములను భూతగణములను పూజించుచున్నారు.

అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపోజనాః।
దమ్భాహఙ్కార సంయుక్తాః కామరాగ బలాన్వితాః॥ ౫॥
కర్షయన్త శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః।

మాంచైవాన్తశ్శరీరస్థం తాన్విద్ధ్యాసుర నిశ్చయాన్। ౬॥

శరీరమున నున్న యింద్రియసమూహమును ఉపవాసాదులచేఁ శుష్కింపఁ జేయువారును, శరీరమునం దంతర్యామిగా నున్న నన్ను కృశింపఁజేయుచున్నవారును దంభముతోను అహంకారము తోనుగూడినవారును, ఆశవలనను రాగమువలనను కలుగుబలముతోఁ గూడినవారును, అవివేకులును నగు నేప్రాణులు శాస్త్రముచే విధింపఁ బడనిదియు, బాధను గలుగఁజేయునదియునగు తపస్సును జేయుచున్నారో, వారిని నసురస్వభావముగలవారినిగాఁ దెలిసికొనుము.

ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు॥ ౭॥

సమస్తమైనవానికిఁ బ్రియమైన యాహారము మూఁడువిధములు గలదిగా నగుచున్నది. యజ్ఞంబును, తపస్సును, దానంబును, వానియొక్క భేదమును వినుము.

ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః।
రస్యాస్స్నిగ్ధా స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః॥
జీవితమును, చిత్తస్థైర్యమును శరీరబలమును, ప్రీతిని, వృద్ధిఁబొం

దించునవియును, రసముగలవియును, చమురుగలవియును, దేహము నందు చాలాకాలము నుండునవియును, మనోహరములైనవియు నగు భక్ష్యభోజ్యాద్యాహారములు సత్త్వగుణముగలవారల కిష్టములైనవి.

కట్వామ్ల లవణా త్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః।
ఆహారా రాజస స్యేష్టా దుఃఖ శోకామయ ప్రదాః॥ ౯॥

చేదుఁగాను, పుల్లగాను, ఉప్పగాను, మిక్కిలి వేఁడిగాను, కారముగాను, చమురు లేనివిగాను, దాహమును గలుగఁజేయునవిగాను,

ఉండునవియు, కష్టమును, మనోవ్యాకులత్వమును, రోగములను కలుగఁజేయునవియునగు నాహారములు రజోగుణముగలవాని కిష్టములైనవి.

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్ట మపి చా మేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ ౧౦ ॥

లెస్సగా నుడుకనిదియు, సారములేనిదియు, దుర్గంధము గలదియు, వండినతరువాత నొక్కరాత్రి గడచినదియు, యితరులు తినఁగా మిగిలినదియు, భగవంతునికి నివేదిత ప్రసాదము కానిదియునగు

నే యాహారముగలదో, నది తమోగుణము గలవారికిష్టమైనది.

అఫలాకాఙ్క్షిభిర్యజ్ఞో విధిదృష్టోయ ఇజ్యతే।
యష్టవ్యమేవేతి మన స్సమాధాయస సాత్త్వికః॥ ౧౧

యాగము చేయుట విధియే యని మనస్సును స్థిరపఱచి శాస్త్రము చే నియమింపఁబడిన యే యజ్ఞము ఫలాపేక్ష లేనివారిచేత నాచరింపఁ బడుచున్నదో, అది సాత్త్వికమైనది.

అభిసన్ధాయతు ఫలం దమ్భార్థ మపి చైవయత్।
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్॥ ౧౨

ఓ యర్జునుఁడా! ఫలము నపేక్షించియు దంభముకొఱకు నేయజ్ఞమనుష్ఠింపఁబడుచున్నదో, ఆ యజ్ఞమును రాజసమునుగాఁ దెలిసికొనుము.

విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్।
శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥ ౧౩॥

అశాస్త్రీయమైనదియు, అన్నదానము లేనిదియు, స్వరవర్ణాది లోపములుగలదియు, దక్షిణలనీయక చేయఁబడునదియు, విశ్వాసము లేనిదియునగు యజ్ఞమును తామసమునుగాఁ బెద్దలు నెప్పుచున్నారు.

దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్।
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే॥ ౧౪॥

దేవతలను, బ్రాహ్మణులను, తత్త్వోపదేశకుఁడగు గురువును, సామాన్యముగా జ్ఞానులనందఱిని పూజించుటయు, శరీర పరిశుద్ధత్వము కలిగి యుండుటయును, ఋజుత్వంబును, బ్రహ్మచర్యంబును, తనకుఁగాని పరులకుఁగాని హింసనుకలుగఁజేయకయుండుటయును, శరీరముచేతఁ జేయఁదగిన తపస్సని చెప్పఁబడుచున్నది.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।

స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే।౧౫॥

ప్రాణులకుదుఃఖమును గలుగఁజేయనిదియు, యథార్థమైనదియు ను ఇహపరలోకములయందలి ఫలములకొఱకైన హితమగు వచనము ను పలుకుటయు వేదాధ్యయనముచేయుటయు నేదిగలదో, అది వాక్కుచేతఁ జేయఁదగిన తపస్సని చెప్పఁబడుచున్నది.

మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః।
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే॥ ౧౬॥

మనస్సును మంచివృత్తిలో నిలుపుటయు, అంతఃకరణవృత్తి విశే

షమును మనస్సు నాత్మ ధ్యానమునందుంచుటయును, మనస్సును అ
న్యవిషయ వ్యాపారములలోనుండి మరలించుటయును, పరులతో వ్య
వహరించునప్పుడు మోసము చేయకయుండుటయును, అనునిది మన
స్సుచేతఁ జేయఁదగిన తపస్సని చెప్పఁబడుచున్నది.

శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః।
అఫలాకాఙ్క్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే॥ ౧౭॥

ఫలాపేక్ష లేనివారును, నిశ్చలచిత్తులునగు పురుషులచేత శ్రేష్ఠ
మైన విశ్వాసముతో నాచరింపఁబడినదియు, వెనుకఁ జెప్పఁబడిన మూఁ

ము తెఱంగులుగల తపస్సును సాత్త్వికముగాఁ బెద్దలు సెప్పుచున్నారు.

సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్॥ ౧౮॥

పరులు తన్ను సాధువని చెప్పి సాష్టాంగనమస్కారములను, అగ్రతాంబూలము పాదపూజ మొదలగునవి చేయుటకొఱకును, దంభముచేత తపస్సు చేయఁబడుచున్నదో, నస్థిరఫలము నిచ్చునదియు, సందేహింపఁదగిన ఫలములు కలదియునగు దానిని రాజస తపస్సని యీలోకమునందుఁ జెప్పఁబడుచున్నది.

మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః।
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్॥ ౧౯॥

అవివేకకృతమైన పట్టుదలచేతఁగాని, తనశరీరమును శుష్కోపవాసాదికముచేఁ గష్టపఱచుకొనుటచేతఁగాని, యితరునియొక్క నాశము కొఱకుఁగాని యే తపస్సు సేయఁబడుచున్నదో, అది తామస మని చెప్పఁబడుచున్నది.

దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥

ఈయవలసిన దేయను నిశ్చయముతోనే దానము పుణ్యదేశముల యందును, పుణ్యకాలములయందును, సత్పాత్రమునందును, ప్రత్యుపకారము చేయ శక్తిలేనివానికొఱకు నీయఁబడుచున్నదో, ఆదానము సాత్త్వికమని తలఁపఁబడుచున్నది.

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥ ౨౧॥

ప్రతిప్రయోజనమునపేక్షించి కాని, ఫలమునుగోరి కాని నీయవలసి వచ్చెనుగదాయను మనఃఖేదముతోఁగూడిన యేదాన మీయఁబడుచు

న్నదో, అది రాజసమని తలఁపఁబడుచున్నది.

అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్॥ ౨౨॥

అపరిశుద్ధప్రదేశమునందును, విశేషములులేనికాలమందును, మూర్ఖుఁడు, దొంగ, హరికథలేని ప్రాకృతనాట్యము చేయువాఁడు, విటుఁడు, భగవద్భజనము వినా ప్రాకృతగానము చేయువాఁడు, ఈ మొదలగు వారికిని, సత్కారములులేనిదియు, అమర్యాదతోఁ గూడినదియునగు నే దానము మీయఁబడుచున్నదో, అది తామసదానమని చెప్పఁబడినది.

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్స్మృతః।
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥ ౨౩॥

పరబ్రహ్మమునకు ఓమ్, అనియు, తత్, అనియు, సత్, అనియు, మూడువిధములుగల నామోచ్చారణము నిశ్చయింపఁబడియున్నది. ఆ నామోచ్చారణము చేత బ్రాహ్మణులును, వేదములును, యజ్ఞములును, పూర్వము నిర్మింపఁబడినవి.

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః।
ప్రవర్తన్తే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్॥ ౨౪॥

ఆ హేతువువలన బ్రహ్మమును జెప్పెడి స్వభావముగలవారలయొక్క శాస్త్రములయందుఁ జెప్పఁబడిన యజ్ఞదానతపస్సులనెడి సత్కర్మములు, ఓ మని చెప్పినపిమ్మటఁ (అన్నికర్మలలోను) బ్రారంభింపఁబడుచున్నవి.

తదిత్య నభిసన్ధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః॥ ౨౫॥

ముముక్షువులచేత తత్, అనెడి బ్రహ్మాభిధానము నుచ్చరించి ఫలమును కోఁఉక యనేకవిధములగు యజ్ఞములు తపస్సులు దానములనెడి

కర్మములను చేయఁబడుచున్నవి.

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ ప్రయుజ్యతే।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే॥ ౨౬॥

ఓ యర్జునుఁడా! కలదనెడి యర్థమందును, మంచిదియనెడి యర్థమందును, సత్, అనెడియీ బ్రహ్మనామము ప్రయోగింపఁబడుచున్నది. శుభకార్యమందును, సత్, అనెడి పదము ప్రయోగింపఁబడుచున్నది.

యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే।
కర్మచైవ తదర్థీయం సదిత్యేవా౽భిధీయతే॥ ౨౭॥

యజ్ఞమునందును, తపస్సునందును, దానమందును, ఉనికి సత్, అని చెప్పఁబడుచున్నది. వానికనుకూలమైన కర్మములనుకూడ సత్, అనియే చెప్పఁబడుచున్నది.

అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్।
అసదిత్యుచ్యతే పార్థ! నచతత్ప్రేత్యనో ఇహ॥ ౨౮॥

అవిశ్వాసముతో హోమమును, (బ్రాహ్మణులకీయఁబడు) దానమును, చేయఁబడిన తపస్సును, స్తుతి నమస్కారాదులగు నితరకర్మము నేదో యది, ఓ యర్జునుఁడా! అసత్తని చెప్పఁబడుచున్నది. ఆ కర్మ

మునకు పరలోకమునందును, ఈ జన్మమునందును ప్రయోజనము లేదు.

ఇట్లు,

శ్రద్ధాత్రయ విభాగ యోగమను

పదునేడవ యధ్యాయము

ముగిసెను.

---

శ్రీరస్తు.

# పదునెనిమిదవ అధ్యాయము.

---

## మోక్షసన్న్యాసయోగము.

అర్జున ఉవాచ — అర్జునుఁడుఁ ప్రశ్న చేయుచున్నాఁడు

సంన్యాసస్య మహాబాహో! తత్త్వమిచ్ఛామి వేదితుమ్।
త్యాగస్య చ హృషీకేశ! పృథక్కేశి నిషూదన!॥ ౧॥

ఓ స్వామీ! సన్న్యాసము యొక్కయు, త్యాగము యొక్కయు, యథార్థతను వేర్వేఱుగాఁ దెలిసికొనుటకుఁ గోరుచున్నాను.

శ్రీభగవానువాచ= శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥ ౨॥

కామ్యకర్మములయొక్క విడుచుటను సన్న్యాసశబ్దార్థముగా జ్ఞానులు తెలిసికొనుచున్నారు. సకలకర్మఫలములను విడిచిపెట్టుటను త్యాగశబ్దార్థమునుగాఁ విద్వాంసులు చెప్పుదురు.

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః।
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యమితి చాఽపరే॥ 3॥

కొందఱు వివేకులు దోషముగల కర్మము విడిచిపెట్టఁదగిన దనియు, మఱికొందఱు యజ్ఞమును, దానమును, తపస్సులనెడికర్మములు విడువఁదగనివియనియు, చెప్పుదురు.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ!।
త్యాగో హి పురుషవ్యాఘ్ర! త్రివిధస్సంప్రకీర్తితః॥ ౪॥

ఓ యర్జునుఁడా! పైఁజెప్పఁబడిన త్యాగ సన్న్యాసరూప [illegible]

యవిషయమున నాయొక్క నిశ్చయమును వినుము. ఓ పురుషశ్రేష్ఠుఁడా! త్యాగము మూఁడు విధములుకలదిగా చెప్పఁబడియున్నది కదా?

> యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।
> యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥ ౫॥

యజ్ఞము, దానము, తపస్సులనెడి కర్మములు విడువఁదగినవి కావు. అవిచేయఁదగినవే; యజ్ఞమును, దానమును, తపస్సును, వివేకముగల పురుషులకు చిత్తశుద్ధిని గలుగఁజేయునవి.

ఏతాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ।
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మతముత్తమమ్॥ ౬॥

ఓ యర్జునుఁడా! ఈ కర్మములు చేయవలసినవే, అయితే, అభిమానమును, ఫలములయందాశను విడిచి చేయఁదగినవి యని నిశ్చయింపఁబడినదియు శ్రేష్ఠమైనదియునగు నాయొక్క యభిప్రాయము.

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః॥ ౭॥

ఆవశ్యకముగా విధింపఁబడియుండెడి, కర్మముయొక్క పరిత్యాగ

ము కూడదు. అవివేకమువలననైనను వాటిని విడిచి పెట్టుట తామసగుణముకలవాని ప్రవర్తనయని చెప్పఁబడుచున్నది.

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్।
సకృత్వా రాజసం త్యాగం నైవత్యాగఫలం లభేత్॥ ౮

ఎవ్వఁడు దుఃఖమునుగలుగఁ జేయునదియనిఁ దలచి శరీరప్రయాసభీతిచేత నేకర్మమును విడుచునో, వాఁడు రజోగుణ సంబంధమైన త్యాగముఁజేసి జ్ఞానపూర్వకమగు త్యాగము యొక్క ఫలమగు మోక్షమును పొందనేపొందఁడు.

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున !!
సఙ్గంత్యక్త్వా ఫలంచైవ సత్యాగ స్సాత్త్వికో మతః॥ ౯॥

ఓ యర్జునుఁడా ! శాస్త్రీయముచే నియమింపఁబడిన యే కర్మము చేయఁబడవలసినదేయని యభిమానమును ఫలమును విడిచిచేయఁబడుచున్నదో, అట్టి త్యాగము సత్త్వగుణసంబంధమైనదని నా సమ్మతము.

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥ ౧౦॥

సత్త్వగుణముచే వ్యాపింపఁబడినవాఁడును, ఆత్మయందు స్థిర

బుద్ధిగలవాఁడును, సంశయమును బోఁగొట్టుకొనినవాఁడును త్యాగి యనగు నిత్యకర్మములను జేయువాఁడు, దుఃఖకరమగు సంసారబంధ హేతువైనకర్మమును ద్వేషింపఁడు, సుఖకరమగు నిష్కామమునం దభిమానింపఁడు.

నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే॥ ౧౧॥

కర్మములను సంపూర్తిగా విడుచుటకు దేహాభిమానియైన యజ్ఞాని కసాధ్యమైనదికదా? గనుక ఎవ్వఁడేని(అట్టి యజ్ఞాని)కర్మఫలములైన

విడుచుచున్నాఁడో, వాఁడుత్యాగియని చెప్పఁబడుచున్నాఁడు.

అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్॥

దుఃఖకరమగు నీచజన్మము మొదలగునదియు, సుఖకరమగు దేవతాజన్మము మొదలగునదియు, సుఖదుఃఖ కరమగు మనుష్యజన్మము నగు మూఁడువిధములైన కర్మములయొక్క ఫలము, స్వానుభవము లేక ఫలాపేక్షతో దేహాభిమానులై కర్మములను జేయు నజ్ఞానులకు మరణానంతరము కలుగుచున్నది. దేహాభిమానమునువదలి, స్వానుభవమును

శ్రేయః పరమార్థ సన్న్యాసులకో యొకానొకప్పుడైనను గలుగదు.

పఞ్చైతాని మహాబాహో! కారణాని నిబోధ మే।
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥ ౧౩॥

ఓ యర్జునుఁడా! సమస్తకర్మములయొక్క సంపూర్తికొఱకుఁ గర్మములను నశింపఁజేసెడి వేదాంత శాస్త్రమునందుఁ జెప్పఁబడియుండు ముందుఁ జెప్పఁబడు నయిదును కారణములని నాచేఁ దెలిసికొనుము.

అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్॥ ౧౪॥

శరీరమును, ఆలాగుననే కర్తయును, చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు-యని జ్ఞానేంద్రియములయిదును, వాక్కు-, హస్తము పాదము, గుదము, ఉపస్థము, అని కర్మేంద్రియములయిదును, మనస్సు, బుద్ధి యనెడి పండ్రెండింద్రియములును, నానా విధములుగాను, వేఱువేఱుగాను నుండు ప్రాణాపాన, వ్యానోదాన, సమానములనెడి పంచప్రాణములు మొదలగునవియు వీనిలో నంతర్యామియనగు నీశ్వరుఁడు నయిదవ కారణము.

శరీర వాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః।
న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః॥ ౧౫॥

మనుష్యుఁడు శరీరము, వాక్కు, మనస్సు వీనిచేతశాస్త్రోక్తము గాఁగాని నశాస్త్రీయము గాఁగాని యేకర్మము నారంభించుచున్నాఁడో, ఆకర్మమునకు వెనుకఁజెప్పఁబడిన యీ యయిదును కారణములుగానున్నవి.

తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః।
పశ్యత్యకృత బుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః॥ ౧౬॥

ఆకర్మవిషయమందు యీ యయిదును గారణముగానుండఁగా నిరుపాధికుఁడుగాను, సంగరహితుఁడుగాను నుండు నాత్మను, కర్తనుగా నెవ్వఁడు చూచుచున్నాఁడో, దుర్బుద్ధిగల యట్టివాఁడు సంస్కరింపఁబడని బుద్ధిగలవాఁడగుటచేత కర్మస్వరూపమునుగాని, ఆత్మస్వరూపమునుగాని, ఎఱుఁగఁడు.

యస్య నాఽహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే।
హత్వాపి స ఇమాన్లోకా న్న హన్తి న నిబధ్యతే॥ ౧౭॥

ఎవ్వనికి నేనుగర్తననెడి తలంపులేదో, ఎవ్వనియొక్క యంతః

కరణము విషయములనంటదో; వాఁడీలోకమున నుండు ప్రాణులను చంపియు చంపినవాఁడు కాఁడు, బంధింపఁబడఁడు.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మ చోదనా।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మ సఙ్గ్రహః॥ ౧౮॥

కర్మమును నడిపించుటకు హేతువైనది తెలివియనియు, తెలియఁబడఁదగిన వస్తువనియు, తెలియువాఁడనియు, మూఁడు విధములు గలవి. కర్మమునకాధారము బాహ్యేంద్రియములగు శ్రోత్రాదులును అంతరింద్రియములగు బుద్ధ్యాదులును, క్రియకాధారమైన వస్తువును

చేయువాఁడును యని మూఁడువిధములు గలవిగానున్నవి.

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః।
ప్రోచ్యతే గుణసఙ్ఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి॥ ౧౯॥

గుణములయొక్క స్వరూపమును జెప్పఁబడిన సాంఖ్యశాస్త్రము నందు జ్ఞానంబును కర్మంబును, కర్తయును, సత్త్వాదిగుణములయొక్క భేదమునుబట్టి మూఁడువిధములుగానే చెప్పఁబడుచున్నది. ఆ జ్ఞానాదులనుగూడ యథాశాస్త్రముగా వినుము.

సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥ ౨౦॥

వేఱువేఱుగానుండు బ్రహ్మ మొదలుకొని స్థావరాంతములగు సమస్తవస్తువులయందు నెడతెగక నిండియుండు నట్టి వస్తు వొక్కటియే యనియు, వికారరహితమైనదనియు, నేజ్ఞానముచేతఁ దెలిసికొనుచున్నాఁడో, ఆజ్ఞానము సత్త్వగుణమువలనఁబుట్టినదని తెలియుము.

పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్।

వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్॥ ౨౧॥

సమస్తభూతములయందును ఒక్కొక్కశరీరమం దొక్కొక్కజీవుఁడని వేఱువేఱుగా నుండుటచేత జీవులను భిన్నరూపములుగా నుండువారనియు, ప్రత్యేకమైన లక్షణముగలవారనియు, నేజ్ఞానము తెలిసికొనుచున్నదో, ఆ జ్ఞానమును రజోగుణమువలనఁ బుట్టినదని తెలియుము.

యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే సక్త మహైతుకమ్।
అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతమ్॥ ౨౨॥

దేహమునందుఁగాని ప్రతిమ మొదలగు వానియందుఁగాని పరిపూర్ణమైనవస్తువును జూచినప్పటివలెనే దేహమెంతో, అంతే జీవుఁడనియు, ప్రతిమాదు (విగ్రహము) లెంతో, అంతే ఈశ్వరుఁడనియు, తలంపుతోఁ గూడినదియును, యెందుకీలాగుననుండవలెననుచో నందుకుఁ దగిన యుక్తిలేకుండ నున్నయదియు, అల్ప ఫలమునిచ్చునదియునగు ఏజ్ఞానముకలదో, అది తమోగుణమువలనఁ బుట్టినదియని చెప్పఁబడినది.

నియతం సఙ్గరహిత మరాగద్వేషతః కృతమ్।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే॥ ౨౩

తనవర్ణాశ్రమములకుఁ దగినది గా నియమింపఁబడిన యే కర్మము ఫలాపేక్ష లేనివానిచేత యభిమానము లేకయును, పుత్రాదులయందు ప్రీతియును, శత్రువులయందు ద్వేషమును లేకయును, చేయఁబడిన దో, ఆకర్మము సత్త్వగుణమువలనఁ బుట్టినదని చెప్పఁబడుచున్నది.

యత్తు కామేప్సునా కర్మ సాహఙ్కారేణవా పునః।
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్॥ ౨౪

ఫలాపేక్షగలవానిచేతఁగాని నేనుకర్తయని యహంకారము గలవానిచేతఁగాని నధిక ప్రయాసకరమగు నేకర్మము చేయఁబడుచున్నదో, ఆకర్మము రజోగుణమువలనఁబుట్టినదని చెప్పఁబడియున్నది.

అనుబన్ధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్।
మోహా దారభ్యతే కర్మ యత్త త్తామస ముచ్యతే॥ ౨౫॥

శుభాశుభఫలమును, దేహశక్తి యొక్కయు, ధనము యొక్కయు నాశమును, ఇతరులకుఁగలుగుకష్టమును, తనసామర్థ్యమును, నాలో

చింపక యవివేకముచేత నే కర్మమారంభింపఁబడుచున్నదో, అది తామసగుణమువలనఁ బుట్టినదియని చెప్పఁబడుచున్నది.

ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥ ౨౬.

విడువఁబడిన ఫలాపేక్షగలవాఁడును, నభిమానము లేనివాఁడును, ధైర్యమును పట్టుదలయును గలవాఁడును, ఆరంభించిన కార్యము నెఱవేఱినను నెఱవేఱకపోయినను మనోవికారములు లేనివాఁడును, సత్త్వగుణప్రవర్తనగలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు.

రాగీ కర్మఫల ప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥ ౨౭॥

అభిమానముగలవాఁడును, కర్మఫలము నందును, పరద్రవ్యములయందును నాశగలవాఁడును, పుణ్యతీర్థాదులయందుఁ గూడఁ దన ద్రవ్యమును వ్యయము చేయనివాఁడును, ఇతరులను హింసించియైనను తనకర్మమును జేసికొనువాఁడును, లోపలను వెలుపలను శాస్త్రోక్తమైన యాచారము లేనివాఁడును, కార్యసిద్ధియైనప్పుడు సంతోషమును, చెడినప్పుడు

వ్యసనమునుగలవాఁడును, రజోగుణ ప్రవర్తనగలవాఁడని చెప్పఁబడినాఁడు.

> అయుక్తః ప్రాకృత స్తబ్ధ శ్శఠో నైష్కృతికో ఽలసః
> విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే। ౨౮

మనోనిగ్రహము లేనివాఁడును, పెద్దలుచెప్పుమాటలను విననివాఁడును, జడప్రాయుఁడును, మాయను జేయువాఁడును, ఇతరులను దగా చేసి యవమానము చేయువాఁడును, సోమరియును, వ్యసనముగలవాఁడును, ఒకరోజులోపలఁ జేయవలసిన దానిని నెలలోనైనను జేయలేని

వాఁడును, తామసగుణప్రవర్తన గలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు.

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు।
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ!॥ ౨౯॥

ఓ యర్జునుఁడా! గుణములనుబట్టి మూఁడు విధములుగాను సంపూర్ణముగాను వేఱువేఱుగాను చెప్పఁబడఁగల నిశ్చయజ్ఞానముయొక్కయు, ధైర్యముయొక్కయు, భేదమును వినుము.

ప్రవృత్తించ నివృత్తించ కార్యాఽకార్యే భయాఽభయే।
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ॥ ౩౦॥

ఓ యర్జునుఁడా! కర్మమార్గమును సన్న్యాసమార్గమును కార్యాకార్యములను భయాభయములను బంధమును మోక్షమును యే తెలివి తెలిసికొనుచున్నదో, అది సత్త్వగుణప్రధానమైనది.

యయా ధర్మ మధర్మంచ కార్యం చాఽకార్యమేవచ।
అయథావత్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ॥ ౩౧॥

ఓ యర్జునుఁడా! ఏ బుద్ధిచేత శాస్త్రోక్తమైన కర్మమును, శాస్త్రవిరుద్ధమైన కర్మమును, చేయఁదగినదానిని చేయఁదగనిదానిని, ఉన్నది

యున్నట్లు కాక తెలిసికొనుచున్నాఁడో, ఆ బుద్ధి రజోగుణప్రధానమైనది.

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽవృతా।
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ! తామసీ॥ ౩౨

ఓ యర్జునుఁడా! ఏ బుద్ధి యవివేకముచేఁ గప్పఁబడినదై అశాస్త్రీయమైన దానిని శాస్త్రోక్తమనియు, (ఎట్లనిన, ప్రస్థానత్రయమగు శ్రీ భగవద్గీత ఉపనిషత్ భాష్యము సూత్రభాష్యము మొదలగు మోక్ష సాధనమగు గొప్ప గ్రన్థములను ప్రవచనము చేయునప్పుడు కూర్చుండి

చేయవలెననునది శాస్త్రీయమైనను, అది కూడదు నిలిచియే చెప్పవలె
నని యశాస్త్రీయముగాఁ జేయుట మొదలగునవి ) యుంచిపనులను విప
రీతముగాను (అనఁగా, వ్యభిచారము కూడదనునది స్త్రీలకు ముఖ్యధర్మ
ముగా నుండినను, సన్తతికలుగుటకొఱకై స్త్రీలు వ్యభిచరించవచ్చునను
నది) తలంచుచున్నదో, ఆ బుద్ధి తమోగుణ ప్రధానమైనది.

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః,
యోగేనాఽవ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ ! సాత్త్వికీ॥ ౩౩ ॥

ఓ యర్జునుఁడా! చిత్తైకాగ్రతచేత విషయములలోఁ బ్రవర్తింపనీయకే తెలివితోఁగూడినవాఁడై మనస్సు ప్రాణము, ఇంద్రియములు, వీని యొక్క చేష్టలను నిలువఁబెట్టుచున్నాఁడో, ఆ తెలివి సత్త్వగుణ ప్రధానమైనది.

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున।
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతి స్సా పార్థ! రాజసీ। ౩౪॥

ఓ యర్జునుఁడా! ఏ తెలివిచేత ధర్మార్థకామముల ననుష్ఠించుచు

న్నాఁడో, అభిమానము చేత ఫలము నపేక్షించువాఁడగుచున్నాఁడో, ఆ తెలివి రజోగుణ ప్రధానమైనది.

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ।
న విముఞ్చతి దుర్మేధా ధృతిస్సా పార్థ! తామసీ॥ ౩౫॥

ఓ యర్జునుఁడా! దుర్బుద్ధిగలవాఁడు నిద్రను భీతిని దుఃఖమును సంతాపమును మదించియుండుటను, నే తెలివి చేత విడువకున్నాఁడో, ఆ తెలివి తామసగుణ ప్రధానమైనది.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ!।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి॥ 3౬॥
యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మ బుద్ధిప్రసాదజమ్॥ 3౭॥

ఓ యర్జునుఁడా! మూఁడువిధములైనసుఖమును యిప్పుడు నావలన వినుము. ఏ సుఖానుభవముం దభ్యాసమువలన నానందమును దుఃఖనాశమునుగూడ లెస్సగాఁ బొందుచున్నాఁడో, ఏ సుఖము మొదట విషమువలె నుండునో, జ్ఞానవైరాగ్యాది సిద్ధ్యనంతరము అమృత

తుల్యమైనదిగా నగుచున్నదో, మనోవిశ్రాంతిని గలిగించెడి యా సుఖము సత్త్వగుణ ప్రధానముచేఁ గలిగినదని చెప్పఁబడియున్నది.

విషయేన్ద్రియ సంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥ ౩౮।

ఏ సుఖము విషయములు నింద్రియములును గలిసికొనుటవలన మొదట పరమసుఖముఁ వలెనుండి యంతమందు విషమువంటిదగుచున్నదో ఆ సుఖము రజోగుణ ప్రధానముచేఁ గలిగినదని తలఁపఁబడుచున్నది

యదగ్రేచానుబన్ధేచ సుఖం మోహన మాత్మనః।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్॥ ౩౯॥

ఏ సుఖము యారంభమందును నంతమందును తనకు మోహమును గలుగఁజేయునదియు నిద్రవలనను, బద్ధకమువలనను, వృథాలోచన వలనను పుట్టునదియునగు, నా సుఖము తమోగుణ ప్రధానమువలనఁ గలిగినదని చెప్పఁబడియున్నది.

నతదస్తి పృథివ్యాంవా దివి దేవేషువా పునః।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః॥ ౪౦॥

మాయవలనఁబుట్టిన యీ సత్త్వాది మూఁడు గుణములచేత విడవఁ బడిన స్థావర జంగమాది రూపమైన వస్తు వేదిగలదో, అది మనుష్యాదిలోకములనైనను మఱి యెక్కడనైనను లేదు.

బ్రాహ్మణ క్షత్త్రియ విశాం శూద్రాణాంచ పరన్తప!।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః॥ ౪౧॥

ఓ యర్జునుఁడా! బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులకును శూద్రులకును ప్రకృతివలనఁబుట్టిన సత్త్వాదిగుణములచేతఁ గర్మములు వేఱువేఱుగా విభజించి చెప్పఁబడినవి.

శమో దమ స్తప శ్శౌచం క్షా న్తి రార్జవమేవ చ।
జ్ఞాన విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మంకర్మ స్వభావజమ్॥ ౪౨॥

అంతరింద్రియనిగ్రహమును, బాహ్యేంద్రియనిగ్రహమును, తపస్సు, బాహ్యాంతరశుద్ధియు, ఓర్పును, ఋజుత్వమును నిష్కాపట్యమును శాస్త్రజ్ఞానమును, అనుభవజన్యజ్ఞానమును, వేదములయందు నమ్మకమును స్వభావజన్యమైన బ్రాహ్మణుల కర్మములుగా నున్నవి.

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్।
దాన మీశ్వరభావశ్చ క్షాత్త్రం కర్మ స్వభావజమ్॥ ౪౩॥

శూరత్వంబును, కీర్తియును, ధీరత్వంబును, సామర్థ్యంబును, యుద్ధమునందు పాఱిపోకయుండుటయును, దానంబును, సమస్త ప్రజలను న్యాయముగా ధర్మపద్ధతి తప్పకుండ నేలుటయునను నివి స్వభావజన్యమైన క్షత్రియకర్మము.

కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ ౪౪॥

దున్నుటయు, పశువులనుగాచుటయూ, వర్తకము చేయుటయూ స్వభావమువలనఁగలిగిన వైశ్యకర్మము. మఱియు శుశ్రూషా రూప

మైన కర్మము శూద్రునికి స్వభావజన్యమైనది.

స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు॥ ౪౫॥

తనతన వర్ణాశ్రమవిహిత కర్మమునందు శ్రద్ధగల మనుష్యుఁడు జ్ఞానయోగ్యతను బొందుచున్నాఁడు. తనస్వజాతికర్మమున నాసక్తిగలవాఁడేవిధముగా జ్ఞానయోగ్యతను పొందుచున్నాఁడో, ఆమార్గమును వినుము.

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥ ౪౬॥

ఏ యంతర్యామి యగు నీశ్వరునివలన ప్రాణులకుత్పత్తి మొదలగు చేష్ట కలుగుచున్నదో, నీ సమస్తమైన ప్రపంచమును వ్యాపింపఁబడినదో వానిని, మనుష్యుఁడు తనవర్ణాశ్రమ కర్మములచేత నారాధించి జ్ఞానయోగ్యతను బొందుచున్నాఁడు.

శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ ౪౭॥

తనయొక్క వర్ణాశ్రమధర్మము విరుద్ధముగాఁగనఁబడినను చక్క
గా ననుష్ఠింపఁబడిన యితర వర్ణాశ్రమధర్మములకంటె శ్రేష్ఠమైనది.
సహజమైన కర్మమును జేయుచున్న యెడలఁ బాపముఁ బొందఁడు.

సహజం కర్మ కౌన్తేయ ! సదోషమపి న త్యజేత్ ।
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥

ఓ యర్జునుఁడా ! స్వభావజన్యమైన కర్మము దోషముతోఁ గూడి
నదైనను విడువఁగూడదు. పొగచేతఁ గప్పఁబడిన నిప్పువలె సమస్త
కర్మములును దోషముచేఁ గప్పఁబడియున్నవి కదా.

అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాఽధిగచ్ఛతి॥౪౯॥

సమస్తములయందుఁ దనదనెడి యభిమానరహితుఁడును, అంతఃకరణనిగ్రహముగలవాఁడునునగు యాశలేనియాత్మజ్ఞాని, శ్రేష్ఠమగు నిష్క్రియమైనసిద్ధిని సమస్తకర్మములను విడుచుటచేతఁ బొందుచున్నాఁడు.

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽప్నోతి నిబోధ మే।
సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠాజ్ఞానస్య యా పరా॥ ౫౦॥

ఓ యర్జునుఁడా ! బ్రహ్మజ్ఞానముయొక్క పరిసమాప్తి యేదో, సిద్ధిని పొందినవాఁ డెట్టిజ్ఞాననిష్ఠచేత బ్రహ్మమును బొందుచున్నాఁడో ఆ విధమును సంక్షేపముగానే నావలనఁ దెలిసికొనుము.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ।
శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥౫౧॥
వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥౫౨॥

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్।
విముచ్య నిర్మమః శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే॥ ౫౩॥

మాయారహితమైన బుద్ధితోఁగూడినవాఁడును, ధైర్యముచేతఁ దనమనస్సును స్వాధీనపఱచుకొనియును, శబ్దాది విషయములను ఆశను, ద్వేషమును, విడిచిపెట్టియు నేకాన్తమైన స్థలంబుల నివసించువాఁడును, మితాహారముఁగలవాఁడును, వాక్కును శరీరమును మనస్సును స్వాధీనము చేసికొనినవాఁడును, యెల్లప్పుడును ధ్యానాభ్యాసము చేయువాఁడును, ఇహపరభోగములయం దాశలేనివాఁ

డును, నేను యనెడి అహంకారమును కామ క్రోధములతోఁగూడిన సామర్థ్యమును దుర్మార్గములయందు ప్రవర్తనను విషయాసక్తిని ద్వేషంబును అభిమానమును విడిచియును, మమకారము లేనివాఁడును, బ్రహ్మైక్యమును బొందుటకు సమర్థుఁడగుచున్నాఁడు.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాఙ్క్షతి।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ ౫౪।

స్వానుభవముగలవాఁడును, ఉపశాంతమైన మనస్సుగలవాఁడును దేనినిఁగూర్చియు దుఃఖింపఁడు లేనిదానిని గోరఁడు. సమస్తభూ

తములయందును సముఁడై సమస్తమును బ్రహ్మమనెడి శ్రేష్ఠమైన భావమును బొందుచున్నాఁడు.

> భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః।
> తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥ ౫౫॥

ఎవ్వఁడు నన్ను భక్తిచేత యథార్థముగా మాయ మొదలగు నేయే యుపాధులతోఁ గూడియున్నవాఁడనో, (ఉపాధి శూన్యుఁడై యును, అఖండమైయును, సర్వవ్యాపియైయున్నానో,) అట్టి ప్రకారమును తెలిసికొనుచున్నాఁడో, వాఁడు దానిఁబట్టి నిజముగాఁ

దెలిసికొని పిమ్మట నన్ను బ్రవేశించుచున్నాఁడు. (పరమానందస్వరూపియగుచున్నాఁడు.)

సర్వ కర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్॥ ౫౬।

సమస్త కర్మములను నిష్కామముగా నెల్లప్పుడును జేయువాఁడు నాయందు నియమింపఁబడిన మనస్సు మొదలగునవి గలవాఁడై నాయనుగ్రహమువలన నిత్యమైనదియు వికారములేనిదియు నగు స్థానమును పొందుచున్నాఁడు.

చేతసా సర్వ కర్మాణి మయి సన్న్యస్య మత్పరః।
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ॥ ౫౭॥

సర్వ కర్మఫలములను, వివేకముగల బుద్ధిచేత నా యందు సమర్పించి నాలో నైక్యము నొందుటయే యుత్తమైన స్థానమును పొందుటయను నధ్యవసాయముగలవాఁడవును, చిత్తైకాగ్రతను బొంది యెల్లప్పుడును నాయందు ధ్యానముగలవాఁడవు నగుము.

మచ్చిత్త స్సర్వ దుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి।
అథ చే త్త్వ మహం కారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి॥ ౫౮॥

నా ధ్యానముగల నీవు నా యనుగ్రహముచేత సమస్త దుఃఖములను దాటఁగలవు. నీవు నేనె తెలిసినవాఁడననెడి యహంకారముచేత నేను జెప్పినమాటలను వినవేని చెడిపోదువు.

యద్యహఙ్కార మాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి॥

ఒక వేళ, అహంకారమును పొంది యుద్ధముచేయనని తలంతువేని, నీ యొక్క యీ నిశ్చయము వ్యర్థమగును. ఏలయంటే మాయ నిన్ను యుద్ధమున బ్రవర్తించునట్లు చేయును.

స్వభావజేన కౌన్తేయ! నిబద్ధస్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్॥ ౬౦॥

ఓ యర్జునుఁడా! పూర్వజన్మకర్మశేషమువలనఁ గలిగినదియు, నీయొక్క స్వధర్మమైనదియు నగు కర్మముచేతఁ గట్టఁబడినవాఁడవై నీవు యవివేకముచేత నే యుద్ధము జేయుట కిచ్ఛింపవో, ఆ యుద్ధమును గూడ పరాధీనుఁడవై ముందు చేయఁబోవుచున్నావు.

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి।
భ్రామయ న్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥

ఓ యర్జునుఁడా! యంత్రములనధిష్ఠించియున్నవానివలె సమస్తభూతములను త్రిగుణాత్మకమైన తనశక్తిచేతఁ గర్మములయందు ప్రవర్తింపఁ జేయుచున్న జగన్నియామకుఁడు, సమస్తభూతములయొక్క హృదయప్రదేశమందున్నాఁడు.

తమేవశరణం గచ్ఛ సర్వభావేన భారత!।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥

ఓ యర్జునుఁడా! సమస్తదేహేంద్రియాదులచేతను హృదయప్రదేశమునందుండు నా యీశ్వరునే రక్షకునిఁగాఁ బొందుము. ఆ

యీశ్వర ప్రసాదమువల నుత్తమమైన యుపశాంతిని, నిత్యమైన మోక్షమునుఁ బొందఁగలవు.

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ ౬౩॥

ఈ విధముగా రహస్యమునకంటె నతిరహస్యమైన కర్మ, జ్ఞాన, భక్తివైరాగ్యదిసాధనమైన యీ గీతాశాస్త్రము నాచేత నీకొఱకుఁ జెప్పఁబడినది. ఈ గీతాశాస్త్రమును సంపూర్తిగా విని యే ప్రకారముగాఁ జేయుటకుఁ దలంచుచున్నావో, ఆప్రకారముగాఁ జేయుము.

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥ ౬౪

నా కత్యంత మిష్టుండ వగుచున్నావను నిమిత్తము చేత నీకు హితములైన వానిని మఱలను చెప్పఁగలను. సమస్తరహస్యములకంటె నతిరహస్యమైనదియు, నాయొక్క సర్వోత్తమమైనదియు నగు వాక్యమును వినుము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥ ౬౫॥

నాయందు మనస్సు గలవాఁడవు కమ్ము, నాయందు భక్తి గలవాఁడవు కమ్ము, నన్నారాధించువాఁడవు కమ్ము. నన్నే నమస్కరింపుము. అట్లయిన నన్నే పొందఁగలవు నాకిష్టుఁడవగుచున్నావు. కావున నీతో నిది యథార్థముగాఁ బ్రతిజ్ఞ చేయుచున్నాను.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥ ౬౬ ॥

సమస్త ధర్మాధర్మములను (కర్మఫలములను) విడిచి ఒక్కనన్నే శరణమును పొందుము. ఇట్టి నిశ్చయముగల నిన్ను నేను బంధరూప

ను సమస్తపాపములనుండి విడిపించెదను. దుఃఖింపకుము.

ఇదం తే నాఽతపస్కాయ నాఽభక్తాయ కదాచన।
న చాఽశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి॥

ఈ గీతార్థతత్త్వము నీకు నాచేతఁ జెప్పఁబడినది. సంసారమునుండి తప్పించుకొనవలెనను మనోవ్యాకులత్వము లేనివానికిని, నీశ్వరునియందు భక్తిలేనివానికిని, పై రెండు గుణములుండినను శుశ్రూష చేయనివానికిని (జ్ఞానేంద్రియకర్మేంద్రియములను సద్విషయములం దుపయోగింపనివానికిని, అనఁగా, గీతార్థతత్త్వమును వినుట

శాసక్తిలేనివానికి,) ఎవ్వఁడు నన్ను దూషించునో, అతనికొఱకును జెప్పఁదగినది కాదు.

> య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
> భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥౬౮॥

ఎవ్వఁడతిరహస్యమైన యీ గీతాశాస్త్రమును నాయొక్క భక్తుల విషయమై చెప్పఁగలఁడో, అట్టివాఁడు నాయందు శ్రేష్ఠమైన భక్తిని చేసి సమస్త సందేహములును లేనివాఁడై నన్నే పొందఁగలఁడు.

న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః।
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి॥ ౬౯॥

మనుష్యులలో వానికంటె నాకు మిక్కిలి యిష్టమును జేయువాఁడొక్కఁడును లేనే లేదు. నా కతనికన్న నన్యుఁ డెవ్వఁడు నతిప్రియుఁడు భూమియందుఁ గలుగఁబోఁడు.

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః।
జ్ఞానయజ్ఞేన తే నాహ మిష్టస్స్యా మితి మే మతిః॥ ౭౦॥

ధర్మమార్గమునుండి తొలఁగని మన యిద్దఱియొక్క యీ సంభా

షణ రూపమైన గ్రన్థము నెవ్వఁ డర్థముతో గురుముఖముగాఁ బఠించి యథాప్రకార మనుష్ఠింపఁగలఁడో, వానిచే (అనుభవజ్ఞానముచేత) నే నారాధింపఁబడినవాఁడనగుదునని నా యొక్క నిశ్చయము.

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపియోనరః।
సోఽపి ముక్తశ్శుభా న్లోకాన్ ప్రాప్నుయా త్పుణ్య కర్మ ణామ్॥

ఏ మనుష్యుఁ డాస్తిక్యబుద్ధిగలవాఁడును, అసూయలేనివాఁడును నై అర్థజ్ఞానము లేకున్నను, ఈ గీతాశాస్త్రమును శ్రద్ధతో వినునో అట్టివాఁడును, సమస్తపాపములచే విడువఁబడినవాఁడై యగ్ని

హోత్రము మొదలగు పుణ్యకర్మములను చేసినవారలయొక్క పుణ్య లోకములను పొందును.

కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా।
కచ్చిదజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనఞ్జయ!?॥ ౭౨॥

ఓ యర్జునుఁడా! ఇది నీ చేత నిశ్చలమైన మనస్సుతో వినఁబడి నదిగదా? ఓ యర్జునుఁడా? నీ యొక్క యవివేకముచేఁ గలిగిన మోహముపోయినదికదా?

అర్జున ఉవాచ—అర్జునుఁడు ప్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు.

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత!
స్థితోఽస్మి గత సన్దేహః కరిష్యే వచనం తవ॥ ౭౩॥

శ్రీకృష్ణస్వామీ! నీయనుగ్రహమువలన నా చేత నాత్మ స్వరూపాను సంధానము పొందఁబడినది. అజ్ఞానము పోయినది; వినష్ట సందేహముగలవాఁడనై యున్నవాఁడను. నీయొక్క మాటను నెఱవేర్చెదను.

సఞ్జయ ఉవాచ—ధృతరాష్ట్రునితో సంజయుఁ డిట్లనియె.

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః।
సంవాద మిమమశ్రౌష మద్భుతం రోమహర్షణమ్॥ ౭౪॥

నే నీవిధముగా మహాత్ముఁడగు శ్రీకృష్ణమూర్తియొక్కయును యర్జునునియొక్కయును, నత్యాశ్చర్యకరమైనదియు తలంచునప్పుడెల్ల, పులకరింతను గలుగఁజేయునదియునగు నీ గురుశిష్యసంభాషణమును వింటిని.

వ్యాస ప్రసాదా చ్ఛ్రుతవా
నేతద్గుహ్య మహం పరమ్।
యోగం యోగేశ్వరా త్కృష్ణాత్
సాక్షాత్కథయ తస్స్వయమ్॥ ౭౫

వ్యాస మహర్షి యొక్క యనుగ్రహమువలన రహస్యమైనదియు శ్రేష్ఠమైనదియునగు జ్ఞానయోగమును దెలియఁజేయు నీ గీతాశాస్త్రమును తానుగానే యర్జునునికిఁ జెప్పినవాఁడును సమస్తయోగము

లయు నీశ్వరుఁడునగు శ్రీకృష్ణస్వామివలన నేను స్వయముగా విన్నవాఁడనైతిని.

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమ మద్భుతమ్।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామిచ ముహుర్ముహుః॥

ఓ ధృతరాష్ట్రమహారాజా! ఆశ్చర్యకరమైనదియు పరలోకసాధనమైనదియు నగు శ్రీకృష్ణార్జునులయొక్కయు నీ గురుశిష్యసంభాషణమును తలంచితలంచి మాటిమాటికి నానందించుచున్నాఁడను.

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః।
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామిచ పునః పునః॥

ఓ ధృతరాష్ట్రమహారాజా! శ్రీ కృష్ణమూర్తియొక్క మిక్కిలి యాశ్చర్యకరమైన ఆ విశ్వరూపమును తలంచి తలంచి నాకు నధికముగు నాశ్చర్యము కలుగుచున్నది. మాటిమాటికిని నానందించుచున్నాఁడను.

యత్రయోగీశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయోభూతి ర్ధ్రువానీతి ర్మతిర్మమ॥ ౭౮॥

ఏ పక్షమునందు యోగీశ్వరుఁడైన శ్రీ కృష్ణుఁడును, ఏ పక్షమునందు ధనుస్సును పట్టిన యర్జునుఁడున్నారో యా పక్షమునందు రాజ్యలక్ష్మియును జయలక్ష్మియును ఐశ్వర్యాభివృద్ధియును న్యాయమును తప్పక కలుగునని నా యొక్క యభిప్రాయము.

ఇట్లు లక్షగ్రంథముగలదియు వ్యాసనిర్మితమయినదియునగు శ్రీ మహా
భారతమునందు భీష్మపర్వమున నుపనిషదర్థప్రతిపాదకంబును
బ్రహ్మవిద్యాస్వరూపంబును యోగశాస్త్రంబును శ్రీ
కృష్ణార్జునసంవాదంబును నగు శ్రీ భగవద్గీత

లలో మోక్షసన్న్యాస యోగమను
పదునెనిమిదవ యధ్యాయము
ముగిసినది. ఓమ్తత్సత్.

---

శ్రీమత్పరమహంస శ్రీ బాలసుబ్రహ్మణ్య బ్రహ్మస్వాముల
వారిచే రచియింపఁబడిన పుస్తకములవివరము.

Bramhananda Mundiram,
Guntur.

| | Rs. | As. | Ps. |
|---|---|---|---|
| 1. శ్రీ భగవద్గీతా గూఢార్థదీపిక శ్రీ స్వాములవారిపటముతో Bound | 6 | 0 | 0 |
| Do Do. Unbound ... ... | 5 | 0 | 0 |
| 2. కేనోపనిషద్దీపిక ... ... ... | 0 | 12 | 0 |
| Do. in Tamil ... ... | 0 | 12 | 0 |
| 3. ఈశావాస్యోపనిషత్ టీక ... ... | 0 | 8 | 0 |
| Do. in Tamil ... ... | 0 | 8 | 0 |
| 4. శ్రీభగవద్గీతా రహస్యార్థబోధిని శ్రీ స్వాములవారి పటముతో మొదటి వాల్యూమ్ | 0 | 8 | 0 |
| Do. in Tamil ... ... | 0 | 8 | 0 |

| | | | |
|---|---|---|---|
| 5. శ్రీభగవద్గీతా తాత్పర్యదీపిక శ్రీ స్వాములవారిపటముతో Bound | 0 | 6 | 0 |
| Do. Do. Unbound ... | 0 | 4 | 0 |
| Do. in Tamil ... ... | 0 | 4 | 0 |
| 6. పురుష సూక్త రహస్యార్థ దర్పణము ... | 0 | 2 | 0 |
| Do. in Tamil ... ... | 0 | 2 | 0 |
| 7. ఇంగ్లీషులో బొట్టు, యజ్ఞోపవీతము, శ్రీవిష్ణుమూర్తి మొదలగువాటినిగూర్చి వివరముగా వ్రాయఁబడినది | 0 | 2 | 0 |
| 8. విగ్రహారాధన ఆవశ్యకమగునా కాదా? ... | 0 | 2 | 0 |